నెల్లూరు మందిర ఆరాధ్యదేవత



చంద్రోపల మూర్తి

శ్రీ వేంకటేశాయనమః

# షిర్డి సాయిభగవాన్

ఒక ఆంగ్లేయుని మహిమోజ్జ్వల
కథనము

మరుపూరు కోదండరామరెడ్డి

# విషయానుక్రమణి



******

# షిర్డి సాయిభగవానునిగూర్చి

# (THE INCREDIBLE SAI BABA)

## ఈ మహిమాన్విత వ్యాఖ్యానమును వ్రాసిన

# ఆర్థర్ ఆస్‌బోరన్

లండను మహానగరమందు జన్మించి, ఆక్స్ఫర్డ్ విశ్వకళా పరిషత్తు నందు స్నాతకుడైనవాడు.

పూర్వజన్మ పరిపాకముచే ఆధ్యాత్మిక విద్యాసక్తుడై, హిందూ వేదాంతము - యోగమునందు ప్రీతిగొని, అరుణాచలవాసి, శ్రీ రమణమహర్షి పూజ్యపాదులవారి సన్నిధిలో అనేక వత్సరములు నివసించినాడు. వారిని గూర్చి కొన్ని పుస్తకములు వ్రాసిరి.

ఈ ప్రతీచీ సాధకుడు ప్రాచ్య విజ్ఞానమును, ఇచటి సిద్ధుల మహిమ లను భూతల వాసనాలంపటులైన పరమటివారికి తెలిపి, యీ అవిశ్వాస తార్కిక యుగమున దైవ విభూతియందు విశ్వాసము కలిగించుటకు ప్రయత్నించుట శుభావహము.

తూర్పున ఉదయించిన విజ్ఞాన జ్యోతిని, యిట్లే పూర్వము అరబ్బులు యవనులు, అవల ఇటలీవారు పరమటికి గొనిపోయి ఉండిరి.

షిర్డీ సాయిభగవానుని దివ్యతేజము సంస్కార హృదయుడైన అస్ బోరనును చకితము జేసినది. మొదట నిజ పాశ్చాత్య హేతువాద ప్రీతి హృదయ మును నమ్మబలుకుకొని, బాబా మహిమల మాహాత్మ్యముల జీవితాంశముల స్వజాతికి తెలుపుచున్నాడు యీ రచయిత. ఈ వ్రాత ప్రశంసార్హమైన కళాఖండము. శ్రీ బాబా ఉపదేశములు అప్రతిమాన దీపకములు! ఈ శతాబ్దికి జాగృతి శంఖారావములు! అని యీ ఆంగ్లేయుని విశ్వాసము.

— అనువాదకుడు

# అనువాదకుని మాట



మన్మిత్రుడు, నెల్లూరు మండలమున సాయిభక్తి వట మహా వనస్పతికి బీజము, డాక్టర్ రాజగోపాలాచారిగారు - ఆర్థర్ ఆస్‌బోర్న్ రచిత ది ఇన్‌క్రెడిబుల్ సాయ్‌బాబా అను ఆంగ్ల గ్రంథము - సాయి పురాణ మనదగిన పూతకృతిని చదివి చకితులై, తెనుగున యింతవరకు సాయిభగవానుని జీవితాంశములు మహిమలు ఉపదేశములు కలిగిన సమగ్ర గ్రంథము లేదని భావించి, ఈ గ్రంథమునకు తెనుగుసేత యీ కొరత నన్నిటిని తీర్చునని నిశ్చయించుకొని, నన్ను పిలిచి - 'ఓయీ, యీ పనికి నీవ తగిన వాడవని పెద్దలందురు; వెంటనే అనువదించి, సాయిదేవుని కరుణామృత సంసేవనముచే తరింపుము' - అన్నారు.

ధన్యుడనైతి ననుకొని, సుకృతపరిపాకమున ప్రాప్తించిన యీ ముక్తిదాయక మహాకార్యమునకు భక్తి పురస్సరముగ 25-8-58 శుభ దినమున ఉపక్రమించి, శ్రీ ఏడుకొండల దేవుని కృపాతిశయమున 19-12-58 నాటికి పూర్తిజేసితిని. కృతకృత్యతకు ఆనంద పులకిత గాత్రుడనై సాయిభగవానునికి అంజలించితిని.

ఆంగ్లమునుండి చేసిన ఈ అనువాదమున వేదాంత పారిభాషిక పదములను, దార్శనిక విషయములను పరిశీలించి సరిజేయమని కోరగా - ముప్పది ఏండ్లుగా నాపై తరుగని ఆదరముచూపు హితైషులు, వాక్శుద్ధి కలిగిన దైవజ్ఞులు, సకల కళాకుశలురు, అష్టాదశ పురాణములను ముమ్మారు

అచమనప్రాయముగ పురాణము చెప్పిన అపర సూతులు, ప్రస్థాన త్రయమును పాఠముచెప్పు దైవవిద్యావేదులు, సంశుద్ధ అంతఃకరణ పూజ్యులు, బ్రహ్మశ్రీ స్వయంపాకుల వేంకటశేషశాస్త్రిగారు ఓపికతో సాంతముగ దీని విని సవరించినందులకు వారికి హృత్ పూర్వక నమస్కృతులు.

ప్రూఫులు దిద్దుపనిలో విసుకుగొనక తోడ్పడి, దొసగుల సవరించి గ్రంథమునకు విశుద్ధిని గూర్చిన అధ్యాపకావతంసులు, జీవకవితా శిల్పులు, శబరబాల రామతారకాది రసవత్తర కావ్యకర్తలు - బ్రహ్మశ్రీ కోట సుబ్రహ్మణ్యశాస్త్రిగారికి వందన శతము.

ప్రచురణ - అంకిత సమర్పణ విషయములందు నాకు తోడ్పడిన మిత్రులు సరస హృదయులు, గుణపక్షపాతులు శ్రీ ఈడ్పుగంటి సురేంద్రనాథ (న్యాయశాస్త్ర పట్టభద్రులు) గారికిని, ఆర్తిజన సేవాలోలులు రక్తదాత శ్రీ ఎస్. వి. నరసింహారావుగారికిని (అధివక్తలు) కృతజ్ఞతను తెలుపుకొన్నను, పేర్మి గలిగిన వీరల స్నేహమునకు ఇది తగిన పారితోషికము కాజాలదు.

పోతన్న అన్నట్లు - వేరుపలుకగనేల అనియే ఈ సాయి లీలామృతమును గ్రోలి, పాత్రికలనింపి ఆంధ్రావళికి అందజేయుచున్నాను.

— మరుపూరు కోదండరామరెడ్డి.

మందాకినీ కార్యాలయము
నెల్లూరు.
1960 వత్సర గణతంత్ర దినోత్సవము.

కృతిభర్త



విద్యాగోష్ఠి ప్రియులు

శ్రీ గోగినేని వేంకటేశ్వరరావుగారు



# మాననీయ గోగినేని వేంకటేశ్వరరావుగారికి

## కృ తి స మ ర్ప ణ ము

మహోదయా,

ఇదే కృతజ్ఞతాంజలి !

ఆంధ్ర కవిసమయమున సప్త సంతానములలో కృతి చిరంతన సౌభాగ్య సంతానము. దీన పుణ్యము యశము బొంద వచ్చునందురు. మఱికొందఱు మేలి కృతివలనకీర్తియు సుగతియు గూడ కలుగునంద్రు.

గీ. తరుతటాకాది సంతతుల్ ధరణి నెచట
నిలిపి రచటనేయుండు; వానికిని గృతి ము
ఖంబుననె విశ్వవిఖ్యాతి గాన, కృతియె
సంతతి వసంత (ము) - - -

అని వసుచరిత్రకారుడు నుడివి,

కృతిసంతాన కీర్తి వ్యాప్తిని, స్థాయిని, స్థిరత్వమును ఉగ్గడించిరి.

ఈ నా కవితాకన్య స్వర్గవాసనాబంధురము. మహా పురుష దివ్య మహిమాన్వితము. హిందూమత ప్రబోధ పీయూషపాత్రము. సమదర్శనుడైన ఒక మహాజ్ఞాని ప్రవచన ముక్తావళి. ఆర్య సంస్కృతీ జాగరణ శంఖారావము. ముక్తి మార్గదర్శిని. ఈ సాధ్వి పుట్టినింటికిని మెట్టినింటికిని పేరు తేగలిగిన నిత్య సుమంగలి. ఆర్య కావున మీ కీర్తి లక్ష్మి సవతి యగుటకు మూతి త్రిప్పుకొనని అనుకూలవతి. మఱియు మీ యశోరేఖలతో దిగంత దంతావళ కుంభఫలకముల కై సేయగలిగిన కళాస్వరూపిణి. దాన ధార ప్రక్షాళితమైన మీ విపుల ఫాలభాగమునకు కీర్తి కుంకుమ దిద్ద గలిగిన పుణ్య సీమంతిని యీ కృతి.

వేంకటేశ్వరరాయా, మీ బోటి ఆంధ్ర భాషావధూటీ సల్లాప ప్రియులు, రసికులు, వితరణ దానకళాధౌరేయులు, వరసులు యీ కృతిని స్వీకరించి మమ్ము ఆదరించుట ఒక సముచిత గౌరవము. విద్యాపోషణముః

ఇప్పటికే మీ కీర్తి సుధ ఆంధ్రావనీ మహా మంటపమునకు మైపూత అయినది. మానికొండలోను సైదాపురమునందును మీరు నెలకొల్పిన విద్యామందిరములందు సరస్వతీదేవి వల్లకి మీ కీర్తి గీతము లాలపించుచున్నది. విజయవాడయందలి భూరి లయోలా విద్యార్థి వసతి గృహము విద్యోపాసకులైన తరుణ హృదయులకు ఆశ్రయమిచ్చి, భావి భారత పౌరులుగ దిద్దుచున్నది. హిమవత్పర్వత సానుదేశమున, పావన భాగీరథీ తీరస్థ హృషీకేశమున మీరు సంతన పరచిన ధర్మశాల మీ ఆర్ష సంప్రదాయ పోషణమును అచట దివ్యాలయ ఘంటారావములతో మేళవించి ఎలుగెత్తి పాడుచున్నది. విజయవాడ జింఖానా క్రీడాకేంద్రమునందు మీరు కట్టించిన అతిథిగృహము మీ వంశ నైసర్గిక అతిథేయప్రీతి సౌజన్య ఛ్ఛాయలక్రింద విశ్రామ సుఖము నొసంగుచున్నది.

సైదాపురమునందు ముస్లిం సోదరులకు ఒక పవిత్ర ప్రార్థ నాలయమును (మస్జిద్) మీరు నిర్మించియిచ్చుట మత సహన స్నిగ్ధమైన మీ సమదర్శనమును చాటుచు, నేటి మాత్సర్య కల్లోలిత ప్రపంచ వాతావరణమునకు నైర్మల్యమును గూర్చుచున్నది. కావుననే సర్వమత సమైక్యమును చాటి, కామ్యకర్మల అదరించిన అధునిక జ్ఞానజ్యోతి పరిపూర్ణుడు స్థితప్రజ్ఞుడు సద్గురు సాయిబాబా దివ్యలీలా విభూతియైన ఈ గ్రంథము మీ నామాంకిత మగుట ఎంతయు ఒప్పిన స్వీకారము.

ఇవిగాక, మీరు బంధుకోటిపై చూపు అభిమానము, పని వారిపై ప్రసరింపజేయు దయ, వ్యాపారులకు చూపు తోడ్పాటు, విద్యాధికుల సమాదరించు తెన్ను, విద్యార్థులకు దోసిళ్లతోబెట్టు విద్యా పోషక బహూకృతులు, మానవాళిపై మీరు ప్రసరింపజేయు కృపాంగావలోకనములు మీ బహుముఖకీర్తిని మహిమ పరచు చున్నవి.

ఇట్టి యశోవర్ధనులైన మీకు యీ కృతిని అంకితమిచ్చి ఆనందించ గలుగుచున్నాడను. సాయిభగవానుడు మీకు మీ వంశమువారికి పురుషార్థ చతుష్టయము నిచ్చి బ్రోచుగావుత.

అంధ్రభారతి మంజుల మంజీర రవము సుస్వనముల ఎంతవరకు నినదించుచుండునో అంతవరకు యీ కావ్యము అర్ష జనప్రియమై తనరుచు, మీ కీర్తికి చిరంతన చిహ్నమై శోభిల్లును గాక!

శుభమ్ భుయాత్

— మరుపూరు కోదండరామరెడ్డి

శ్రీ వేంకటేశాయనమః

# షిర్డి సాయిభగవాన్

## 1. పరిచయము

"అదిగో! ఆ వెఱ్ఱి ఫకీరు మగలా వస్తున్నాడు, చూడండి!"

విపణివీధిలో నున్న అంగళ్ళవారంతా తలలెత్తి చూపుల నిగిడ్చి, వీదిమొగదలనుండి తమవైపు అరుగుదెంచుచుండిన ఒక దీర్ఘకృశాంగుడైన యువకుని పొడగాంచిరి. ఆయన శక్తిపూర్ణుడయ్యు వైదొలగి ఎడనెడగా నడచుచున్నాడు. ఎవరితోను మాట్లాడుట లేదు.

### షిర్డికి అగమనము

ఆయన ఎవరో ఎవరికీ తెలియదు. 1872 సంవత్సర ప్రాంతాన షిర్డి అను ఒక చిన్న పట్టణమునకు, పదునారేండ్ల ప్రాయంలో విచ్చేసినారు. సాధారణంగా, అందరు ఫకీరులు బైరాగులువలెనే ఆయన ఎక్కడనుండి, ఎందుకు వచ్చినారో తెలియదు. వెంటనే అందుండి వెడలిపోయి, క్రమ్మరి క్రమ్మరి మరల ఆ పట్టణానికేవచ్చి, జీవితాంతము వరకు అందే నిలిచి పోయెను.

వచ్చిన మొదట, ఆ నగరంలో ఒక వేపచెట్టు నీడన పగ లెల్లా కూర్చుండి, రేయెల్లా రానేలమీద పరుండి, ఆ పట్టణ ధార్మికులు పెట్టిన కబళముల తిని, ఆ నీప వృక్షపాద తలముననే నివసించినారు. పరిభ్రమణాలమాని, షిర్డిలో స్థిరావాస మేర్ప రచుకొనిన ప్రారంభములో, అందుండిన ఒక చిన్న హిందువుల గుడిని తమ ఆవాసముగ చేసుకొన దలచిరి; కాని, ధర్మకర్త - మహాల్సపతి, ఆయన ఒక ముస్లిం ఫకీరని భావించి, ఆశ్రయ మీయ నిరాకరించినాడు. చివరకు యీ మహాల్సపతి బాబాకు ప్రియశిష్యుడై నాడు. ఆ ధర్మకర్త మాటప్రకారం, ఆయన దగ్గరనే ఉండిన ఒక మస్జిదుకు (మసీదు) పోయినారు. అదే ఆయన పవిత్రాలయమైనది. ఆదిలో ఆ ముస్లిం ప్రార్థనాలయము చిన్న మట్టిగోడలతో ఉండినది.

ఆ పట్టణానికి వచ్చిపోవుచుండిన హిందూ యోగుల తోను, ముస్లిం ఫకీరులతోను, ఆయన అప్పుడప్పుడు సంభా షించు చుండేవారు. అందులో ఒక సిద్ధుడు ఆ ఊరివారితో- ఆ యువక ఫకీరును గమనించుచుండుడు! ఆయన ఒక మాలి న్యములోని మాణిక్యము - అని చెప్పిపోయినాడు.

కాని, పట్టణవాసులు అంత శ్రద్ధ పెట్టలేదు యీ సాధ కునిపట్ల. వారికి ఆయన కాస్త వెట్టి వేదాంతిగానే తోచినది. ఆయన వారితో ఎన్నడుగాని కలసి మెలసి యుండలేదు; వారితో మాట్లాడినదీలేదు. ఎప్పుడో నమాజు చెప్పేవారు; అదీ సకృతు.

ఆయన అలవాట్లుగూడ చాల వింతగా వుండేవి. ఆయన ఆ మస్‌జిద్ ఆవరణంలో ఒక నెగడును వెలిగించి దానిని ఎన్నడూ ఆరిపోని ఒక అఖండ జ్యోతిగా చేసినారు. అదే నేటికిని కుములుచు మండుచునేయున్నది. ఆ మందిరములో కొన్ని చిన్న ప్రమ్మిద దీపాల వెలిగించి పెట్టినారు.

మొదటి మహిమ

దీపములకు చమురును, రెండు కబళమ్ముల అన్నమును మాత్రమే ఆయన జీవిత. దైనికావసరములు. వీటిని ఆయన స్వయంగా ఊరిలో తిరిప మెత్తుకొనేవారు. ఈయనను చూడగనే, ఒకనాడు కొందరు అంగడివారు అపాంగ గూఢ సంజ్ఞలతో, రుద్ధ మందహాసములతో బాబాను అపహాస్యము చేయుటకు - చమురులేదు పొమ్మన్నారు; ఏమి జరుగునో అని మరి కొందరు చుట్టు మూగినారు. చమురు లేదనగానే, ఆ యువక సన్న్యాసి చట్టున మాటా పలుకు లేకుండా వెనుదిరిగి, చక్కా పోయినారు.

కొత్త వారిని చులకనచేసి యేడిపించునట్టి ఆదిమ ఆరణ్యక గుణము ఆ ఊరివారిని పైకొనినది. కొందరు పోయి, ఆయన యేమి చేయునో చూడవలెననెడు జిజ్ఞాసతో ఆయన నివాసము చేరినారు. వారు ఈ దృశ్యమును దిగ్భ్రమాశ్చర్య భయ భక్తులతో పొడగాంచినారు:- మస్‌జిద్ చేరగానే ఆ ఫకీరు, ఒక మూల ఉండిన మట్టికుండను ఎత్తుకొని, ప్రమ్మిదలలో అందుండిన నీరు పోసిరి. దీపములు చమురు పోసినట్లు మెరసి వెలిగినవి!

ఇప్పుడు ప్రేక్షకులలో అవహేళన సంజ్ఞలుగాని, అపహాస్య హాసములుగాని అంకురించలేదు. హాతాజ్జనిత నిశ్చేష్టతతో, వారు ఆయన పాదముల ముందు బడి, తమ్ము శపించవలదని ప్రార్థించినారు. తాము చేసిన అజ్ఞాన అవచేష్టలను మన్నించి దీవించమని అర్థించినారు.

అది మొదలు ఆ ఫకీరు నెత్తివేదాంతి అన్న అలుకుడే వినబడలేదు. ఇప్పుడు షిర్డి నగరవాసులు అ నీటుగప్పిన నిప్పును కనుగొని ఆదరించి, అర్చించినారు. వారి మధ్యమున ఒక మహిమోన్నతుడు - ఒక అపూర్వ అలౌకిక ధీశక్తి శోభితుడు, నివసించుచున్నట్లు గుర్తించి, సేవించి, ఆనంద కుతూహల ప్రచలిత మానసులైనారు. క్రమేపి, ఆయన ఒక మహర్షియని, ఒక ప్రవక్తయని, ఒక ఉపదేశకుడని, ఆర్తజనసేవా లోలమైన ఆయన మృదుల మానసము అనుకంపాక్షీర పూర్ణమని తెలిసికొని, ఆ దైవాంశ సంభూతుడు తమపై కృపావలోకనముల బరపుచు తమ ముందుండుట తమ పుణ్యఫలమని మురిసిపోవసాగిరి.

సాయిబాబా పద నిర్వచనము

అయినను, ఆయన చేష్టలు ఔచిత్య బాహ్యముగ, విపరీతముగనే యుండినవి. ఆయన శక్తులు నిగూఢముగనే యుండినవి. సామాన్యులకు ఆయన అర్థముకాలేదు. ఆయన పేరేదో ఎవరికీ తెలియదు. సాయిబాబా అనునది ఒక వ్యక్తి పేరుగాదు. సాయి అనునది పారసీకపదము - ఋషి అని అర్థము; బాబా అనునది

హిందీ పదము - గౌరవసూచకమై పితృసముడను అర్థము నిచ్చును. ఆయన, అటు పల్లె - యిటు పట్టణముగాని ఆ షిర్డీ సీ తమ నివాసముగ ఏల చేసికొనినారో ఎవరికీ తెలియదు. అహ్మదా మార్గానికి ఆరుమైళ్ళ దూరమునందుండిన ఆ అజ్ఞాత కుగ్రామము యింతకు ముందెన్నడును ఆధ్యాత్మిక వాసనల ఎరుగదు. అయితే మాత్రమేమి? ఒక అర్థ శతాబ్దము, 1918 లో - ఆయన మరణించు పర్యంతము ఆయన అచటనే వెలసియుండిరి. ఆయన దర్శనమునకు గుమిగూడుచుండిన భక్తులందరు పట్టణవాసులే! దీనికి యేదైన వ్యక్తిగత కారణముండి యుండిన, అదిగూడ ఆయన జీవిత సర్వస్వమువలెనే విశేషాంశాలతో కూడుకొని యున్నది. చాలా సంవత్సరాలు గడచిన తర్వాత, ఆయన కీర్తి చంద్రికలు నాలుగుదిక్కులా వ్యాపించిన తర్వాత, ఒకనాడు ఒక భక్తుని, తాను మొదటవచ్చి కూర్చుండిన వేపచెట్టు మొదట త్రవ్వమనినారు. అందు ఒక పాత సమాధి బయట పడినది! అది, తన పూర్వావతారములో తన గురుదేవుని సమాధి యని ఆయన వెల్లడించిరి.

జన్మాదికములు - బ్రాహ్మణజన్మ

ఇక, ఆయన బాల్యజీవితమునుగూర్చి బొత్తుగా తెలియుట లేదు. పూర్వ హైదరాబాదు సంస్థానములో, ఒక చిన్నపట్టంలో ఒక సామాన్య బ్రాహ్మణ కుటుంబములో జన్మించినట్లు మాత్రం యిప్పటికి నిర్ధారణయైన విషయము. బహుశః ఆయన శైశవ దశలోనే తలిదండ్రులు గతియించియుందురు. కాబట్టే ప్రాపులేని

ఆ బాలకుడు, ఒక ముస్లిం ఫకీరు వెంటబడినాడు. కొంతకాలానికి ఆ ముస్లిం సిద్ధుడుగూడ చనిపోగా, బాబా ఇంకొక హిందూ యోగిని గురువుగా స్వీకరించినారు. సాయికి ఆ గురుదేవునిపట్ల మహాభక్తి శ్రద్ధ విశ్వాసము లేర్పడినవి. ఆయనను వెంకూస అని ముద్దు పేరుతో నోరార బిలిచి తన్మయత నొందేవారు. ఆయన శుశ్రూషభాగ్యమెట్లు తనకు లభించినది, వారిద్దరెట్లు మెలగినది మహా గౌరవభావముతో అభివర్ణించుచుండేవారు.

గురుదేవుడు

నిజ గురుదేవుని గురించి సాయిపాదుల వారిట్లు నుడువు చుందురు:—

'ఒకనాడు మేము ముగ్గురు మిత్రులము పురాణములు మొదలగు మత గ్రంథాలనుగురించి చర్చించుచు, సాయుజ్య ప్రాప్తికి మార్గమెట్లు - అని వివాద పడుచుండినాము.

'ఒక స్నేహితుడు - మన మోక్ష యత్నమునకు మన మీదనే ఆధారపడవలెనుగాని, గురువులపై ఆధార పడరాదు. భగవద్గీతగూడ యిట్లే - ఉత్తిష్ఠ - నిన్ను నీవే తెలుసుకొని మేల్కొనుము - అని చెప్పియున్నది, అని చెప్పినాడు.

'రెండవ మిత్రుడు అన్నాడు:- మోక్షమునకు ప్రధాన విషయ మేమిటనగా - మనస్సును స్వాధీనము చేసుకొని, వృథా చర్చలు యోచనలు శంకలు దానికి అంటకుండా చేసుకొను చుండుటే!

'మూడవ వాని వాదము:- ఈ జగత్తులో మూర్తులన్నియు, రూపములన్నియు అనుక్షణ భిన్నాకృతులను పొందుచు అస్థిరములై యున్నవి. నిరాకార శక్తి ఒక్కటి మాత్రమే అచంచలమై చిరంతనమైయున్నది. కాబట్టి మనము నిత్యానిత్యములను గుర్తించి, అచంచల బుద్ధితో శాశ్వత సత్యమును మాత్రమే ఉపాసించవలెను.

నాల్గవవానికి కేవల సిద్ధాంతములనిన గిట్టవు. ఆయన అన్నాడు:- వృథా వాచాలత ఎందుకు? సర్వాంతర్యామియైన మన గురుపాదులకు మనజీవిత సర్వస్వమును - శరీరమును వాక్కును మనసును సమర్పించి, మన ధర్మమును మాత్రము మనమాచరించవలయును. ఆయన యందలి భక్తి విశ్వాసములే సాధకునికి తరణోపాయములు.

'అడవిలో మేము పోగాపోగా, అచట పనిచేయుచుండిన ఒక వ్యక్తి తటస్థపడినాడు. అతడు ఆమిడి యెండలో యెక్కడికి పోవుచున్నారని మమ్మడిగి, ఇక ముందుకు సాగిపోయినచో దారి డొంకలులేని చిక్కటి పొదలలో తగులుకొని, దారితప్పి పోగలరని ఎచ్చరించినాడు. క్రమ్మరుట మాని, తనతోగూడ తన గుడిసెకువచ్చి, ఉన్నకాస్త గంజి త్రాగమని కోరినాడు. కాని, ఆయన హితవాక్యమును ఆయన ఆతిథ్యాహ్వానమును మేము త్రోసిపుచ్చినాము. ఆ కీకారారణ్యంలో ప్రయాణము

సాగించినాము. చెప్పినంత పని జరిగినది - ఆ భీకర నిబిడ దుర్గమారణ్యములో దారి తప్పగొట్టుకొన్నాము.

'ఆయన మరల మాకు ఎదురుపడినాడు. "నేను చెప్పలేదా? మీ జ్ఞానమును మీప్రజ్ఞనే నమ్మి, మీరు తప్పుదారి పట్టినారు. ఇక ప్రస్తుతము మీకు కావలసినది ఒక మార్గోపదేశకుడు" - అని అంటూ, మరల మమ్ము తన ఆతిథ్యము స్వీకరించమనికోరి, యీ సమాదరణము శుభావహమని కాలదన్న తగనిదని, ఎంతగనో చెప్పినాడు. కాని మరలా ఆయన సత్కారమును నిరాకరించి మా ప్రయాణమును సాగించినాము. కొంత దూరము పోవువరకు నాకు ఆకలివేసినది. నేను వెనుదిరిగి ఆయన దగ్గరకుపోయి, ఆయన యిచ్చిన ఒక రొట్టెముక్కను తిని, నీరు త్రాగితి సేదదీర్చుకొంటిని.

'ఆ తర్వాత గురుదేవుడు ప్రత్యక్షమై మేము తర్కించుకొనుచుండిన విషయ మేమిటి - అని అడిగినారు. నేను ఉన్న సంగతి అంతా వారితో చెప్పితిని. ఇతర మిత్రులు ఆయనపట్ల ఉచిత భక్తిమర్యాదలను చూపక వెడలిపోయిరి. నేను మాత్రము భక్తి వినయపూర్వకముగా ఆయన పాదతలమున సాష్టాంగపడితిని. అంత ఆయన నన్ను ఒక బావి దగ్గరకు తీసుకొనిపోయినారు. ఆ కూపము మీదగా కొమ్మల సాగించియుండిన వనస్పతి శాఖకొక దానికి, నన్ను తలక్రిందులుగా వ్రేలాడగట్టినారు. నా శిరము బావి నీటి మట్టమునకు మూడడుగుల అంతరములో

మాత్రమే యుండినది - జలము నాకందలేదు. ఆస్థితిలో నన్ను వదలి నా గురువు వెడలిపోయినారు. ఆయన ఎచటకు వెడలి నారో నాకు తెలియదు. ఇట్లు నాల్గైదు గంటలు గడచిపోయి నవి. మరల ఆయన నా దగ్గరకువచ్చి, ఎట్లున్నావని అడిగినారు. అపూర్వ ఆనంద తన్మయతలో కాలము గడపితినని నేను ఆయ నకు ప్రత్యుత్తర మిచ్చితిని. దీనితో ఆయన నాపై కరుణించి ఆనందించినారు. నూతి నుండి బయటకులాగి, నన్ను బిగికౌగిట చేర్చి, నిజహస్త పల్లవముతో నా తలను, నా ఒడలును నిమిరి నారు. అత్యంత గౌరవముతో ప్రేమసుధ వర్షించిన వాక్కులతో మాట్లాడి, నన్ను తమ శిష్యునిగా స్వీకరించిరి. ఉత్తర క్షణము లోనే నా తలిదండ్రుల సంగతియే బొత్తుగా మరచిపోతిని! దీనితో నా ఐహిక వాంఛలన్నీ యింకిపోయినవి.

'ఆయనను తదేకధ్యానముతో వీక్షించుచుండుటే నా ఆనందసర్వస్వమైనది. నా చక్షురింద్రియములను ఆయనకే విని మయము చేసితిని; అవి మరియితరమును చూచియెరుగవు. నేను ఆయనను వదలిపెట్టిపోదలచుకొనలేదు. ఈ ధ్యాన సమాధిలో నా గురుపాదుల స్మృతియే నాకు బొత్తుగా తప్పిపోయినది. నా జీవితమంతయు నా దృష్టియందే యేకలక్ష్యముగా లగ్నమై పోయినది! ఆ కేంద్రీకృత దృష్టి నా గురుదేవునియందు సమాధీ కృతమై పోయినది. నా ప్రార్థనమునకు, నా భావములకు ఆయనే

అచంచల యే కైకలక్ష్యమైనారు. ఆత్మ శాంతితో వాక్యశూన్యుడనై ఆ దేవకల్పునికి చేతులుమోడ్చి మ్రొక్కలిడినాను'

సూత్రార్థము

ఇది సాయిబాబాకు సహజమైన విలక్షణ కథనవిధానము! ఈ కథ ఆమూలాగ్రము లాక్షణిక సూత్ర సూచకము. ఈ అరణ్యమే మనస్సును ఆవరించియున్న దుర్గమ మార్గ రహిత ప్రపంచము; ఇచటనే సత్యాన్వేషణ ప్రయత్నము సాగునది. నలుగురు మిత్రులే నాలుగు సాధన మార్గములు. అడవి పనివాడే గురువు! ఆయన ప్రసాదించ దలచుకొనినదే అనుగ్రహము! గురువు కనుపించినాడనగా - యువకుడు ఆహారమును గ్రహించిన వెంటనే దానిని ప్రసాదించిన వ్యక్తియే నిజముగా దైవాంశ శోభితుడైన గురుదేవుడని అర్థము; అందువల్లనే వినమితగాత్రుడై ప్రణామములాచరించి, ఆయన ఆధ్యాత్మికాధికారమును శిరసావహింప కడంగినాడు. తలక్రిందులుగా బావిలోనికి దింపి కట్టివేయుట అనగా - సంసారవృక్షగతుండగు దేహి అహంకారబద్ధుడై అధోగతి నొందుచున్నాడని సూచించుచున్నది.

చల్లటి నీరును దృష్టియందుంచుట అనగా - జలాది భూతమయమగు అంతఃకరణమున ప్రతిబింబించిన ఆత్మచైతన్యము యొక్క పరిస్థితిని తెలుపుటయే అని గ్రహించవలయును. ఇందువల్లనే యాతనామయమైన ఆ సాధనము ఆనంద ప్రపూర్ణమైయుండినది. సహించి సాధించిన చరమ ఫలితముచే యీ క్లేశతాపములు

అఖండ సుఖసాధనములైనవి! గురువులో ఐక్యము పొందుటయే సాధనయోగము. చివరకు, నీరవుడనై అవనత దేహుడనై మ్రొక్కిడితిని అనగా, మోక్షోపలబ్ధియందు, సాక్షాత్కార సాధనమునందు అహమును నిర్మూలించుకొనుటయే అగును.

గురువు సాధారణముగ, తాను నడచిన యోగమార్గమునసే తన శిష్యులను నడపును. అందువలన ఆరవ అధ్యాయంలో తెలిపిన విషయ గ్రహణమునకు యిది ఎంతయు ప్రధానము. అందు బాబా తన శిష్యకోటికి ఒసంగిన ఆధ్యాత్మిక సాధన విధానము వివరింపబడియున్నది.

ఇటుక - కర్మ

ఇంకొక సందర్భములో వారిట్లనిరి:_ 'నా మొదటి గురువు ఆ ఫకీరు మరణానంతరము, ఆయన భార్య నన్ను సెలు గ్రామములో వెంకూసా వద్ద విడిచిపోయినది. అచట ఆయన శిశ్రూషలో పన్నెండేండ్లు గడపి, చివరకు సెలూ గ్రామమును వదలిపెట్టితిని. ఇచటగూడ, యీ పన్నెండు అనగా మేషాది పన్నెండు రాసులనిన్నీ తటస్థ లక్షణమును చెప్పవచ్చును. బాబా, తమ గురువుల మరణానంతరం, షిర్డి చేరునాటికి సరీగా పదహారేండ్ల వాడేనని చెప్పలేము. ఇల్లు వదలినప్పుడు ఎనిమిదేండ్ల ప్రాయమని వారే నుడివియున్నారు; ఇక ఫకీరు శుశ్రూషకు కొన్ని యేండ్లను వదలవలెనుగదా!

బాబా తన జీవితకాలమంతా, ఆయన స్వభావాను

రూపమైన ఔచిత్యాతీత విధమున ఒక సాధారణమైన మట్టి యిటుకను వదలకుండా తనప్రక్కనే పెట్టుకొని యుండినారు. ఇది ఆయనకు ఆయన గురుదేవుడిచ్చినది! చివరకు అది, ఆయన మరణ కాలమునకు కొంత ముందు, 1918లో జారి క్రిందపడి విరిగి పోయినప్పుడు, ఆయన - "విరిగిపోయినది యిటుకగాదు, నా కర్మ! ఇక, అది విరిగిన తర్వాత నేను బ్రతికియుండజాలను" అని వెల్లడించినారు.

ఆయన బాల్యజీవిత విశేషములను, యోగసాధన విషయములను తెలిసుకొనుట మనకంత అవసరముకాదు. ఉచితము - అర్థము - అవసరమని తోచియేయుండినచో ఆయన మనకు చెప్పియేయుండును.

పర్యాప్తకీర్తి

1900 ప్రాంతాన, శ్రీ సాయిబాబా ఖ్యాతి వ్యాపింప ప్రారంభించినది! అదిమొదలు ఆ కీర్తిజ్యోతి నిరంతరాయముగ దశదిశలకు ప్రాకుచునేయున్నది. భారతదేశంలో ఏమూరు మూల పట్టణమునకు పోయినను, ఆ సేతు శీతనగపర్యంతము ప్రతి అంగడి - ప్రతి యింటను బాబా రూపపటము, అగరు ధూపదీప నైవేద్యాదులతో పూజింపబడుటను పొడగాంచగలము. రామాద్యవతారములుగాక, భారతావనిలో యే యితర పుణ్యపురుషుడు గాని, యోగిగాని, బాబా వలె బూజింపబడుటగాని, యిందరు

శిష్యులు కలిగియుండుటగాని ఎరుగము - అని అనుట అతిశయోక్తి కానేరదు.

ఇట్లయ్యు, శ్రీ బాబాను యీ దేశపు పొలిమేరలు దాటిన తర్వాత ఎవరును ఎరుగరు. నాకు తెలిసినంతవరకు యే ఐరోపీయ భాషలోగాని యీయన చరిత్ర ప్రకటింపబడలేదు.

ఇంతటి అసంగతమేల అనగా - పాశ్చాత్యులకు సిద్ధ పురుషుల విషయములో నేడున్న అభిప్రాయములకు సాయిబాబా ఏమాత్రమును సరిపోడు. వారి ప్రకారము ఒక సాధుపుంగవుడు - మర్యాద నమ్రతలతో ప్రవర్తించవలెను; ఎక్కువ మహిమల చూపరాదు; చేసిన లోకోత్తర చర్యలు దిగ్భ్రమను గొలుపరాదు; ఆయన ప్రవచించిన ధర్మములు తత్త్వజ్ఞానమై విజ్ఞానులచే ప్రతిజ్ఞాపూర్ణ వ్యాసావళిగ లిఖింపబడవలెను; ఇంకను అర్థములేని అయోమయ అసంగత వాక్యభాషణములు రచింపబడవలెను. కాని సత్యాన్వేషకులైన యథార్థ ఋషులు స్వానుభవ జ్ఞానముతోనే మాట్లాడురుగాని, అప్రామాణిక అసత్ప్రవర్తనములతో జోలి కలిపించుకొనరు. ఇట్టి వారి ప్రవచనములో నేదైన వైరుధ్యము గాన్పించినచో దానికి కారణము వర్ణనాతీతమైన సత్యమును మాటలతో చెప్పలేకపోవుట; ఒక అభిప్రాయమును ఒక శిష్యుని అభిరుచ్యనుగుణముగ వివరించలేకపోవుటలే అగు చున్నవి. ఒక పర్వత శిఖరమునకు అనేక పార్శ్వ దృశ్యము లున్నవి. ఆచార్యుడు తన బుద్ధిజ్యోతిని ఒక శృంగముపైనగాని,

అనేక శృంగములపైనగాని, వాటినుండి యింకను పైకిపోవు మార్గముపైనగాని ప్రసరింపజేయవచ్చును. అట్టి భిన్న మార్గములు వివిధ విజ్ఞానులచే ప్రకాశవంతము చేయబడి, ఆరోహణ మార్గమధ్యమున ఒక దాని పైన నొకటి దాటిపోవచ్చును; దీనిని చూచి, హ్రస్వదృష్టిగలిగిన వ్యక్తి యీ మార్గములు ఒక దాని కొకటి విరుద్ధములని భావించవచ్చును; కాని గురుదేవునికి చరమ శిఖరము ఏదియో తెలియును; అంతేగాక, యీ మార్గము లన్నియు ఆ పరమగమ్యమునే చేరుననిగూడ ఆయనకు తెలియును.

చదివి ఎరుగరు

సాయిబాబా ఎట్టి గ్రంథముగాని వ్రాసి యెరుగరు. ఆయన ప్రవర్తనము సామాన్య ఔచిత్య దృష్టికి అతీతము. ఒక శిశువు ప్రదర్శించే అచింత్య ఔదార్యముతో తన మహిమల ఆడంబరముగా వెదజల్లేవారు. కాబట్టే హేతువాదలంపటమైన ఆధునిక పాఠకుని బుద్ధికి ఈయన విషయమై నచ్చచెప్పుట అంత సుకరము కాదు.

ఆయన పుస్తకము వ్రాయక పోవుటేగాదు; ఒక్కదానినైనను చదివిగూడ ఎరుగరు. అప్పుడప్పుడు ఒకొక్క భక్తుని ఏదో ఒక ఆధ్యాత్మిక గ్రంథమునో, పురాణమునో చదువమనే వారు. కాని, సాధారణముగా వారిని యేదీ చదువవద్దనును. మానవులు పుస్తకములలో బ్రహ్మమును కనుగొన దలచు చున్నారుగాని, అందు వారికి గోచరించునది భ్రమేగాని బ్రహ్మము

గాదు - అని ఆయన నుడువుచుండేవారు.

విద్యా గంధ విహీనులు

ఈ మాట శాస్త్రేతరముగాదు. కొన్ని అసాధారణ స్థితులలోదప్ప, యేదో ఒక విధమైన ఔపపత్తిక జ్ఞానము ఆదిలో అవసరమైయున్నను, కేవలము హేతువాద సంచయము మాత్రమే ఆధ్యాత్మిక జ్ఞానప్రదాయి కాజాలదు. మానసిక విద్యా పరిశ్రమ, ఆత్మవిషయక సాధనాక్లేశమునుండి ఒక వ్యక్తికి వైముఖ్యము కలిగించి, మరియొక సులభసూక్ష్మ మార్గముపై మృషా వ్యామోహమును కలిగించుటగూడ నిజమే! ఇక, యిట్టి పుస్తక పరంపర వెల్లువబెట్టుచున్న యీ యుగములో, యీ దుష్ట ఆధ్యాత్మికోత్పాతము సులభ సంభవము. శ్రీ రామకృష్ణ పరమహంసలవారు గూడ పాండిత్యమును సముపార్జించమని ఆదేశించలేదు - తాను సేకరించనూలేదు. భగవాన్ రమణ మహర్షులవారు విజ్ఞానవారాసియై యుండికూడ, పుస్తక పఠనాసముపార్జిత విజ్ఞానమును గర్హించియే వ్రాసినారు:- 'చదివి చదివి అహంకారమును అణచుకోలేని విద్యాధికులకంటె విద్యా విహీనులైన సంస్కృతాంతఃకరణులే రక్షింపబడుచున్నారు. నిరంతరాయ కఠోర ఆత్మ విమోహము నుండియు; వివేక విభ్రంశముల దృఢముష్టి నుండియు, సరభసఘూర్ణిత యోచనా పరంపర యాతనా రుజనుండియు, నిరభ్యంతర ఐహిక భోగ తృష్ణలనుండియు ఉద్ధరింపబడగలిగినది విద్యాగంధ విహీనులే! ఇట్టి పీడలు ఎన్నిటినో వారు తప్పించుకోగల్గెరు' అని

రమణఋషి పాదులవారి మతము.

ఇచట వర్ణితమైన అవిద్యాస్థితి కేవలము అజ్ఞానము నేగాక, మానసిక సారళ్యమును, సత్యనిష్ఠను వెల్లడించుచున్నది. చైనా వేదాంతి-టో వర్ణించినదియు; ఏసుక్రీస్తు-ఒక పసిబిడ్డ మనసువంటిది అనినదియు; ప్రవక్త మహమ్మదులవారి నిరక్షరాస్యతను గూర్చి వెల్లడించినదియు యీ అక్లిష్టతను గురించియే. ఇది చదువుకుగూడ దుర్లభమైన విషయము కాదు; కాని పాండిత్యము యిట్టి సరళ శుభ్రమానసమును కలిగించజాలక పోవుటేగాక, కుతర్క సముపార్జనా పంకమగ్నత దీనిని మొదలంట నాశనము చేయవచ్చును.

చాలకాలమువరకు బాబాకు చదువువచ్చునో రాదో అని సంశయించినారు. ఎవరుగాని ఆయనకు సంస్కృతము వచ్చునని అనలేదు. ఇట్లుండగా ఒకనాడు, ఒక ఆత్మ విద్యా సూక్ష్మమునకు వివరణముగావించి, ఆయన పాండిత్యము నేగాక, సూక్ష్మ దర్శన శక్తిని, తీక్ష్ణబుద్ధిని, నిజనైసర్గిక కర్క-శహాస్యరస దక్షతను ప్రదర్శించినారు.

గీతార్థము

ఒక భక్తుడు, బాబా కాళ్లు ఒత్తుచూ ఎదో ఒక జపమంత్రమును గొణుగుకొనుచుండినాడు.

సాయిబాబా 'పఠించేదేమిటి?' అని అడిగినారు.

'ఒక సంస్కృత శ్లోకము' అన్నాడు అతడు.

ఆ ప్రత్యుత్తరము సరియైనది కాదనుటకు బాబాకు కావలసినంత సంస్కృత శాస్త్రజ్ఞానములు లేవనుకొన్నాడు ఈ శిష్యుడు.

అయినప్పటికిని ఆయన 'ఏ శ్లోకము' అని ప్రశ్నించినారు.

'గీత యందలి ఒక శ్లోకము'

'దానిని గట్టిగా చదువు'

అప్పుడు నాల్గవ అధ్యాయములోని * 34-వ శ్లోకమును అప్పగించినాడు నానా.

'దీని అర్థము నీకు తెలుసునా?' అని బాబా అడిగిరి.

'తెలుసును'

దానితో పోనీయక, సాయి దాని అర్థము చెప్పుమన్నారు. నానా దాని అర్థమును మరాఠిలో వివరించినాడు.

కాని, బాబాకు తృప్తికలుగలేదు. 'నాకు కావలసినది తాత్పర్యముకాదు; దండాన్వయము ప్రతిపదార్థము విగ్రహము ధాతువులు వ్యాకరణ సూత్రాలు మొదలైనవన్ని కావాలె' అన్నారు బాబా.

నానా సలక్షణముగా అర్థము చెప్పి, ఈ లోపల నిజంగా తన గురువులకు సంస్కృతవ్యాకరణము లేశమైనా తెలుసునో లేదో అని ఆశ్చర్యపడుచుండగా, వెనువెంటనే ఆయన పాండిత్య ప్రకర్షను తెలుసుకోగలిగినాడు ఆ పండిత శిష్యుడు.

---

* తద్విద్ధి ప్రణిపాతేన పరిప్రశ్నేన సేవయా,
ఉపదేక్ష్యంతి తే జ్ఞానం జ్ఞానిన స్తత్త్వ ధర్శినః

'తద్విద్ధి అనే పదంలో తత్ అనగా ఏమి' ? అని అడిగినారు బాబా.

'జ్ఞానం'

'ఏ జ్ఞానం? దేనిని గూర్చిన జ్ఞానం?'

'గత శ్లోకములో చెప్పబడిన జ్ఞానం'

'ప్రణిపాత అనగానేమి?'

'సాష్టాంగ ప్రణామము'

'పాత అంటే? '

'అదే అర్థం'

'రెంటికి ఒకే అర్థమైయుండిన వ్యాసుడేల వృథాగా మరి రెండు అక్షరముల ఉపయోగించియుండును? '

'ఆ రెంటికి భేదమేమీ నాకు కనుపించడంలేదు' అన్నాడు నానా. బాబా కాసేపు ఆ విషయమే ఎత్తక, తరువాత విషయానికి పోయినారు. ప్రశ్న అంటేఏమి? '

'పృచ్ఛించుట'

'పరి ప్రశ్న అంటే? '

'అదే'

'రెండును సమానార్థకాలైతే వ్యాసుని కేమి మతి పోయినదా దీర్ఘతరపదమును ఉపయోగించుటకు? '

'నాకేమీ భేదం కనుపించడంలేదు'

'సరే! అవతలి అంశము. సేవ అంటే అర్థమేమి? '

'నేను మీకు యిప్పుడు చేయుచున్న పాదమర్దనము వంటిది.'

'ఇంతకంటె మరేమీ లేదా?'

'ఇంతకంటె ఎక్కువగా, ఏమిద్యోతకమగునో నాకు తెలియదు.'

'దానిని గూడ వదలివేస్తాం. దాని తర్వాత కృష్ణభగవానుడు జ్ఞానులవద్ద జ్ఞానమును పొందుమని అర్జునునికి బోధించుచున్నాడు. అయితే, ఆ కృష్ణుడే ఒక జ్ఞాని కాడా ఏమి?'

'అవును, జ్ఞానియే'

'అయితే, తానే జ్ఞానోపదేశం చేయుటకు బదులు, అర్జునుని అన్య గురువుల దగ్గరకు పంపుటేల?'

'నాకు తెలియదు.'

'అర్జునుడు ఒక జీవి కాడా! అనగా చైతన్య ప్రాదుర్భూతుడు కాడా?'

'అవును'

'అట్లయితే, ఉపలబ్ధి, లేక జ్ఞానమునుండి యింతకుముందే ప్రభవించియున్నదానికి మరల ఎట్లు జ్ఞానోపదేశము గూర్పవలను పడును?'

అంతట సాయిబాబా, తనకును యితర జ్ఞానులకును ఉండిన ఏకత్వ రహస్యమును సాధకులగు జ్ఞానుల దగ్గరకుపోయి తెలుసుకొనవలెనని చెప్పుచు - గురువు ఒసంగ గలిగినది విద్యనే గాని, అనుభూతిని కాదని యీ శ్లోకార్థమని వివరించినారు.

జ్ఞాన విభవము

దీనితో, నానాకు గాఢ సంభ్రమముగలిగినది. ఇంతవరకు ఒక సామాన్య సరళ అర్థముకలిగియుండినట్లు కనుపించిన యీ శ్లోకమునకు బాబా గావించిన నిర్వచనము జిజ్ఞాసను ప్రేరేపించినది. ఈ విషయములగూర్చి విపులముగ విదశదీకరించమని ప్రార్థించినాడు.

గురుపాదులవారు చెప్పిరి:— మోక్ష ప్రాప్తికి ఆచార్య దేవుని ఒక శిష్యుఁడు ఎట్లు ఆశ్రయించవలసినది యీ శ్లోకము చెప్పుచున్నది. మోక్షార్థియైనవాడు సర్వసంపదలను దేహమును బుద్ధిని ఆత్మమును సంపూర్ణముగ త్యజించి ఆచార్యుని పాద సన్నిధిని సమర్పింపవలెను. ఇదే ఆ శ్లోకము కోరిన అష్టాంగ ప్రణామము. విచారణమనునది - నిరంతరాయ సత్యాన్వేషణలక్ష్యమై మాత్రమే ఉండవలయును. ప్రశ్నలు కేవలము జిజ్ఞాసాప్రేరకములుగనుండి, దురుద్దేశములుగను, బోధకుని యిరికించునవిగను ఉండనేరాదు. ప్రేరణము కేవలము అనాసక్తముగనే యుండి, ఆధ్యాత్మిక విచార పురోగమనము, మోక్షము వీటి సాధనపరముగనే ఉండవలయును. అప్పుడు ఆ సేవ నీవుచేయు దేహమర్దనమువంటిది కాజాలదు. ఒక సేవచేయుటకుగాని, చేయకుండుటకుగాని నీవు స్వతంత్రుడవు అన్న భావము ఉదయించకుండినప్పుడే నీవుచేసిన సేవ ఫలప్రదము కాగలదు. నీ శరీరమును నీ ఆచార్యునికి అర్పించివేసితివి కాబట్టి

ఆ శరీరము నీదికాదన్న భావన నీకు కలుగవలయును. అట్టి కాయము ఆయన శుశ్రూషార్థమే అని నిర్మోహుడవు కావలయును.'

కాని, సాయిబాబా మాత్రం తన శిష్యులను ఐహిక సంపత్తును పరిత్యజించమని కోరలేదు; అది వ్యక్తిమానసిక స్థితిపై ఆధారపడి యుండును. కాని, కోరినప్పుడు సర్వ సంపదల పరిత్యాగమొనర్చుటకు బుద్ధి సంసిద్ధమై యుండవలెను.

తర్వాత, గురువు ఉపదేశించు అజ్ఞానమునుగూర్చి యీ ప్రశ్నోత్తరములు జరిగినవి:-

'బ్రహ్మ మనగా కేవలము స్వచ్ఛమైన విజ్ఞానము లేక, జీవుడు కాదా?'

'అవును' అన్నాడు నానా.

'ఇక తద్భిన్నమైనదెల్ల అజీవి లేక, అజ్ఞానముకాదా?'

'అవును'

'బ్రహ్మము, మానసమునకు వాక్యములకు అతీతము అని సర్వ గ్రంథములు ఘోషించుటలేదా?'

'అవును'

'అయితే, ఇక ఆచార్యుని వాక్కు బ్రహ్మముగాని జ్ఞానముగాని కానేరదు గదా?'

'కానేరదు!'

'అప్పుడు గురువు బోధించునది బ్రహ్మమును కాదు, విద్యను మాత్రమేనని అంగీకరింతువా?'

'అట్లే అనిపించుచున్నది'

'అందువల్ల, గురుబోధ శిష్యుని అజ్ఞాన నిర్మూలనమునకు ఉపయోగించిన అజ్ఞాన ఖండమే అగుచున్నదిగదా! ఇది కాలిలో నాటుకొనిన ముల్లు తీయను ఇంకొక ముల్లును ఉపయోగించుట వంటిదే అగుచున్నది; అంతేనా?'

'అంతే అనుకొంటా' అన్నాడు నానా.

'జ్ఞానమే ప్రధాన స్వభావముగా గలిగిన జీవుడు శిష్యుడు అగుచున్నాడుగదా!'

'అవును'

అజ్ఞానావరణము

అప్పుడు అతనికి జ్ఞానోపదేశం చేయవలసిన అవసరమే కాన్పించదు. ఇక చేయవలసినదెల్ల, ఉన్న జ్ఞానమును ఆచ్ఛాదించి యున్న అజ్ఞానావగుంఠనమును తొలగించుట మాత్రమే. ఇది ఒకే దెబ్బతో ఒకే క్షణమున చేయు సాధ్యమగునదికాదు. ఎందులకనగా, శిష్యుడు యుగయుగాలుగా పేరుకొనియున్న అజ్ఞాన పంకములో దిగబడియుండుటచే పలుమారు ఉపదేశింపబడవలసి యుండును; బహుశః కొన్ని భావిజన్మలయందుగూడ బోధ జరుగవలసియుండును. వాక్యాతీతమైన దానిని గూర్చి చేయవలసిన వాక్యాత్మకమైన బోధ స్వభావమెట్టిది? అది ఒక ఆచ్ఛాదనమును తొలగించుట వంటిదేకదా? ఒక హ్రదజలోపరి భాగమును శైవాలాది పత్రములు కప్పినట్లే పూర్వస్థిత జ్ఞానమును అవిద్య మరుగు

పరచుచున్నది. నాచు పాచి మొదలగు వాటిని పెరికివేసి శుభ్ర పరచగానే నిర్మల జలము గాన్పించును. నీటిని నీవు సృష్టించవలసిన అవసరములేదు; అది అంతకుముందే అచట నున్నది. ఇంకొక ఉదాహరణమును ఎత్తికొనుము:- ఒకనికి కంటిలో దుర్మాంసము ఎదిగి చూపును అడ్డగించివేసినది. శస్త్రముతో అవరోధమును తొలగించగానే అతడు చూచుచున్నాడు. ఆ దుర్మాంసమే అజ్ఞానము. వర్ణనాతీతమైన మాయోత్పన్నమే యీ సర్వజగత్తు. ఇదే అవిద్య; అయినప్పటికిని యీ అజ్ఞానమును పెంచి విలీనముజేయుటకు జ్ఞానమే కావలసియున్నది.

'దైవికమైన విజ్ఞానము ఆర్జించి అనుభవించవలసినదే గాని బోధింపబడవలసినదిగాదు. సర్వాంగ ప్రణామము, విచారణ, సేవ, యివే ఆచార్యుని సాదరకరుణా ప్రసాదమును పొందుటకు మార్గములు.

'ఈ భౌతికసృష్టిని యథార్థమనుకొనుటయే ఒక భ్రమ. జ్ఞానమును మరుగుపరచే అజ్ఞాన యవనికయే యీ భ్రాంతి. ఆ తెరను చించివేయుము, వెంటనే బ్రహ్మములేక, జ్ఞానజ్యోతి ప్రజ్వలించును.

అవిద్యయే జనన మరణావృత్తులు గలిగిన చర్వితచర్వణమైన సంసారబీజము. ఆచార్య ప్రసాదాంజమును కంటికి పెట్టుకొనుము, వెంటనే ఈ మాయావరణము తొలగిపోయి శుద్ధ జ్ఞానము మాత్రమే మిగులుచున్నది. విజ్ఞాన మనునది సముపార్జించుకొనవలసి

నదికాదు, అది స్వయంప్రభవమైన సిద్ధి; శాశ్వతమైనది. దీనికి భిన్నముగ - అజ్ఞానము అధిష్ఠాన కారణ సంభవమును, నశ్వరమునై యున్నది. ఈ భావమునకు తల్లి వేరు - భక్తుడు పరమాత్మకు భిన్నుడను భావనమే! దీనిని అపనయించుకొనుము, ఇక నీలో నిలుచునది జ్ఞాన మొక్కటియే!

'ఇక, కృష్ణుడు అర్జునునికి స్వయముగా తానే జ్ఞాన ప్రసాదము చేయక యితర గురువుల ఆశ్రయించమని యేల అనిరి, అనగా - ఇతర జ్ఞానులకంటెను, వారి బోధనములకంటెను తాను, తన బోధ భిన్నమని శ్రీకృష్ణుడు భావించినాడా? లేదు. కాబట్టే వారి సందేశోపదేశములు తనవే అనుకొనినాడు.'

ఇది మొదలు శ్రీ బాబా గీతను తెప్పించి, ప్రతి దినము నానా చేత ఒక అధ్యాయమును చదివించి వ్యాఖ్యానించ సాగినారు. ఇవి లిఖితావస్థనుపొందలేదు. పైన వివరించిన విజ్ఞానపూర్ణ వీర్యవంత వాఖ్యాన ఖండము గలిగిన ఆ మహత్తర గ్రంథము ఆవిరై పోయినది; సాధకులకు దక్కలేదు; లభించిన యీ కాస్తయే చాలును శ్రీ బాబా వైజ్ఞానిక వైశాల్య గాంభీర్యములను ప్రదర్శించుటకు! ఆయన అకళంకమైన అద్వైతి; ఆయన ఆధ్యాత్మికోపదేశసారమే యిది.

మహిమలు

ఇక, మాహాత్మ్యములు - సిద్ధులు - మహిమలు - యక్షిణులను గురించి; ఈ మధ్య, స్థితప్రజ్ఞులైన ఆధ్యాత్మికాచార్యులు

పెక్కుమంది వీటిని చేపట్టలేదు; వీటి పొంతకేపోలేదు. మానవాభిరుచులు ఎంత ఆధిభౌతికముగ ఎంత ప్రాకృతికముగ మారుచుండునో, ఆ యుగమునందు యిట్టి క్షుద్ర విద్యలు మహిమలు అంత విశ్వాసపాత్రము లగుచుండును. ఇవి పనికి రానివని, సాధకులు ప్రయోగింప రానివని ఏసుక్రీస్తు తన శిష్యులను ఎచ్చరించినాడు; దీనినే భారతీయ ఆధ్యాత్మిక సంస్కృతి నిషేధించుచున్నది. ఎందులకన-ఇవి ఆధ్యాత్మిక జ్ఞానోద్భవములుకావు; కాబట్టే వీటిప్రయోగాచరణాదులు యోగ్యములు కావని నిషేధింపబడినవి. ఇట్టి గురూపదేశమును ఉపేక్షించుట అవలేపము, సాహసము కావచ్చును. అందువల్లనే వారు వీటిని అరుదుగ అపరూపముగ ప్రయోగించిరి. దైవానుగ్రహము అనేక విధముల ఒక యోగిపుంగవునియందు ఆవిష్కృతి నొంది దీపింపవచ్చును; అది విశ్వతో వ్యాపకమై తన రారవచ్చును; కాని అది భిన్నవిషయము. అంతమాత్రాన అవి ప్రత్యక్షోద్దేశపూర్వక చేష్టలు కాజాలవు. వర్తమానయుగ పరమోత్కృష్టయోగి - అరుణగిరి భగవానుడు - రమణర్షి పూజ్యపాదుల వారి శిష్యకోటి, తమ వాంఛా పరిపూర్తి అయిన అంశముల నెన్నిటినో చెప్పుచున్నారు. ఆయన నుద్దేశించినచో మ్రొక్కులు తీర్చబడినవి, వ్యాధులు నివారించబడినవి, ప్రమాదములు దుర్ఘటనలు అపనయింపబడినవి; ఇన్ని చేసియు ఆయన బహిరంగముగ యే అణిమాది సిద్ధినైనను చూపియుండలేదు. అట్లేల చేయరని ప్రశ్నించినప్పుడు, రమణదేవుడు - 'సాధకుడైన జ్ఞానిభావనలు ఏదో ఒక

వైపు మరలి లగ్నమై నంతమాత్రముననే చాలును; వెంటనే స్వయంచోదితమైన దైవిక క్రియాశక్తి ఒకటి ప్రారంభమగును' అని నుడువుచుందురు.

ఇట్టి శక్తి ప్రవర్తకమంతయు వివేచనాపూర్ణమై సాధ్యమై నంతవరకు అస్పష్టమైయుండును.

ప్రత్యక్ష మహిమలు

కాని, సాయిబాబాయందు యీగుణము విపరీతమై యుండినది. ఆయన చూపిన సిద్ధయోగములు మహిమలు ప్రత్యక్షమై విరళమై కళామయములై యుండెడివి. ఇచట స్వయంప్రేరకత్వము లేదు. క్రింది యీ రెండు కథలు అ విషయమును తెలుపగలవు:-

ఒక స్త్రీ తిరువణ్ణామలై లో చనిపోయినది! దినమంతా తెరిపిలేకుండా కుంభవర్షము కురియుచుండుటచే, దుఃఖితుడైన ఆమె భర్త, శవమును దహన సంస్కారమునకు శ్మశానమునకు గొని పోలేకుండినాడు భారతదేశ వాతావరణంలో కళేబరమును దహనమో, నిఖననమో చేయకుండా ఇరువదినాలుగు గంటలకుపైన ఉంచుట అశాస్త్రీయమేగాక అవివేకముకూడా అగుచున్నది. అతడు యీ సంగతి మహర్షితో చెప్పినాడు. ఆయన సాధారణంగా అందరివలెనే తల ఎత్తి మబ్బులనుచూచి 'తెరిపియిస్తుందనుకొంటా' అని అన్నారు. భర్త వెంటనే యింటికిపోయి, శవవాహనానికి తగిన పనులు సాగించినాడు. ఆ ఋషి, మాట మీద భక్తుల

కున్న విశ్వాసమట్టిది! నిజానికి వాన నిలిచిపోయినది; దహన సంస్కారం సాకల్యంగా జరిగిపోయినది.

రెండవకథ_.

షిర్డి - సమీపస్థంగావుండే రైల్వేస్టేషను - * కోపర్‌గాంకు ఆరుమైళ్లలో నున్నది. అక్కడ ప్రయాణీకులకుగా ఒక టాంగా మాత్రమే (గుఱ్ఱపుబండి) ఉండేది. సాయి భక్తులలో కొందరు, అత్యంత అవసరంగా, ఆ రాత్రి బండికే బొంబాయికి పోవలసియుండినది; కాని బయట భీకర ఝంఝూమారుతము రేగుచుండినది. సాయిబాబా తలయెత్తి ఆకాశంవైపు చూచి, 'హేయ్, చేసినది చాలు, ఇక యిప్పుడు నిలుపు! నా బిడ్డలు తిరిగి పోవలసియున్నది' అని గట్టిగా గర్జించినారు. మరు క్షణంలో గాలివాన నిలిచిపోయినది; ప్రకృతి శాంతించినది!

ఈ మహిమలలో ఒక ప్రయోజనముండినది; ఆ విషయం మున్ముందు వివరింతును. ఈ విషయమై బాబా అన్నారు:- 'నా భక్తులు మొదట యేదికోరితే అది యిచ్చెదను; ఎందుకనగా-క్రమేపి నేను యివ్వదలచిన దానినే వారు కోరుటకు అలవరచుకొందురు.'

విపరీత వర్తనము

ఈ మహిమల సంగతి అటుండనిచ్చి, బాబా విషయం

---

*కోపర్‌గావ్ రైల్వేస్టేషన్, మన్మాడ్ - దోండ్ మార్గమున మన్మాడు సమీపముననున్నది. ఇది అహమ్మద్ నగరుజిల్లా. (బొంబాయి)

సామాన్య ఔచిత్యాతీతంగా ఉండేది. ఆయన ఒక వింత రూపంలో హిందూ ముస్లిము లిద్దరికి సమానముగా బోధించుచుండినారు; మస్జిదులో ఎన్నడూ ఆరని ఒక నెగడును మంటచేయుచుండి నారు. భక్తులపై కోపజ్వాలల ప్రసరింపజేసేవారు; ఒక్కొక్క ప్పుడు దుడ్డుకర్రలతో మోదేవారు. మనసులో అనుకొనిన ప్రశ్న లకు ప్రత్యుత్తము లిచ్చేవారు. విశ్వాసం లేకుండా తన్ను చూడ వచ్చినవారిని రాళ్లతో గొట్టి తరిమివేసేవారు; ఇంకొక సమయ ములో, ఏదో ఒక మహిమజూపి అతనినే మరల ఆకర్షించే వారు. వచ్చినవారిని డబ్బు అడిగి, వెంటనే యితరులకు యిచ్చి వేసేవారు. ఊహించరాని ఏదో ఒక కారణానికి క్రోధాగ్ని పర్వత మయ్యేడి వారు; తిట్లు కురిపించేవారు. కాసేపటికి యీ భీకర ప్రభంజనము ఉపశమించి పోయెడిది; వెంటనే నూతనాగంతుకుని తోనో, ప్రయాణోన్ముఖుడైన భక్తునితోనో వాత్సల్యపూర్ణ మధుర ఫణితితో మాట్లాడి స్వాగతమిచ్చుటో నిమంత్రణ మిచ్చు టో చేయును. ఎప్పుడూ ఏదో ఒక ఇస్లాంమతసూక్తిని అరబిక్ లేక పారసీక భాషలలో అప్పగించుచుండును. కాని హిందూ శాస్త్రముల సక్రమముగా పలికినా, వాటిని మాత్రం వినబడీ విన బడనట్లు మెల్లిగా గొణుగు కొనేవారు.

ఆయన చేసే పనులుగూడ విచిత్రంగా వుండెడివి. నెగడు ఎదుట నిలువబడి చిల్లర నాణెములను ఒక దాని మీద ఇంకొక దానితో రాసేవారు. ఆయన సన్నిహిత శిష్యుడు, దాస్‌గను

యిట్లు చెప్పినాడు: 'అప్పుడప్పుడు మస్‌జిద్‌లో మధ్యాహ్నం ఒకటి - రెండు గంటలమధ్య, బాబా కొన్ని వింతయైన కార్యముల గావించేవారు. అప్పుడు ఆయన ఏకాకిగా ఒక తెర మరుగున కూర్చుండి యుండేవారు. తిత్తినుండి పది పదిహేను పాత నాణెములను - పైసా మొదలు రూపాయవరకు తీసి, వాటిని మెల్లిగా తన వ్రేళ్లతో సందుపోకుండా రుద్దుచుండుదురు. ఇది చేస్తూ ఆయన ఏదైనా మంత్రమును జపించేవారో లేదో నాకు తెలియదు. దీనివల్ల అవి చాలా అరిగిపోయినవి. అప్పుడప్పుడు మాత్రం వాటిని రుద్దుచూ - ఇది నానాది, ఇది బాపుది, ఇది కాకాది - అని అనేవారు. ఇంతలో ఎవరైనా దగ్గరకు రాగానే గబగబా వాటిని సంచిలోవేసి దాచిపెట్టేవారు.

నిజంగా యీ నాణెములు ఆయన శిష్యు లనదగియున్నవి. వారికి సదా ఆధ్యాత్మికశక్తిని ప్రసాదించుచు, కారుణ్యమును దైవ కృపను కటాక్షించుచు, వారిని ఉద్ధరించుచు, వారి పురోగమనానికి చేయూతనొసగుచు ఉండినారు. ఇట్టి పని అందరు ఆచార్యులు చేసినా, వారికంటె భిన్నముగ సాయిబాబా, విషయ నిర్దేశక చిహ్నలతో సూచించుచుండేవారు.

బాబా సాన్నిధ్యంలో ఎల్లప్పుడు ఆయనకు ఊడిగము చేయుచుండిన ఒక మహమ్మదీయ భక్తుడు ఒక వింత చేతను చెప్పుచున్నాడు:—

ఒక కంబపు గూటిలో ఒక ప్రమ్మిద దీపం సదా వెలుగుచుండెడిది. బాబా దానిచాటున కూర్చుండేవారు. సాధారణముగ దీపపు వెలుతురు కనబడకుండా దాని వెనుకనే కూర్చుందురు; ఆయన దీపము చూచినది నే నెప్పుడూ గమనించలేదు. నేను మట్టి కుండలలో నీళ్ళుబోసి ఆయన దగ్గర వుంచేవాడిని. ఆయన రెండు కుండలమధ్య కూర్చుండి వాటియందున్న నీరు ముంచి చుట్టూ పారబోయుచుండును. ఇది ఆయన ఎందుకు చేసేవారో నాకు తెలియదు. ఏదైనా మంత్రోచ్చారణము చేసినారో గూడ తెలియదు; నేను గుర్తించలేదు.

ఇది గూడ విషయసూచక సంజ్ఞ కావలయును. నీరుబోయుట కృపారసమును వర్షించుట కావచ్చును.

విచిత్ర నిద్ర

అయన నిదురించే విధానముకంటే వింతయైన విషయమే ఉండజాలదు. ఐదడుగుల పొడవు - ఒకటింపాతిక అడుగు వెడల్పు మాత్రమే కలిగిన ఒక కొయ్య చెక్క సన్నటి పాతగుడ్డపేలికలతో, నేలకు ఆరడుగుల ఎత్తున, ఇంటికప్పు వాసాలనుండి వ్రేలాడకట్టబడియుండేది. దాని చుట్టూ అంచులలో చాలా దీపములు ఉంచబడేవి. నిజంగా అంత ఏత్తుకు ఎక్కను, ఊసిపోయిన త్రాళ్ళ ఉయ్యాలలో, దీపములు క్రిందపడకుండా నిదురపోవుట చాపల్యమయినను, ఎంతో లాఘవము ఉండవలెను. ఆపైన దానిపై సుఖముగా నిదురించుటయన, సామాన్యులకు అర్థమయ్యే చర్య కాదు. ఒక

నాడు దాసగను, మరికొందరు చూడను ఆ చెక్కను సమీపించ గానే, బాబా కోపోద్రేకంతో దానిని లాగుకొని ముక్కలుముక్క లుగా చేసివేసినాడు.

ఈ చిత్ర నిద్రావిధానమునుగూర్చి ఒక పారసీ భక్తురాలు-మేనేజరు సతీమణి చేసిన వ్యాఖ్యానమువల్ల అర్థమగుచున్నది. ఇదే దాని మూలార్థము:-'ఇతర సిద్ధులకు సాయిబాబాకు ఒకప్రస్ఫుట విభేదం నాకు కాన్పించినది. వీరేగాక మరికొందరు విఖ్యాత మహా మహుల దర్శనముగూడ గావించుకొని యున్నదానను. వారు స మాధి మగ్నులై యుండి నప్పుడు నిజ భౌతికకాయ విస్మృతిని జెందియుండెడివారు. ఆవలవారు తమ పరిసరజ్ఞానమును క్రమేణా పొంది, మన హృదయాంతరాళముల ప్రవేశించి, మన ప్రశ్నల దెలిసికొని వాటికి ప్రత్యుత్తర మొసగుచుందురు. (దీనిని ఆరుబుక్షు దశ అందురు.) ఇక సాయిబాబా విధానమే వేరు. అతీతతమ జ్ఞాన మునుగాని, స్థాయినిగాని పొందుటకు ఆయన సమాధిగతుడు కావలసిన అవసరము లేకుండినది. (దీనిని ఆరూఢ దశ యందురు; ముక్తుడైన జ్ఞానికి సమాధిగతుడగుట అవసరములేదు.) ఆయున ఆత్మ చైతన్యము ద్వివిధముగ నుండినది. ఒకటి శ్రీ సాయిబాబా అను అహమును స్వయముగ ఉపయోగించుచు, ఐహిక ఆధ్యా త్మిక విషయములలో ఇతర ఆత్మలతోడి సంబంధమును కల్పించు కొనుచుచుండును; అదే సమయములో ఇంకొక ఆత్మశక్తి, సమస్త అహంభావాతీతమై, విశ్వజనీన ఆత్మలో విలీనమై నివ

సించుచుండును. ఇట్టి ద్వైత గుణమును, ఆత్మజ్ఞాన శక్తులను, లక్షణ ములను ఆయన ప్రకటించి ప్రయోగించుచుండినారు. ఇతర సిద్ధులు నిజకాయ జ్ఞానమునువీడి; పరిసరముల మరచి యోగ సమాధిలో క్రీడించి, తిరిగి వాటియందు ప్రవేశింతురు. కాని, సాయిబాబా ఒకే సమయమున యీ ఆధిభౌతిక ప్రపంచము వెలుపల లోపల అధ్యవసించియుండెడివారు. ఇతరులు కొంత శ్రమతో యితర మనసుల అర్థముచేసికొని వారి గత చరిత చెప్పగలిగెడివారు; సాయి బాబాకు అట్టి ప్రయత్నమే అవసరములేదు; ఆయన సర్వకాల సర్వావస్థలయందును సర్వవిషయకజ్ఞాన జాగృత్యవస్థలోనే యుం డిరి.

ఇట్టి స్థితినే ఈ రచయిత శ్రీ రమణ మహర్షులవారి విష యములో చూడగలిగినాడు. స్థితప్రజ్ఞుడు శాశ్వత నిర్వికల్ప సమాధిలోనే యుండగలడు. అట్టి స్థితిలో యోగనిద్ర సదృశమైన సమాధిగాని, నిద్రగాని అవసరములేదు. ఆయన అనుభవించునది సర్వసాధారణముగా సుషుప్తి అనెడు విస్మృతిగాక, సమాధి తేజ స్సునే! అనగా, సాయి రాత్రులందు నిదురబోక, ఒక లఘూకృత మానసిక జాగరణావస్థలో తన భక్తకోటిని సంరక్షించుచు; వారిపై వాత్సల్య సుధను గురిపించుచుండు రనవలసియుండును. ఇట్టి శక్తిని ప్రదర్శించుటకు కుతూహల పడుచుండియు, తెలిసి కొనిన వారిపై యేల కోపపడవలయును - అన్నది వేరొక విష యము.

కోర్టు సమ్మన్సు

సాయిబాబాశక్తి గాఢమై అసామాన్య లక్షణము గలిగినదై యుండినది: లక్షణాన్వితసూక్తి వైచిత్ర్యము, ప్రవర్తనలో ఆరణ్యకోద్రేకములు ఆత్మప్రత్యయ శక్తితో ప్రదర్శింపబడేవి.

ఒక దొంగ, దొంగనగలతోగూడ దొరికినాడు. ప్రక్కన, ధూలియా పట్టణ మేజస్ట్రేటుకోర్టుకు అతడు విచారణకు గొనిపోబడినాడు. ఆ చోరుడు ఆ నగలు తనకు సాయిబాబా యిచ్చినాడని చెప్పుటచే, యీ సామాన్యాభియోగము చిక్కుబడిపోయినది. సాయిబాబాపై అనుదినము ధనము వర్షింపబడుట, ఆయన దానినంతయు తోడ్తోడనే పంచిపెట్టివేయుట అందరికిని తెలిసిన విషయము. అయినప్పటికిని యీ నగలు దొంగిలింపబడిన వనుటలో ఎట్టి సందేహముగాని లేకయుండినది. ఇక ఇది తేల్చవలసినది బాబా సాక్ష్యమే! వెంటనే సాయిబాబాకు ఒక నిమంత్రణ పత్రము (సమ్మన్సు) పంపబడినది.

'బాబా, ఇదిగో మీకొక సమ్మన్సు వచ్చియున్నది' అని దానిని తెచ్చిన పోలీసు కానిస్టేబిల్ తడబడుచు పలికినాడు.

'ఆ కాగితపు పేలికను, మీలో ఒకరు నిప్పులోవేయండి' అని బాబా బొబ్బగించినారు. ఒక శిష్యుడు అట్లనే చేసినాడు.

ఎంత పెద్ద వ్యక్తి అయినా, యీ న్యాయస్థాన ధిక్కారము సహింపజాలనిది; వెంటనే బాబాకు అరెస్టువారంటు యిచ్చినారు. దానిని కొనివచ్చిన అధికారి వణుకుతో సమీపించినాడు:

'మీకు ఒక వారంటు పంపినారు. నాతో గూడ ధూలియాకు వస్తారా?' అన్నాడు.

శాపముల జడివాన గురిపించి, బాబా దానిని పెంట కుప్పలో పారవేయమన్నారు. పలుకుబడి కలిగిన భక్తులుచేరి కర్తవ్య మాలోచించిరి. అసంఖ్యాక భక్తజన సేవితుడైన యిట్టి యోగిపుంగవుని ఒక సామాన్యునివలె, న్యాయాధిపతిముందు నిలుచుండ ఆజ్ఞాపించుట పాడికాదని, వారిని స్వయంగా విచారించుటకు ఒక న్యాయాధికారిని షిర్డీకి పంపమని కోరుచు వారు ఒక విజ్ఞాపనమును పంపిరి. యీ కోర్కె యీడేరినది. జోషి అను ఒక ఫస్టుక్లాస్ మేజస్ట్రేటు షిర్డీకి పంపబడినాడు.

విచారణకు వచ్చిన ఆ పెద్దమనిషి - 'మీ పేరేమి?' అని ప్రారంభించినాడు.

'సాయిబాబా అంటారు'

'మీ తండ్రి పేరు?'

'ఆయన పేరుగూడ సాయిబాబే'

'మీ గురువు పేరు?'

'వెంకూస'

'మీ మతము?'

'కబీర్'

'మీ కులము?'

'పర్వర్దిగార్' (పరిరక్షకుడు)

'వయస్సు?'

'లక్షల సంవత్సరాలు'

లక్షణాన్వితసూక్తి

ఇవి ఒక విచారణలో సామాన్య ప్రశ్నావళియేగాని, వాటి ప్రత్యుత్తరములు మాత్రము అసామాన్యములు. అన్నీ గూఢములు - లక్షణార్థ యుక్తములు! ఇంతకుముందు తెలిపినట్లు, సాయ్ బాబా అనునది ఒక నామవాచకము కాదు; అది ఒక విశేషణము. తన తండ్రిపేరుగూడ అదే ననుటలో తాను ఒక మానవ సంతాన సంబంధి కానని తెలుపుచున్నారు. కబీరు 15-వ శతాబ్ద పూర్వ భాగమున, 16-వ శతాబ్ద పర భాగమున వెలసిన ఒక గేయకవియైన మహాప్రవక్త - ఋషి పుంగవుడు. ఆయనకు హిందూ ముస్లిములు భక్తులైయుండిరి. తన పేరు కబీరనుటలో బాబా మతాతీతుడని, వాటి ఆదియందు నిలువబడి ఉభయ మార్గాలలో భక్తులను నడుపు వాడనని విప్పిచెప్పుచున్నారు. పర్వర్దిగారనుటలో కులమతాతీతుడైన స్థితప్రజ్ఞుడనని, ఆత్మ సాక్షాత్కారమునుబొంది, దివ్యావస్థలోనున్న మహనీయుడనని, తన యునికియే ఒక విభూతి యని వ్యక్తము చేసినారు. ఇదే దాని గుహ్యార్థము! ఇక ఆయన వయస్సును గురించిన విషయము: ఆయన యీ కాలమానసీమాతీతుడనని, ఆధ్యాత్మిక జాగృతి యొక్క శాశ్వత వర్తమానమునందు ప్రతిష్ఠితుడనని తెలియ జేయుచున్నారు.

ఈ ప్రశ్నల వెనువెంటనే వెలువడిన యీ ప్రశ్నలు సందర్భోచితములని తోపగలవు: 'మీరు నిజమునే చెప్పబోవుచున్నారని ప్రమాణము చేయుదురా?' అని అడిగినాడు ఉద్యోగి.

'నిజమా?' అన్నారు బాబా.

'మీకు యీ నిందితుని తెలియునా?'

'అవును నాకు తెలియును.'

ఇది శాస్త్ర విచారణాధికారికి తృప్తికరముగా నుండినది. కాని వెంటనే బాబా 'నాకందరూ తెలియును' అనగానే వితాకు పడినాడు.

'వాడు మీ శిష్యుడనని, మీ ఆశ్రమములో వుండినానని చెప్పుచున్నాడు; అంతేనా?'

'అవును! అందరూ నాదగ్గరనే ఉందురు. అందరూ నా వారే! ఇది ఒక దివ్య మహిమాన్వితిని సర్వ విశ్వాత్మక ప్రవచనము కావచ్చును గాని, ఒక లౌకిక న్యాయ విచారణ విధానమునకు ఏమాత్రమును ఉపకరించనిది.

'వాడు చెప్పుచున్నట్లు మీరు అతనికి యీ నగలిచ్చినారా?'

'అవును! వాడికేయిచ్చినా' అని అంటూ, వెంటనే - 'ఎవరు ఏమి యిత్తురు? ఎవరికి యిత్తురు?' అన్న వేదాంత ప్రశ్నలతో విచారణాధికారికి దిగ్భ్రమ గొలిపినారు.

'మీరు వాడికి ఆ నగల యిచ్చుటకు, అవి మీకెక్కడ నుండి వచ్చినవి?

'సర్వమూ నాదే!'

మేజస్ట్రేటుకు దీనితో ఓపికంతా పోయినది. ఇదంతా వేదాంత ధర్మసూక్ష్మము కావచ్చును గాని ఒక అభియోగములో సాక్ష్యము కాజాలదు. 'బాబా యిది ఒక పెద్ద నేరారోపణము, దొంగ ఆనగలను మీరిచ్చినట్లు చెప్పుచున్నాడు. సక్రమముగా ప్రత్యుత్తరమివ్వండి' అని అధికారకంఠధ్వనితో పలికినాడు.

బాబాకు దీనితో సహనము పోయినది. 'ఇదంతా యేమిటి? నీకేమి దయ్యముపట్టినదా? ఈగొడవతో నాకేమి సంబంధము' అని కటువుగా పలికి లేచి చెప్పకుండా దూరం తొలగిపోయినారు.

దీని తర్వాత వాఙ్మూలం తీసుకొనుటనే మానుకొన్నాడు ఆ విచారణోద్యోగి. ఇంతలోపల, ఆ దొంగ షిర్డికి ఎన్నడుగాని వచ్చి యుండలేదని రుజువైనది. ఈ కథలో విచిత్రమేమనగా - బాబాను తన వాఙ్మూలములో చేవ్రాలు చేయమని న్యాయాధిపతి అడుగలేదు. ఇంతవరకు ఆయన యిట్టిపని చేసియెరుగరు - ఇంతేగాదు, వ్రాయుటకు ఆయనకు పేరేలేదు.

షిర్డి క్షేత్రమైనది

1900 ప్రాంతాన శ్రీ సాయిబాబా నామ ఖ్యాతి మహాత్వములు దేశమందంతటా సాంద్రముగ వ్యాపింపసాగినవి. ఆయన జీవిత చరమ దశాబ్దిలో షిర్డి ఒక పుణ్యక్షేత్రమైనది. దేశములో నానా

ముఖాలనుండి భక్తులువచ్చి, ఆ పుణ్యమూర్తి పాదసీరేజ యుగ్మ మును సేవించి తరణోపాయమును కనుగొనిరి. రోగార్తులు ఆరోగ్యవంతులై జీవన భరణోత్సాహమును పొందిరి; వంధ్యా జనముల గర్భ క్షేత్రములు పంటల పండినవి. విశ్వాసులు గాఢ ప్రపత్తిని పొందిరి; అవిశ్వాసులు దైవశక్తి సంపూజన లోలురైరి. రానురాను బాబా భూలోకమున అవతరించిన వరద ప్రదానుడైన దేవదేవుడైనారు! మహారాజాధిరాజులలాంఛనములతో యేటేటా, ఆరాధనోత్సవములు సాగింపబడినవి. ఉత్తమాశ్వరథములమీద, మత్త మాతంగములమీద భక్త జనావళిచే నేత్రోత్సవముగా ఆయనకు ఊరేగింపులు చేయబడినవి. బాబాకు యీ ఆడంబరము లేవిగాని రుచింపక పోయినను, భక్తుల ప్రార్థనాశక్తికి లోబడవలసిన వారైరి. అనుదినము కొండవరవలతో చెరువులు నిండినట్లు, బాబా పుణ్యాలయము అర్పణల ప్రవాహముతో నిండుచుండినది కాని, ఉత్తరక్షణముననే కలుజులు తెగిన చెరువునీటివలె అది అంతయు అనాయాసముగా పంచిపెట్టబడి వ్రయింపబడుచుండినది. కాబట్టే, ఆ దివ్యపురుషుని అవసాన సమయానికి, ఆయన అపర క్రియలకు అవసరమైనంత మాత్రమే పిడికెడు రూకలు మిలిగినవి.

పాశ్చాత్య భక్తకోటి

ఆ సిద్ధ పురుషుని నిర్యాణానంతరము భక్తకోటి తరుగుటకు బదులు పెరుగుట ఒక ముఖ్యవిషయము. ఇట్లయ్యు యీ మహామహుని కీర్తి భారతావనీసీమలదాటి విదేశముల కేల ప్రాకలేదో?

ఇంతకుముందే యీ ప్రశ్నకు ప్రత్యుత్తర మిచ్చియున్నాను. ఆర్యావర్తములో యింకను దైవభక్తి విశేషముగా పాదుకొనియే యున్నది. బయటి ప్రపంచమునకు తెలియకపోయినను ఎందరో ఋషులు సిద్ధులు యోగులు వెలసియున్నారు. ప్రతి పల్లె పట్టణములందును, వివిధ మార్గాలలోను క్రమ్మరు మహిమాన్వితులైన ఫకీరులు సన్న్యాసులు యింకను విశేషముగ గాన్పించుచునేయున్నారు. వీరిలో వేషధారులు వంచకులు గూడ లేకపోలేదు; దీనికి మరియొక పార్శ్వ దృశ్యము గూడ గలదు. పాశ్చాత్య వ్యామోహితులైన మ్లేచ్ఛ విద్యాధికులు పట్టణములలో ఎక్కువైనారు; వీరు ఆధునిక ప్రతీచీ విజ్ఞానశాస్త్రముపట్ల హేతువాదముపట్ల మరులుగొని యున్నారు. గణతంత్రమో - సమాజవాదమో, వీటి ప్రాబల్యముచే, మూఢాచార పరాయణులనిగాని, పురోగమన పరాఙ్ముఖులని గాని ఎన్నబడుదుమేమో అని వారిమనసులు చురుకుపడుచున్నవి. నేడు విదేశపాఠకులకు పుస్తకములు వ్రాయు రచయితలు యీ కోటికి చెందినవారే. ఇక యీ నవ్యవాసనాశోభితులకు ఒక అనాగరక నిరక్షరాస్య సిద్ధుడు, మహా పురుషుడు, జ్ఞాని పుస్తకములలో భక్తి సూత్రముల ప్రవచింపకయే మాహాత్మ్యముల జూపి మరుల్గుపుచ్చి నారన్న సత్యము రుచించి, ఎట్లు ప్రకటించు కోగలరు? శ్రీబాబా భక్తులు అధిక సంఖ్యాకులు నవ్య ఉదారవాసనలు అభిరుచులు లేనివారుగనేయున్నారు. ఈ భక్తులలో కొందరు ఆశ్చర్యమును గూడ కలిగించేవారు గూడ నుందురు. ఈయన

మహిమలు - బోధనామృతము - సూక్తులు - నిర్వచనములు భారతీయ భాష లన్నిటిలోను విశేషముగ వ్రాయబడియున్నవి. బహుశః, పరమటి దేశాలవారికి యీ మహాపురుషుని మాహాత్మ్యమును తెలియుజేయుటకు నాబోటి ఒక ప్రాశ్చాత్యుని భాగధేయమునకే వదలివేయబడినట్లున్నది.

నిజముగా నేను ధన్యుడను!



# 2. గురుదేవుడు

సాయిబాబా వర్తనము అలౌకికము!

అవును! అంతమాత్రాన, ఆయన నిజభక్తగణముపై ప్రసమ్మరించిన వాత్సల్యమును, శ్రద్ధను మనము గుర్తించక కనుల మూసికొనరాదు. ఆయన వారియం దుద్భవింపజేసిన ఆధ్యాత్మికోన్నతిని విస్మరించలేము. దీనికి ప్రతిగా భక్తజనము ఆయనపట్ల ప్రదర్శించిన భక్తి-శ్రద్ధలు, ప్రేమవిశ్వాసములు కీర్తి కిరణములతో దశదిశల ప్రదీపించి పోయినవి. కాబట్టి యీ ప్రకరణమును ఆయన భక్తులన్న మాటలతోనే ఉపక్రమించుట సముచితముగ నుండ గలదు.

నయనదీప్తి

మేనేజరు సతీమణి యిట్లు నుడువుచున్నది:- 'సాయిబాబా ప్రథమ దర్శనమున ఆకర్షణీయాంశము - ఆయన నయనదీప్తి. ఆయన దృష్టి సంపాతమెంత నిశిత ఛాలికమో, ఎంతటి బలవత్తరమో కాని, ఎవరుగాని కానేపటికి పైన ఆయన నేత్రకమలముల తేరిపారజూడలేరు. ఆ నేత్రకిరణములు ఒకని హృదయాంతరాళమున ప్రవేశించి, మూలమూలల గాలించి, యథార్థమును కనుగొనుచున్నట్లు స్ఫురించును; ఇక వెంటనే ఎదుట ఉన్న వ్యక్తి అవనత మస్తకుడై వినమితగాత్రుడై నమస్కరించును. ఒక మాటతో

గూడ, కాదు ఒక స్వల్ప అంగ విన్యాసముతోడనే నూతనా గంతుకుని భూత వర్తమాన భవిష్యత్తుల విషయము సమగ్రముగ బాబా తెలుసుకొనగలిగి యుండినారు. ఇక వచ్చిన వ్యక్తి చేయ గలిగిన దేముండును? వెంటనే విశ్వాసపూర్ణ హృదయముతో నిజ సర్వస్వమును ఆయన పాద పంకజ సన్నిధిని సమర్పించవలసిన దే! అది మొదలు యిట్టి ఆత్మార్పణ వ్యక్తులను ఆయన సర్వావస్థ లందును సర్వ వేళలందును రక్షించుచు పరిత్రాణ స్వరూపమగును! ఆయనే మార్గదర్శకుడగును. సర్వము బాబా అధీనమై యుండును.' జ్ఞాని లక్షణములే యిట్టివి!

భక్తకోటి పరిరక్షణము

ఇట్టి మహిమాన్వితమైన ఆయన వాత్సల్యమును, సంర క్షకతను, ఆయన దర్శనము ప్రసాదించు ఆధ్యాత్మికోత్కర్షములను యీ భక్తురాలు నొక్కి చెప్పుచున్నది - 'భక్తావళికి ఆయనయం దనురక్తిని ప్రేమలను కలిగించి బంధించినది. ఆయన అంతఃకరణ శక్తియేగాదు; ఆయన మహిమ, ఆయన అనురాగాసక్తులు ఆయ నను దరిసిన భక్తుల ముగ్ధులజేసి, బంధించి, ఆషిర్డీని ఒక ప్రత్యక్ష భూతల స్వర్గముగా మార్చివేసినవి. ఆయన సన్నిధానము చేరి చేరకముందే ప్రతి ప్రాణి తాను సురక్షితుడైనట్లును, తన్ను చెనక గలిగిన దుష్టశక్తులే యీ భూతలమున ఉండబోవనిన్నీ విశ్వాస ముతో ఆత్మశాంతి నొందును. ఆయన సాన్నిధ్యమున, ఆయన పవిత్ర పాదద్వయి ప్రాపున నేనున్నంతవరకు నాసమస్త శారీరక

బాధల మరచిపోయెడిదానను. ఇంతేగాదు, యీ దేహమును యీ భూతల వాసనలను, తాపత్రయములన్నిటిని మరచి ఆనంద తన్మయత్వము నొందెడిదానను. ఆయన సన్నిధానమున యట్టి పరమ సుఖానుభూతిలో మునిగియుండగా, ఎన్నో గంటలు స్మృతిలేకయే గడచిపోయెడివి. ఇది ఒక అపూర్వ పుణ్యాపరిపాకానుభవము! ఆయన యథార్థ భక్తులందరకు గూడ యిదే అనుభవమని నావిశ్వాసము. ఆయనే సర్వభక్తావళి సర్వస్వము - ఆయన సర్వస్వమును భక్తావళికే వినిమయము.'

స్వప్న దర్శనము

ఇంకొక భక్తుడు - వై. జె. గాల్వణ్‌కార్, ముఖ్యంగా బాబా పవిత్రీకరణ దక్షమైన ప్రాబల్యమునుగూర్చి యిట్లు నుడువుచున్నాడు:- 'మొదట 1911 లో శ్రీ బాబాను సందర్శించితిని. మా మామ, మరికొందరు బంధువులు పోవుచుండగా వారి వెంట నేనును వెడలితిని. సాయిబాబా పవిత్ర శీలమును గురించి, ఆయన సిద్ధశక్తులను గురించి యింతకుముందే బాగా వినియున్నాను గాని, ఇహాపర లాభములకై ఆయనను శరణుజొచ్చవలెనన్న యిచ్ఛ అంతగా నాకు జనించలేదు; అందుచేతనే అంతగా అట్లు ఆకర్షింపబడలేదు. ఇట్లు అనాసక్తముగ, ప్రత్యేకవాంఛా రహితముగ నాలుగైదు మారులు వారిని దర్శించితిని; అప్పుడే క్రమేణా ఆయనయందాసక్తి పెరిగినది. ఒకనాడు ఆయన నాకు స్వప్నములో ప్రత్యక్షమై రెండు రూపాయల దక్షిణ యిమ్మని కోరినారు.

ఉదయమున లేవగానే, ఆ రెండు రూపాయలను షిర్డీకి మనియార్డరు ద్వారా పంపివేసినాను. అదే స్వప్నములో రెండు ఉపదేశోక్తుల బలికినారు; ఒకటి - సత్యనిష్ఠ సత్యవర్తనము ఆర్జవములతో నడుచుకొనుము. రెండు - విశుద్ధ సౌశీల్యము కలిగియుండుము - అని. అదిమొదలు యీ నియములను శ్రద్ధా భక్తులతో పాటించుచునేయున్నాను. దీని తర్వాత, ఒక పరి, 1917 లో నేను షిర్డీకి వెళ్ళినప్పుడు, ఆయన ఆదరముతో నన్ను దగ్గరకు బిలిచి, నిజ పవిత్రహస్తమును నా శిరముపై వుంచినారు; ఇదినాకు వింతయైన అనుభవముల కలిగించి, నూత్న ప్రాబల్యమును నాపై ప్రసరింపజేసినది. వెంటనే నేను ఒక గాఢ విస్మృతిసుప్తిలో పడిపోతిని; ఒక ఆనంద సమాధిమగ్నుడనై పోతిని. ఆవల స్మృతి వచ్చినతర్వాత ఇతరులు - నేనాస్థితిలో నున్నప్పుడు, బాబా వారితో నాకు సౌశీల్య సత్యవర్తనములు గలవని పదేపదే చెప్పినారని తెలియజేసినారు. జన్మాంతరములలో నేను అనుభవించిన వివిధ అవస్థల వివిధ స్థితులను వారికి చెప్పినారు. ఈ జన్మలో ఆయనే నా మాతృగర్భావాసమున నా జీవాత్మ నుంచితి ననిరి. ఇంకను నాకు సద్వర్తనము ఆర్జవము లున్నవనిగూడ గురుదేవుడు వెల్లడించినారట! ధన్యోస్మి.

ఈ రెండు రూపాయలగుడుట సాయిబాబాకు విలక్షణమైన సంజ్ఞాబోధక విధానము. ఆయన కోరిన రెండు నాణెములే ఆర్జవము - సచ్ఛీలము.

భక్తులను రాబట్టు కొనుట

ఒక్కొక్కప్పుడు ఆయన భక్తుల స్వప్నములలోను, భావనా కల్పనములలోను గాన్పించి, వారిని ఆకర్షించి బంధించుకొను చుందురు. ఒకరు బాబా శరణుజొచ్చి, మరి ఒకరు సంబంధ రహితులుగ నుండుట తమతమ యిచ్ఛాధీనమని అనుయాయు లకు తోచినను, సదా ఆకర్షించి సాన్నిధ్యములో చేర్చుకొనినది గురుదేవుడుగనే యుంటువచ్చినది. సాయిబాబా యీ విషయమై చాల విస్పష్టముగ చెప్పియున్నారు; 'దూరదూరమునుండి అనేక విధాల నా భక్తులను నేనే రాబట్టుకొందును. వారిని వెదకి నిర్ణయించి నా అండకు చేర్చుకొనునది నేనే. వారెవరుగాని తమంత తాము నన్ను దరిసి సేవించరు. నా భక్తులు ఎన్నివేలమైళ్ల దూర ములోనున్నను కాలికి తాడుగట్టిన పక్షినివలె, ఋణానుబద్ధులైన జీవుల నేను నాకర్షించుకొందును' అని ఆయన చాటిన భక్తబంధన విధానము!

ఐహిక వాంఛలు

ఇట్లయ్యు చాలమంది ఆయన మాహాత్మ్యములకును, ఐహిక సంపదల భోగముల పొందవచ్చునను ఆశతోనే ఆయన ఆశ్రయ మునకు మూగుచుండినారు. వారిలో కొందరు బాబా వెదజల్లు చుండిన ధనరాసులన్నిటిని తామే పొంద ఉత్సుకపడుచుండిరి 'చాలామంది ఐహిక వాంఛలకొరకు నన్ను చేరి, అవి లభించగానే నన్ను వదలక అనుయాయులగుచుండిరి' అన్నారు బాబా.

ఒక భక్తుడు, బాబా మందిరముచుట్టు మూగిన విచిత్ర విభిన్న వర్గములవారినిచూచి, 'వీరందరికి లాభములు చేకూరి నవా?' అని బాబానే అడిగినాడు. ప్రఖ్యాతినిపొందిన ప్రతి గురువును గూడ యిట్టి ప్రశ్న అడుగదగినదిగనేయున్నది. దీనికి ప్రత్యుత్తరంగా బాబా, నిండు పూతతోనుండిన ఒక మామిడిచెట్టునుచూపి: 'ఆ పూతంతయు కాయలైనచో ఎంతగొప్ప కాపైయుండును! అయితే ప్రతి పువ్వు పిందెను తొడుగుచున్నదా? వాటిలో ఎక్కువ వంతు రాలిపోయి, ఏ కొద్దియో నిలిచి, కాయలగుచున్నవి' అన్నారు.

తనదరి చేరమని అజ్ఞ

ఇట్టి కాయగాచిన పూవులలో ఆర్. బి. పురందరె ఒకరు. ఆయన తన బాబా ప్రథమ సందర్శనమును గూర్చి యిట్లు వ్రాసిపెట్టిపోయినాడు. 'నేను మొదట సాయిబాబాను గురించి 1909 లో విన్నాను. ఆవల కొంత కాలమునకు ఆయన దర్శనానికి వెళ్ళితిని. నేను ఒక అనాథ అసహాయదరిద్రుడనై యుండినను, ఎట్టి భూతల వాంఛతోగాని వారి సన్నిధానమును చేరలేదు. నాకు సాధులనిన భక్తి భావము; అందుచే బాబా ఒక మహాపురుషుడు - ఒక సిద్ధుడు అని తెలిసుకొనగానే, నా మనస్సు ఆయనవైపు ఆకర్షితమైపోయినది. ఒక కలలో ఆయన కాన్పించి షిర్డికి రమ్మని ఆజ్ఞాపించినారు. అదేసమయములో నా ఆరేండ్ల కూతురు చాలా జబ్బుచేసి మంచము పట్టియుండినది; అందువల్ల మాతల్లి ఊరు

విడచిపోవద్దనినది. కాని నేను పట్టు బట్టి, వ్యాధిపీడిత శిశువును భార్యను జననిని తోడ్కొని షిర్డి చేరితిని. అచట చేరిన మూడవ నాడే నా బిడ్డకు నెమ్మదించినది. ఆవల పది దినాలచట ఉంటిమి. ఈ లోపల బాబా నన్ను బయలుదేరనీయలేదు. ఆయనను నేనేమీ కోరలేదు. కాని, మా - తల్లితో నాకును ఆయనకును గత ఏడు శతాబ్దములుగా సంబంధ ముండినదనియు ఎంతదూరానఉన్నను నన్ను మరచిపోజాలననియు, నేను లేనిదే ఒక్క ముద్దయినా ఎత్తిన ననియు చెప్పినారు.

శ్రీ బాబాగారి అనుజ్ఞతో మేము బయలుదేరి దాదర్ (బొంబాయిలో ఒక పేట) చేరినాము. ఇల్లు చేరగానే నా భార్యకు తీవ్రమైన కలరా సోకినది. వైద్యులు బ్రతుకుటాస వదలుకొన్నారు. ఆ తర్వాత, మా యింటికి ఎదుట ఉండే చిన్న గుడి ముందర సాయిబాబా నిలుచున్నట్లు నాకు పొడకట్టినది; నన్ను పిలిచి షిర్డి నుండి తెచ్చిన విభూతిని ఆమె కిమ్మనినట్లు నాకు భావన కలిగినది. అట్లే చేసితిని. ఒక అరగంటలో ఆమె శరీరానికి ఉష్ణ మెక్కినది; వైద్యులకు ధైర్యము చిక్కినది. ఆవల త్వరలోనే ఆమె పూర్తిగా ఆరోగ్యము జెందినది.

### కౌతూహల జనిత దర్శనము

మరికొందరు, బాబాపై విశ్వాసములేకయే, రీూ విచిత్ర మానవుడు, మహిమలుచూపే యీూ యోగి ఎట్లుండునో చూడ వలెనన్న కేవల కౌతూహలముతో షిర్డి చేరెడివారు. అట్టి

వ్యక్తియే ఒక ఆంగ్లోయిండియన్ స్టేషనుమాస్టరు. ఆయన ఒక నాడు బాబా మందిరము చేరేవరకు బాబా మట్టికుండల కడగి, బోర్లించుచుండినారు. అతడు, అట్లు చేయుట ఎందుకని బాబాను అడిగినాడు. బాబా మర్మభేదకమైన హాస్యోక్తిగా - 'కుండలన్నీ యిట్లే అధోముఖములై నా దగ్గరకువచ్చును' అన్నారు. గ్రహించలేని ఆశ్రోతకు యిది అర్థంకాలేదు. పరమ భక్తుడైన దేశపాండే మొదట అవిశ్వాసిగా నుండిన తన బంధువు ఒకరిని గూర్చి యిట్లు చెప్పినాడు:- ఆయన చాలసార్లు ఒక్కడుగా బాబా దగ్గరకు పోయినాడు; తడవతడవ బాబా ఆయనను రాళ్లతో గొట్టి తరిమివేసినారు. చివరకు ఆయనను ఆ మస్జిద్ సమీపానికే రానిచ్చినవారుకాదు బాబా.'

వాంఛిత రూపదర్శన ప్రసాదము

మరియొక సందర్భములో, ఒక అవిశ్వాసియొక్క అవిచారపూర్వక భావనలను భయోద్పాదకంగా పోగొట్టినారు. ఒక బ్రాహ్మణ వైద్యుడు, మిత్రుల బలవంతాన షిర్డికి బయలుదేరినాడు కాని, తాను శ్రీరాముని దప్ప అన్యమూర్తిని సేవించననియు, యితరులు ఎంతగొప్పవారైనను చేతులు మోడ్చి మ్రొక్కననియు, అందువల్ల బాబాకు మ్రొక్కలేనందులకు అపార్థం చేసుకోరాదనియు స్నేహితులను ముందే కోరినాడు. ఆయనవచ్చి బాబా మందిరం బయట నిలుచుండి, లోపల జరిగే హిందూ పూజావిధానమును అట్లే గమనించుచుండినాడు; కాసేపైన తర్వాత ఉన్నట్లుండి ఆ

డాక్టరు పరుగెత్తి శ్రీసాయిబాబా పాద పద్మాలకు సాష్టాంగ దండ ప్రణామములు గావించినాడు. ఆవల, అంతటి స్థిర సంకల్పమును మార్చుకొనుటకు కారణమేమని అడుగగా - శ్రీరామ చంద్రాకృతిలోనే బాబా తన కట్టెదుట నిలిచియుండినాడని ఆయన చెప్పినాడు.

ఈ భక్తుని విషయములో, యింతకుముందు చెప్పిన వారికి వలె బాబా కృపజూపను నిరాకరించలేదు. ఈ డాక్టరు అజ్ఞానతిమిరాంధుడై భగవంతునియొక్క ఒకే రూపసాక్షాత్కారమును, ఆవిష్కృతిని మాత్రమే నమ్మి ఆరాధించి మాధ్యబద్ధుడై యుండినాడు. ఇక ఆయనకు కొరవడియుండినది మార్గోపదేశమే; దానిని బాబా వాత్సల్యము ప్రసాదించినది; కాని ఈ ఆచరణ విధానము బాబాకు విశిష్టమైనది. ఇతర గురువులై యుండినచో, గురువులందరు ఒకే జీవాత్మ సాక్షాత్కారరూపములని - అందువలన అందరూ సమానులని, ఆ పరమాత్మ వంకకే జీవులందరు ఆకర్షింపబడుదురని వివరించియుందురు. కాని, శ్రీబాబా విధానమే రమణీయము - మధురము! ఆయన మాటలతో ఉపదేశించక లక్షణపద్ధతిద్వారా బోధించేవారు. కాబట్టే బాబా చెప్పుటకుబదులు సాక్షాత్ స్వరూపముతో నిరూపించినారు. ఏ భక్తుడు యే నామమును యే రూపమును కోరి భజించవాంఛించునో ఆయా నామరూపాలతోనే దర్శనమిచ్చి ప్రసన్నతజూపి శరణాగతుల పరిత్రాణమొనర్చుచుండేనారు.

సాయిభగవానుడు ఇట్టి వాంఛితరూప దర్శనభాగ్యమును ఒసంగుటకు యిది ఒక్క తరుణమేగాదు. నాసికవాసి, నిజకులీనతావలేపముతో తల దిరిగిన ఒక బ్రాహ్మణుని ఉదంతముగూడ గలదు: ఇతడు షిర్డి చేరక మునుపే, సాయిబాబా ఒక గుడ్డల అద్దకము వానిని పిలిచి, తన అంగీకి బాగా జాబురా రంగు పట్టించమనినారు. సాధారణంగా ఆయన ఎప్పుడుగాని రంగు చొక్కాల తొడుగరు; ఎప్పుడూ తెల్ల అంగీలనే ధరించుచుండినారు. ఆ భూసురోత్తముడు వచ్చినాడు - బాబా మస్జిద్ జేరినాడు - కాని, మైలపోకునన్న భీతితో దూరాననే నిలువబడినాడు. కాసేపు అట్లే నిలిచి, హఠాత్తుగా ఉరులు త్రెంచుకొని బయటపడిన వానివలె పరుగెత్తి, శ్రీబాబా కాళ్ళపై బడినాడు. అచట ఆ బ్రాహ్మణునికి బాబా కాదు కాన్పించినది, నిజ ఆత్మగురువు కాషాయాంబరధారియై కట్టెదుట పొడకట్టినాడు!

భక్తుల బంధించుట

ఒకపరి, బాబా ఒక భక్తుని ప్రయత్నంతో లోబరచుకొనినారు. ఆవ్యక్తిని బాబా వదలిపెట్టలేదు. 'నా భక్తులలో ఎవరైనను, ఎన్ని వేలమైళ్ళదూరాన ఉన్నను మరణించగానే, ఆ జీవుని తాటితో కట్టివేయబడిన వానినివలె నా దగ్గరకు చేర్చుకొందును. నా వారిని ఎవరినిగాని తప్పించుకొని పోనీయను.' అన్నారు. నా దగ్గరకు అనగా, ఆయన కృపాతిశయమునకు అన్న వ్యంగ్యార్థము. ఇది తిరిగి తీసుకొనుటగాదు; ఇచ్ఛచే! ఇది చెదరి భిన్న జీవరూప

మును పొందియున్న మూలాంశను మరల గ్రహించి పరమాత్మలో ఐక్యము పొందించుటే! ఈ భౌతిక ప్రపంచమునుండి ఆ భంగుర శరీరత్యాగిని మూలచైతన్యములోనికి మరల సంలీనము గావించు కొనుటయే!

తన భక్తులెక్కడనున్నను - షిర్డిలో గాని, దూరమునగాని, వారి భూత వర్తమాన మనోగతభావసరణిని, బాహ్య చేష్టలను బాబా సమగ్రముగ తెలుసుకొని వెల్లడించుచు, చాలమారులు వికలసందిగ్ధ పరిస్థితుల గలిగించుచుండినారు. ఇట్లు వెల్లడించుటలో ఆటోపమునుగూడ ప్రదర్శించెడివారు.

మూఢ విశ్వాసచ్ఛేదనము

ఇది దీనికి ఒకమంచి ఉదాహరణము:- దీనియందు నిశిత హాస్యము, పూర్వసంప్రదాయ మాధ్యముగలవు. పూర్వాచార పరాయణతలో తీవ్రవాదము బాబాకు గిట్టదు. ఎర్రగడ్డ (ఉల్లిపాయ) లు, తినరాదను ఛాందసమును వారు లెక్కించరు. ఎస్. బి. నాచ్నె అను ఒక భక్తుడీ ఉదంతమును తెలుపుచున్నాడు:- 1915 లో నేను మరికొందరితో షిర్డికి వెళ్ళితిని; వారిలో మా అత్త గూడ ఉన్నది. మేము వేరుగా ఒక పేటలో ఒక ఇంట దిగినాము. ఆయింటి ఒక ప్రక్కన దాదా కేల్కర్ కాపురముండినాడు. మా అత్త ఉల్లిపాయలు తరుగుచుండినది; దాదా పూర్వాచారపరాయణుడైన బ్రాహ్మణుడు; ఆయనకు యివి నిషిద్ధములు అంతేగాక బొత్తిగా గిట్టవు. ఆయనకు కోపమువచ్చి ఆమెను దూషించి అప

హాస్యము చేయ ప్రారంభించినాడు. ఆమె ఎక్కువగా సంకటపడి నది.

ఇది జరిగిన కాసేపటికి, దాదా మనుమరాలికి తీవ్రమైన కంటిపోటు తగిలినది; బొబ్బలుపెట్టి యేడ్వ సాగినది. దాదా నేరుగా సాయిబాబా దగ్గరకుపోయి బిడ్డను రక్షించమని ప్రార్థించి నాడు. శ్రీ సాయి ఉల్లిపాయను కండ్లకువేసి రుద్దమనిరి. ఇంతకూ యీ ఎరగడ్డల తగవు సంగతే ఆయనకు తెలియదు. దాదా అవి ఎక్కడ దొరుకునన్నాడు. సాధారణంగా ఉల్లిపాయలు సాయిబాబా దగ్గర వుండేవి; ఆయన స్పర్శతో శక్తివంతములైన గడ్డలను ప్రసా దించునని ఆశపడినాడు దాద. కాని, యీ స్వహస్తదానము ప్రసా దింప బడలేదు; బాబా కలహించిన మా అత్తనుచూపి, ఆమెనే అడుగమనిరి.

ఇందులో విశ్వాస విశేషమేమనగా - బాబా యిట్టి విప రీత వైద్య ప్రక్రియలను చెప్పుచుండినను, యే భక్తుడుగాని యీ సామాన్య ఓషధికి ఇట్టి అనూహ్యా నూతన నివారణశక్తి యుండగలదో లేదో అని ఎన్నడుగాని ఊహించి యుండలేదు. ఇదే బాబా ప్రదర్శించే అలౌకిక అశాస్త్రీయ విధానము.

దూర విషయ దర్శనము

ఒకొక్కప్పుడు ఒక భక్తుడు మందిరము చేరగానే, ఆయన పడిన అగచాట్లను చూచినట్లు బాబా వర్ణించి శ్రోతలకు వినోదము కలిగించేవారు. ఈ వర్ణనములో గూడ ఒక విశిష్టత!

ఒక్కొక్కప్పుడు బాధిత భక్తుడు తానైనట్లు ఉత్తమ పురుషలో జెప్పి, ఇంకొకప్పుడు బాధాపాత్రుడైన వ్యక్తి ప్రస్తావనే లేకుండ యుండును.

ఆదం దలాలి అనే ముస్లిం భక్తుని ఉదంతము యిట్టిదే. కొంతకాలము క్రితము ఒక బీద మార్వారి, ఆకలితో నపసి దలాలి యింటికివచ్చి అన్నము పెట్టమన్నాడు. అతడు నాలుగు అణాలిచ్చి ఏదో ఒక స్వజాతీయుని పూటకూలి యింటికి పొమ్మన్నాడు. ఆ దినాలలో యీ మొత్తమునకు నిండు భోజనము దొరికేది. ఆ తర్వాత దాలాలి షిర్డీకి పోయినాడు. బాబా ఆదమును చూడగానే 'నేను యితని యింటికి అన్నమునకుపోతే, నన్ను ఒక మార్వారీ అన్నవిక్రయశాలకు పంపివేసినాడు' అన్నారు.

రోగార్తి నివారణ భస్మము

శ్రీబాబా దివ్యశక్తులు, ముఖ్యంగా రోగార్తి నివారణ యందు అపారముగా దయను కురిపించేవి. ఆదిలో కొన్ని మూలికలనుచెప్పి సేవించమనేవారు. కొంతకాలము జరిగిపోగా, మందులిచ్చేవానిని 'ఇక మందు మాకుల ప్రసక్తి పెట్టుకొనకుము, అందరికి ఒకే మూలిక ప్రయోగింపుము' అన్నారు. మరికొంత కాలము, శుద్ధిజేసిన పటికి చూర్ణమును రోగుల కిచ్చేవారు. దీని తర్వాత, తన అఖండ అగ్నికుండ మందలి భస్మమునే యివ్వసాగిరి.

ఒక్కొక్కప్పుడు, సమక్షంలోనున్న వ్యాధి పీడితులకు ఎట్టి ఓషధులనుగాని యివ్వకనే స్వయముగా రుజాదుల బాపుచుండిరి.

దూరానవున్న భక్తులు మాత్రము బాబా పవిత్ర విభూతినే వాడి నివారణమును బొందుచుండిరి. ఇప్పటికిని యిదే జరుగుచున్నది! బాబా భస్మప్రదాన పరిపూరిత భక్తకాముడు.

శ్రీబాబా రోగార్తి నివారణమునంతా సమగ్రముగా వ్రాయుటయన సాధ్యముగానిపని. ప్రతి భక్తుడు ఎన్నో విషయములను చెప్పగలిగియున్నాడు. బాబా సాన్నిధ్యములో జరిగినవేగాక, దూరాన ఆయన నామస్మరణముతో ఎన్నియో వ్యాధులు సమసిపోయినట్లు గూడ చెప్పువారు చాలామంది గలరు. నేటికిని దేశమందంతటను ఆయన భక్తులు ఆర్తిలో బాబాను ప్రార్థించి స్వాస్థ్యమును బొందుచున్నారు. వీటిలో కొన్ని సందర్భములలో సామాన్య చికిత్సయే గాక అతీతశక్తి ప్రదర్శనములుగూడ జరిగియున్నవి.

క్రైస్తవ భక్తుడు

జోసఫ్ అను నొక రోమన్ క్యాథలిక్ పోలీసు ఉద్యోగి యిది ఉదహరించుచున్నాడు:— 'నే నెన్నడుగాని షిర్డికి పోయియుండలేదు; కాని, మిత్రులవలన శ్రీసాయిబాబా మహిమను విని, ఆయన రూప పటము నొకదానిని మాయింట్ల ఉంచుకొనియుంటిని. ఆ పటమును నేను పూజించలేదుగాని, ఆయన ఒక ఋషిపుంగవుడని మాత్రం విశ్వసించేవాడిని, ఆయన శక్తులు మహత్తరములు! 1917 లో నోర్వేకర్ జబ్బుపడినాడు; ఆయన కొడుకు షిర్డికి పోయి శ్రీబాబాకు పన్నూరు రూపాయలిచ్చినాడు. దీనిని తీసికొనిన ఉత్తరక్షణములోనే బాబా చలిజ్వరముతో గడగడ

వణకిపోయినారు. కారణం అడుగగా - ఒకరికి మనమొకటి చేసి నపుడు అందలి బాధ్యతను సర్వస్వమును మనము భరించవలెను గదా - అన్నారు. దీని తర్వాత నోర్వేకర్ జ్వరమునుండి తేరు కొనినారు.

జోసెఫ్, తన ఆరాధ్యదైవము సంత్ ఫ్రాన్సిస్ జేవియర్ అయినను శ్రీ సాయిబాబానుగూడ సేవింతుననియు, ఆయన ప్రార్థ నల బాబా ఆలించి ప్రత్యుపకృతుల చేసినారని గూడ చెప్పుచు న్నాడు.

స్వీకారము - దానము

బాబా డబ్బు తీసికొనుటలోగూడ ఒక ప్రత్యేకత గలదు. సాధారణంగా ఆధ్యాత్మికశక్తిచే విశేషముగ నివారణము గావించు సిద్ధుడు యిట్టి ప్రత్యుపకృతిరూపక ధనమును గ్రహించడు. కొన్ని సందర్భములలో ధనాపేక్షతో ఆత్మశక్తిని ఉపయోగించిన వారికి ఆ శక్తులు పూర్తిగా నాశనమైపోవుట గూడ గలదు. సాయి బాబా విషయంలో పారితోషిక స్వీకారమనునది అన్వయించదు; ఎందులకనగా - యాచేత తీసుకొనిన దానిని ఆచేత దానముగ వెదజల్లెడివారు. చివరకు దినాంతమున ఒక్క కానుగూడ మిగిలేది గాదు.

దృష్టిప్రదానము

దేశపాండె చిన్నాయనకు బాబాపై భక్తివిశ్వాసములు లేవు. ఆయన తాత గ్రుడ్డివాడు. 1916లో ఆయనను షిర్డీకి తీసు

కొనిపోయి, బాబా సన్నిధికి ఆ అంధుని చేయిపట్టుకొని నడపించు కొని పోయినాడు చిన్నాయన. ఆ వృద్ధుడు, వెంటనే 'బాబా నేను చూడ లేకున్నానే!' అని మాత్రమే ఆవేదనతో అనినాడు.

'చూడగలవు; నాకు నాలుగు రూపాయలనిమ్ము' అన్నారు బాబా. ఈ మొత్తం హాస్యాస్పదమైనంతటి క్షుద్రమౌ! దేశపాండె బయటకుపోయి నోటుకు చిల్లరదెచ్చి, అడిగిన నాలుగు రూపా యలను బాబాకు ఇచ్చినాడు. ఆవల సాయిబాబా నిజహస్తముల ఆ అంధుని శిరముపై బెట్టిరి; ఉత్తర క్షణములోనే అతనికి చూపు వచ్చినది! ఆ వృద్ధుడు ఆనంద విహ్వాలుడై చుట్టు పరికించి, ఆశ్చర్య ప్రచలిత మానసముతో కేకవేసి, బాబాను స్తుతించి, నెనరు చూపినాడు. బాబా యింకేమియు పలుక కుండా, విభూతి నిచ్చి, వూరకే అతనిని వెడలిపొమ్మన్నారు. ఒక పవిత్రాలయ మునుగాని మహాపురుషునిగాని సందర్శించి నప్పుడు విభూతిని గ్రహించి వెడలుట పరిపాటి.

ఇంకొక అద్భుత సంఘటనము యిది: ఒక గ్రుడ్డి ముదు సలి స్త్రీ బాబాను సమీపించి: 'బాబాజీ యీ కండ్లతో మిమ్ముసంద ర్శించవలెను - ప్రసాదించుము' అని ప్రార్థించగానే ఆమెకు చూపు వచ్చినది! కాని, ఆమె ఆయన సన్నిధిని దాటిపోగానే ఆమెకు మరల చూపుపోయి అంధురాలై పోయినది. నిజం! ఆమె అర్థించిన వరము అనుగ్రహింపబడినది!

1913 లో, బి. యు. బాహాల్ కర్ చిన్నికొమారునికి జ్వరంవచ్చినది; ఆరు దినములు అంటిపెట్టుకొని కాచినది. వైద్యులిక ఆశలేదన్నారు. వెంటనే బాహాల్ కర్ కూర్చుండి బాబాను ప్రార్థించినాడు. రాత్రి రెండు గంటలప్పుడు సాయిబాబా ఆయన ఎదుట గదిలో ప్రత్యక్షమైనారు! బాబా భస్మము దీసి జ్వరపీడితునికి బూసి 'ఇక కష్టపడవలసిన అవసరములేదు. రెండు గంటలలో జ్వరము తగ్గి, రేపు ఉదయమునకు నెమ్మదించును. జ్వరము పూర్తిగా నివారణ అయినతర్వాత, వానిని నా దగ్గరకు తీసికొని రాండి' అన్నారు. ఆయన అన్నట్లే అంతా జరిగిపోయినది.

దూర గమనము

అది, మార్చి 8-వ. దినాంకము. ధూలియాలో బాహాల్ కర్ యింటజరిగిన ఉదంతమిది: ఆ సమయములో షిర్డి యందుండిన దేశపాండె యిట్లు జాబు వ్రాసినాడు:- 'సాయిబాబా, నీ ధూలియా స్నేహితుని యింటికి పోయివచ్చినాను' అన్నారు. 'ఏ స్నేహితుడు?' అని అడిగితిని, ఆయన అన్నారు:-'ఉపాసిని బాహాల్ కర్; ఆయన యింటికి నేను ప్రతిదినం పోవుచున్నాను. ఆయనకు వ్రాసికనుక్కో'..

ఒకపరి, ఆ ఆశ్రమములోనే నివసించే మహాల్సపతితో ఉల్లాసోద్దీపిత వాణిలో - 'నీ భార్యకు మెడమీద ఒక బాధాకరమైన గ్రంథి లేచినదే! నేను బాగుచేస్తా; ఇంకెవరు చేయలేరు - నేనే చేయవలె' ననిరి సాయిబాబా.

మహాల్సపతి భార్య ఆ సమయంలో షిర్డిలో లేదు; ఆమె కురుపు సంగతి ఆయనకు అసలే తెలియదు. ఆవల ఆమె - కురుపు బాధ, దాని హఠాత్ నివారణమునుగూర్చి లేఖ వ్రాసినది.

అవిశ్వాసి విశ్వాసియగుట

క్రింది విషయము పరీక్షా విషయముగ గ్రహించవచ్చును. న్యాయాధిపతి - ఎం. డబ్ల్యు. ప్రధాన్ గారు నుడివిన ఉదంతము: బాబు అను ఆయన కుమారునికి జబ్బుచేసినది. వారికి ఒక తెనుగు బ్రాహ్మణుడు పురోహితుడు; - (మహారాష్ట్ర శ్రీమంత కుటుంబములకు సాధారణముగా ఆంధ్రులే పురోహితులు.) మాధవభట్టు (భట్టు - పూజ్యుడు) యీ కుటుంబమునకు, చాల సన్నిహితుడే గాని శ్రీసాయిబాబా యందు విశ్వాసము లేనివాడు. ఇంతేగాదు, హిందూసనాతన బ్రాహ్మణులై యుండి, ఒక ముసల్మానుని యిట్లు భజించుటచేతనే యీ అనర్థము వాటిల్లినదని గూడ భావించినాడు భట్టు. అందువల్ల ఆయన ప్రధాను దంపతులను దత్తాత్రేయాలయమునకు బోయి పూజించి రమ్మని చెప్పినాడు. ఆ దంపతులు సాయిబాబాయే దత్తాత్రేయుడన్నారు.

ఒకనాటి రాత్రి భట్టుకు కలలో ఒకవ్యక్తి చేత చిన్న కర్రను బట్టుకొని ఆ యింటి మిద్దెమెట్లపైన కూర్చుండి యుండి నట్లు ప్రత్యక్షమైనది. తనకు పరిచయమైన రూపపటము వలన ఆ వ్యక్తి దివ్య సాయిబాబాయే అని గుర్తించగలిగినాడు. సాయిబాబా భట్టునుద్దేశించి - 'ఏమనుకొంటున్నావు? ఈ గృహ

నాథుడను - ప్రభువు నేనే! తెలుసునా?' అని అన్నట్లు స్వప్నంలో వినాడు. భట్టు యీ స్వప్న వృత్తాంత మెవరితోను చెప్పలేదు. ఈ లోపల బిడ్డ స్థితి చాలా క్షీణించినది. భట్టుకు యీ బిడ్డపై చాలా మమకారము; ఈ ప్రాణాపాయస్థితికి భయపడిపోయి, భట్టు యిక ఏ మాత్రముగాని వేదన సహించుకోలేక పోయినాడు; చివరకు భట్టు పరుగెత్తి శ్రీ బాబా పటము మ్రోల సాగిలబడి 'ప్రభో, యీ మధ్యాహ్నం నాలుగు గంటల లోపల యీ బిడ్డకు నెమ్మతించి మిద్దెమీదనుంచి క్రిందకు తీసుకొనివచ్చుటకు వీలైనచో మీరే దత్తాత్రేయ ప్రభువులుగా మీ చరణముల తలదాల్తును' అని ఆక్రందించినాడు.

వెంటనే బిడ్డ జ్వరము తగ్గిపోసాగినది! నాలుగు గంటలకు, ఆ బిడ్డయే ఆడుకొనుటకు తన్ను క్రిందకు తీసుకొనిపొమ్మని తల్లిని అడిగినది.

క్రింది ఉదంతములో, వ్యాధిని నివారించుటేగాక, రానున్న వ్యాధిని బాబా ముందే చెప్పిరి.

ఎస్. ఎస్. డి. నిమోణ్కర్ ఒక పోలీసు ఉద్యోగి. స్వ గ్రామమగు నిమోణ్‌లో ఆయన వదినే, యీ మధ్యనే ప్రసవించి నది. ఆమెను చూడను నిమోణ్ పూనానుండి బయలుదేరినాడు. మార్గమధ్యమున సాయిబాబా దర్శనము చేసికొనిపోవుటకు షిర్డీకి పోయినాడు. దర్శనానంతరం సెలవుదీసుకొను సమయములో,

బాబా సాధారణంగా యిచ్చే విభూతిని ఆయనకు యిస్తూ 'ఆ బిడ్డ ప్రాణం కాపాడు' అన్నారు.

నిమోాకర్ స్వగృహం చేరేవరకు, ఆ పురిటిబిడ్డ మృత్యు ముఖగహ్వరములో పడియున్నది, శ్వాస నిలిచిపోయినట్లున్నది; తలి దండ్రులు ఆశవదలుకొన్నారు. నిమోాకర్ బాబా యిచ్చిన విభూతిని వెదకినాడు; అది కాన్పించలేదు; బహుశః అది దారిలో జారిపడిపోయియుండును. అయినప్పటికిని, ఆయన ఆ బిడ్డను తన ఒడిలో బెట్టుకొని, మానసములో బాబా శరణుజొచ్చినాడు. పది హేను నిమిషాలకు గండము గడచిపోయినది.! బిడ్డ తేరుకొనసాగి నది.

సంతాన ప్రదానము

బిడ్డలు లేనివారికి సంతానానుగ్రహము చేయుట బాబా పలుమారు ఒసంగిన అనురాగపూర్ణ ప్రసాదము. ఇతర విష యాలలోవలెనే యిందుగూడ ఆయన అవలంబించుమార్గము లక్షణ పద్ధతిలో నుండును. తరచుగా సంతానప్రాప్తికి లక్షణంగా టెంకాయయో - మరి యే యితర ఫలమునో భక్తులకు యిచ్చే వారు. ఒక్కొక్కరికీ యిట్టి ప్రసాదమ్మును యిచ్చేవారేగాదు.

డి. ఎస్. రాసనె అను భక్తునికి యిద్దరు భార్యలుండినను సంతానము లేకుండినది. అతడు బాబాను సందర్శించినాడు. వెంటనే బాబా నాలుగు మామిడిపండ్లనెత్తి రాసనేకి యిస్తూ,

చనువుపేరుతో 'దామియా' అని సంబోధించి 'ఈ మామిడిపండ్లు తీసుకొనిపోయి తిని చనిపో' అన్నారు.

ఇదీ లక్షణార్థమే! రాసనే కలవరపడినాడు, కాని యితర భక్తులు దీని అంతరార్థమును విడదీసి చెప్పినారు. బిడ్డను పొందుట అనగా తాను మరణించి, తన స్థానమున ఇంకొక జీవిని నిలుపుటతో సమానమని; ఈ భౌతిక ప్రపంచములోనికి జీవిగాదూకుట యన మరణమని; ప్రశాంతముగ భూతల వాసనాతీతముగ మనుటయే బ్రతుకని దీని అర్థముగా చెప్పినారు.

బాబా: 'నీవు వాటిని తినకు; నీభార్యకు యిమ్ము' అని ఆదేశించిరి.

'ఏ భార్యకు?' అన్నాడు అతడు

'రెండవ ఆమెకు. ఆమెను వాటిని తినమను; ఇద్దరు పుత్రులు కలుగుదురు. పెద్దవానికి దౌలత్ షా అని చిన్నవానికి ఖానాషా అని పేర్లు పెట్టు.'

మరికొంత కాలానికి, రాసనేకి మొత్తం ఎనిమిది మంది బిడ్డలు కలుగుదురనికూడ బాబా చెప్పిరి. అట్లే జరిగినది! ప్రథమ పుత్రుడు జన్మించగానే రాసనే షిర్డీకిపోయి, 'ఏమి పేరు పెట్టేది?' అని బాబాను అడిగినాడు. మొదట సంతాన వరప్రసాదము జరిగి చాలకాలము గతించిపోయినా, యీలోపల ఎందరో భక్తులు వచ్చిపోయియుండినా, బాబా తడవుకోకుండా అన్నారు: 'నేను చెప్పినది మరచిపోయినావా? నీ లఘులేఖన పుస్తకంలో వ్రాసి

కొంటివే! దౌలత్ షా అని నామకరణము చేయమని నేను చెప్ప లేదా?'

పరీక్షలలో నెగ్గుట

క్రింది సపత్నేకర్ విషయము దీర్ఘ కాలికమై కొంత క్లిష్టముగ నున్నది. ఒక ఆధ్యాత్మిక గురువుకు ఎంతో సహనము శాంతి ఉండవలెనుగదా! మాగని పచ్చికాయల కోయుటలో ప్రయోజ నములేదు. అవి పండి పరిపక్వమైనంతవరకు ఎన్నో ఏండ్లు ఓపికతో నిరీక్షించుచునేయుండవలెను. సపత్నేకర్ యువకుడుగా న్యాయ శాస్త్రమభ్యసించేకాలములో, శ్రీబాబా ఉదంతము తెలిసికొని నాడు. తన సహాధ్యాయి డొకడు మొద్దు; చదువులలో చాల వెనుకబడినవాడు. క్రూరమైన అపహాస్యముగా సపత్నేకర్, అతనిని ఎట్లా పరీక్షలలో గట్టెక్కదలచుకొన్నావు అని అడిగినాడు. అతడు సంపూర్ణ ఆత్మ ప్రత్యయముతో, సాయిబాబా దయతో తప్పక నిశ్చి తముగా ఉత్తీర్ణుడనగుదునని గట్టిగా చెప్పినాడు. సపత్నేకర్, ఆ మిత్రుని - ఆ మిత్రుని ఆరాధన దైవము సాయిబాబాను యిద్ద రిని ఎగతాళిచేసి, తప్పకా క్షౌరమవుతుందని జోస్యం చెప్పివేసి నాడు. చివరకు మొద్దు అనుకొనిన మిత్రుడు పరీక్షలో నెగ్గినాడు కాని, సపత్నేకరుకు నమ్మకం కుదురలేదు. అది ఒక అదృష్టమయ సంఘటనము మాత్రమే అన్నాడు. ఆయన గూడ కృతకృత్యుడై, అధివక్తగా జీవనయాత్ర ప్రారంభించినాడు. వివాహితుడై ఒక పుత్రుని గూడ బడసియుండినాడు.

పదేండ్లు గడచినవి. సపత్నేకర్ ఏకైక పుత్రుడు మరణించినాడు. అది మొదలు పూర్వం తాను సాయిబాబాను గూర్చి మాట్లాడిన దెల్ల జ్ఞప్తికివచ్చి, ఆ మహామహునిపట్ల తాను గావించిన అపచారమునకు ఖేదపడ సాగినాడు. చివరకు తన కొమారుని మరణము తాను గావించిన ఆయతినిందఫలితము కానోపునేమో అనికూడ శంకించినాడు. చివరకు బాబా దగ్గరకు పోయి క్షమాపణకోరి, శరణాగతుడు కావలెనని సంకల్పించుకొనినాడు.

ఆ మందిర ప్రాంగణము సపత్నేకర్ ప్రవేశించి, బాబా కంటబడగానే, బాబా ఒక ఆరణ్యకునివలె అరచి సపత్నేకరును బయటకు తరిమివేసిరి. మరియొకమారువచ్చి పాదాక్రాంతుడైనాడు - మరల బయటకు తరిమివేయబడినాడు.

ఇంకొక సంవత్సరము గడచినది. ఒకనాడు సపత్నేకరు భార్యకు బాబా కలలో ప్రత్యక్షమై, భార్యాభర్తల నిద్దరిని షిర్డికి ఆహ్వానించినారు. ఈ మారు బాబా ప్రసన్నులై సపత్నేకరును అత్యంత ఆదరముతో ఆహ్వానించి, గత అమర్యాద వర్తనమునకు క్షమించమనికూడ కోరిరి. ఆవల ప్రక్కనున్నవారితో, ఉత్తమ పురుషవచనముతో, తానే సపత్నేకర్ అయినట్లు ఆయన చరిత్ర చెప్పినారు. తర్వాత బాబా సపత్నేకరునుద్దేశించి 'ఇతడు, తన బిడ్డను నేనే చంపితినని నన్ను నిందించును. అయితే ఏమి?

ఇప్పుడు మరల ఆ జీవినే యీాయన భార్య గర్భవాసమున నివసింప చేయుచున్నాను' అన్నారు.

ఆయన సెలవుదీసుకొని బయలుదేరునప్పుడు సాయిబాబా ఒక టెంకాయను సపత్నేకరుకు యిచ్చి, దానిని ఆయన భార్య పవిటకొంగున కట్టమని, సంతోషంగా పొమ్మని అనుజ్ఞ యిచ్చిరి. ఒక సంవత్సరానికి సపత్నేకరు బాబా కరుణాతిరేకము ప్రసాదించిన పుత్రుని ఆయన దగ్గరకు తీసుకొనిపోయి ఆయతీంద్రుని పాద సన్నిధిని ఉంచినాడు; బాబా దీవించినారు.

ఇంకొక భక్తుడు - ఎల్. జి. ముంగే ఉదంతము: ఆయనకు చాలామంది సంతానము కలిగినను, వారందరు పురిటిలోనే కాలగతి నొందుచుండిరి. ఆయన బాబా దగ్గరకుపోయి, తన దౌర్భాగ్యమును తెలిపి, మనగలిగిన ఒక బిడ్డను అనుగ్రహించమని దీనముగా అర్థించినాడు. వెంటనే బాబా 'ఒకటే అడిగెదవేల? నీకు నలుగురు బిడ్డల నిచ్చెద' ననిరి. అట్లనే ఆయనకు యిద్దరు కొడుకులు యిద్దరు కూతుళ్లు పుట్టి సలక్షణంగా పెరిగినారు.

అర్పణబుద్ధి

ఇట్టి అనుగ్రహముల ప్రసాదించబడుటకు భక్తుడు ఆయన యందు సంపూర్ణ విశ్వాసముకలిగి, సర్వస్వమును ఆయనకే సమర్పణము చేయవలెను. సపత్నేకర్ విషయంచూచి ఉన్నాము గదా! ఈ అర్పణబుద్ధి, ఈ శరణాగతేచ్ఛ బాగుగపండి పరిపక్వము కావలెను. ఇట్టి భావములేని ఉదంతము నొక దాని వర్ణింతును.

ఇది ఎప్పుడో ఒకప్పుడు 1910 సంవత్సరములో జరిగినది. ఒకనాటి ప్రొద్దుననే ఉన్నట్లుండి సాయిబాబా ఉగ్రుడై 'ఆ కిత వుడు - అఖిలుడు నన్ను చూడను రావడం ఎందుకు? నా దగ్గర ఏమున్నది? నేను కేవలం ఒక దిగంబర ఫకీరుడనే! మీ అందరి వలెనే మానవాంగములు గలిగిన సామాన్యుడనే' అని బొబ్బరించి నారు.

అధికారము లెక్కచేయమి

ఇట్టి కోపాటోప ప్రదర్శనములు అప్పుడప్పుడు జరుగుట కలదుగాని, బాబా ఎవరినిగూర్చి అంటున్నారో అది మాత్రము ప్రక్కనుండిన వారికెవరికిగాని బోధపడేదికాదు. ఇది జరిగిన కాసేపటికి, కొందరు ఉద్యోగులు తమ పరివారముతో రెండు టాంగాలలోవచ్చి మస్‌జిద్ ముందు దిగినారు. స్థానిక రెవెన్యూ ఉద్యోగి ఒక ఆంగ్లేయుడు; ఆయన భార్య చాలా కాలముగా బిడ్డలులేక, ఆ ప్రాంతాల జనులు మహిమాన్వితుజేసి, పూజించు చున్న వరప్రదాత అయిన యీ ఫకీరు దయను చరమయత్న ముగా పొందదలచుకొనినది. ఆమె, భర్తతో ఆ జిల్లా కలెక్టరును వెంటబెట్టుకొని వచ్చినది.

బండ్లు దిగగానే వారికి ఆ పరిసరములు హాయిని కలిగించక సంకటముగ నుండినవి. ఆ గ్రామీణ అనాగరిక వాతావరణము ఆ పాలక జాతికి గిట్టేదికాదు. వారితోగూడ వచ్చిన సహోద్యో ద్యోగి, ఆ మందిరములో కూర్చుండియుండిన ఒక భక్తుని

పిలిచి, నిజాధికార ప్రదర్శనముగా - దొరలు వచ్చియున్నారు, సాయిబాబాను త్వరగా కాలకృత్యాలు దీర్చుకొని రమ్మను. వారు బాబాతో మాట్లాడవలెననుకొన్నారు అని ఆజ్ఞాపించినాడు.

ఆ భక్తుడు నివ్వెవ్వరపోయినాడు! ఎంతటి అధికారులు ఆదేశించినను, అట్టి సందేశమును సాయిబాబాకు ఎరిగించను సాహసించలేకపోయినాడు; సరేనని నటించనుగూడలేదు అతడు. ఇది సాధ్యంకాదని కచ్చితముగా అతని ముఖానికే చెప్పివేసినాడు. నిజంగా బాబాతో పనివుండి వచ్చినవారైనచో ఆయన దయకు పాత్రమైనదాక కనిపెట్టుకొని యుండవలసినదేననిగూడ చెప్పినాడు.

బాబా పూజాదికములు తీర్చుకొనుటకు ఒక అరగంట పట్టినది. ఆవల ఆయన వారున్నదారినవచ్చిరి; దొరసాని బాబా దగ్గరకుపోయి, అవనతదేహయై చాలా మర్యాదతో అణకువతో - 'మహారాజ్, తమతో కొంత సంభాషించు నభిలాషతో వచ్చి నాము' అన్నది. కాని, ఆ మాత్రపు అణకువ బాబాను తృప్తి చేయజాలదు. ఎంతటి హృదయపూర్వకమునైనను కేవలం భక్తినే కాదు బాబా కోరునది. బాబా మొరటుగా - 'అరగంట మీరు వుండాల; నేను పోయి భిక్షమెత్తుకొనవలెను' అన్నారు.

అన్నభిక్ష

శ్రీసాయిబాబా పాదసన్నిధిని ధనప్రవాహములు నిరంతరము ప్రవహించుచుండినను, ఆదిలోవలెనే ప్రతి దినము గ్రామములో తిరిగి సేకరించిన భిక్షాకబళమునే భుజించేవారు. ప్రతి దినము

ఏవో కొన్ని ఇండ్లకు మాత్రమే వేళ్ళేవారు. ఆ గృహస్థులు ఇది తమ మహాద్భాగ్యంగా భావించి ఆ యతిని ఆరాధించి పరితృప్తి నొందుచుండిరి. ఒక్కొక్కప్పుడు, తన శిష్యు నొకని యీ భిక్షాటనమునకు నియోగించెడివారు. వచ్చిన ఆశ్వేతాధికారులను వేచి యుండజేసి, వారికి నమ్రతాగుణమును గరపుటకే బాబా స్వయముగా ఇప్పుడు భిక్షకు బయలుదేఱినారు. ఇదే ఆయన హాస్య విధానములోని విపరీత గుణము. ఇంతేగాదు, ఆయన యాచనను నివారింపగలుగుటకు వారికి ఒక అవకాశమును గూడ ఒసంగి నట్లగును.

అరగంట పట్టలేదు; పదినిమిషములలోనే తిరిగివచ్చినారు. రాగానే దొరసాని, వంగి దండముబెట్టి తన కోర్కెను మరల వెల్లడించినది. 'ఇంకొక గంట వుండండి' అన్నారు బాబా. ఆ ప్రభుత్వోద్యోగులకు కాలవ్యవధిలేదు; ఇంతేగాక ఒక ఫకీరు చేత యిట్లు పది మందిలో చులకన చేయబడుట సహించలేకపోయినది వారి ప్రాభవము. ఇది తమ అధికార తృణీకరణమని భావించి, నిలువకుండా వచ్చిన బండ్లలోనే ఎక్కి మరలిపోయినారు. పాపం! ఆపె నిస్సంతాన శ్మశాన చారిణిగనే యుండిపోయినది.

లౌకిక వాంఛల దీర్చుట

రోగార్తుల నయముచేయుట, బిడ్డల బాలారిష్టముల బాపుట, వంధ్యలకు కడుపు పంటగా సంతానమును ప్రసాదించుట మొదలగునవి బాబా వర్షించిన తరహైన ప్రసాదములు. ఇంతేగాదు,

పరీక్షలలో ఉత్తీర్ణులగుటకు, ఉద్యోగముకొరకు, ఒక వ్యాజ్యవిజయమునకు, వైవాహిక నిర్ణయమునకు, ఆయన భక్తులు ఆయనను అర్థించేవారు. ఈ అభ్యర్థనములు యథార్థ భక్తితో హృదయపూర్వక విశ్వాసముతో గావింపబడియుండినచో అనుగ్రహింపబడుచుండెడివి.

'దూరమునుండి గమనించినంతమాత్రానసే సాయిబాబాను గూర్చి ఎంతో సులభముగా చెప్పవచ్చును.' అన్నాడు జి. బి. నార్కె. ఈయన, దక్కన్ జింఖానా ఇంజనీరింగు కాలేజీలో భూగర్భ శాస్త్రాధ్యాపకులు. వీరు బాబా భక్తుడు; బాబా విషయక గంభీరతమ తత్త్వ వ్యాఖ్యానమునకు వీరు ఎంతో ఒప్పినవారు. నార్కె అంటారు.- 'ఇట్లు బాహ్య విషయమును బట్టియే బాబా గుణగణనము చేసినవారు మాత్రము మూలార్థమును, అంతస్సత్త్వమును పోగొట్టుకొనిన వారగుదురు. కాని, బాబా మాత్రము రక్షణకో - సహాయమునకో తన్నుదరియు భక్తుల గ్రహణశక్తికి ఆనుగుణ్యముగనే నడచుకొనుచుండినారు. ఆయనను ఆశ్రయించినవారిలో చాలమంది సంస్కారము లేనివారై, ఐహిక వాంఛలతోనే ఆరాధించుచుండిరి; అట్టి వారికి ఆయన నిజాంతర్గత మహిమాతిశయ ప్రకృతిని ప్రదర్శించరు. ఎవరైనా లోతుకు దిగి, అవగాహన చేసుకొగలిగినవారు వచ్చినప్పుడు, ఆయన యథార్థ శక్తులను-నిజాపూర్వ నైతిక బలమును ప్రదర్శించేవారు.'

ఒక్కొక్కప్పుడు ఏదైనా మాహాత్మ్యమును చూపి 'ఇది నేను చేయుదును' అనేవారు. కాని తరచుగా 'అల్లా అచ్ఛా కరేగా' (అల్లా చక్క-చేయుదురు) 'అల్లా మాలిక్ హై' (అల్లాయే ప్రభువు) అనేవారు. 'తాను భగవానుని ఉద్దేశించినప్పుడెల్లా ఫకీర్ అని సంబోధించుట ఆయన అలవాటు. 'ఆ ఫకీరు నన్ను అది చేయనీయడు' లేదా, 'ఆ ఫకీరు ఆజ్ఞాపించినదానినే నేను చేయ గలను' అనేవారు.

ఆయన సాధారణంగా అభ్యర్థనలను త్రోసిపుచ్చేవారు. వ్యాధిపీడితునికి ప్రాణదానముచేయుట, అతని బాధను పొడగించుటే అగునని - అనేవారు; ఇంకొక్కప్పుడు ఆ జీవిని దేహాంతరమున ఉద్భవింపజేయుదును అందురు. మరికొన్ని సమయములలో, సంతానమును ప్రసాదించమని వేడుకొనినప్పుడు - ఆ వ్యక్తి యీ జీవితానికి సంతానప్రాప్తి లేదనేవారు. కాని, ఒక వ్యక్తి విషయమున, యీ జన్మకు సంతాన సుఖము లేకపోయినను, తానే స్రష్టయై బిడ్డల ప్రసాదించిన అపూర్వ సంఘటనము ఒకటి గలదు: మరికొన్ని తరుణములలో కారణాలేమీ చెప్పక యే ఫకీరు నన్ను చేయనీయుటలేదు! అని మాత్రం అంటూ కోర్కెల నిరాకరించేవారు.

ఇట్టి ఐహిక వాంఛలకు సర్వసాధారణముగ బాబా అనుగ్రహము చూపేవారుకాదు.

గర్వభంగము

బి. ఎ. పటేల్ ఒక భూస్వామి; రెవెన్యూ శాఖోద్యోగి

కూడాను. ఆయన వృద్ధ జనకునికి పక్షవాతము తగిలినది. ఆయన విభూతి కొరకు బాబా దగ్గరకు పోయినాడు. కాని, బాబా 'నీకు విభూతి యివ్వను; అల్లామాలిక్ హై' అన్నాడు. మూడు దినాల తర్వాత ఆ వృద్ధుడు చనిపోయినాడు. దీనిని ప్రబల ప్రారబ్ధమందురు; నివారింప తగనిది జ్ఞానియైన బాబా తెలిసికొని తగిన రీతి నడచుకొనిరి.

ఈ పటేలు తన శరీర దార్ఢ్యము శక్తినిగూర్చి చాలా గర్వపడేవాడు. 1913 లో జరిగిన విషయం: అప్పటికి బాబా వృద్ధుడై యున్నారు; కాయము దుర్బలమైనది. పటేలు బాబా దేహమును బాగా మర్దనముచేసి, ఎన్నడూ ఆరిపోని ఆ నెగడు దగ్గరకు ఎత్తుకొని పోవుచుండినాడు. పటేలు తండ్రి మరణానంతరం ఒకనాడు, బాబాను ఎత్తుకొనబోగా సాధ్యముకాలేదు! ఎంతో ప్రయత్నించినాడు; అంతా నిష్ప్రయోజనమై పోయినది. ఇది చూచి సాయిబాబా నవ్విరి.

'దీనితో నాకు ఆయన రెండు విషయముల నుపదేశించినారు: ఒక్కటి - నీ దేహశక్తికి గర్వించవలదు; రెండు - తండ్రి మరణమునకు వగవవలదు' అని పటేలు తన దినచర్య పుస్తకములో వ్రాసికొనియున్నాడు.

సాయిబాబా పటేలుతో అన్నారు: 'నీవెందుకు దుఃఖించుట? ఇక ఐదు నెలలో ఆయన తిరిగివచ్చునే' అన్నారు. సరిగా ఆ ఐదు నెలలకు పటేలుకు ఒక పుత్రుడు జన్మించినాడు! దీని

బాహ్యార్థమిది - పుత్రోదయము నిజ జనకుని పునర్జన్మమని గురుతర అంతరార్థము. చైతన్యశక్తి ఒక భౌతికరూపమును ధరించి, దానిపై తీరని మమకారమును కలిగియుండినచో, మరల తత్సంబంధియైన రూపధారణమునే పొందును. ఎందులకన - ఆ జీవి గత జీవిత మూలకందముతోడి సంబంధమును త్రెంచుకోలేకపోయి, అదే తగులమున బడియుండును.

ఒక తరుణి పుత్రుడు విషనాగ దష్టుడైనాడు; ఆమె ఆర్తితో బాబాను విభూతి యిచ్చి, తన బిడ్డను రక్షించమని ప్రార్థించినది కాని, బాబా విభూతి యివ్వలేదు; ఆ శిశువు మరణించినది.

ఒక శరీరపతనము మరియొక శరీరమునకు జననము

హెచ్. ఎస్. దీక్షితుడు బాబా భక్తులలో అతివిచిత్రమైనవాడు. ఆయన బాబాతో 'స్వామీ ఆమె రోదనము హృదయ విదారకముగా నున్నది; నేను భరించలేను. నా కొరకైనా ఆమె బిడ్డను బ్రతికించండి' అని వేడుకొనినాడు. ఇక్కడనే ఒక విశేషము:— బాబా నిగూఢశక్తులు యిక్కడనే వ్యక్తమగుచున్నవి. ఫకీరు యిచ్ఛలేకున్నను బాబా కావలయుననుకొనిన ఎట్టి దుష్కర కార్యమునైనను చేయగలరు.

సాయిబాబా దీక్షితులతో అన్నారు: 'నీవు యీ విషయంలో తగులుకొనిపోబోకు. జరిగినది మంచికే జరిగినది. ఆ జీవి అప్పుడే ఇంకొక శరీరమున ప్రవేశించినది. అప్పుడు యీ జన్మములో చేయలేకపోయిన మహత్తరకార్యముల నెన్నిటినో చేయగలడు,

ఆ జీవిని నేను వెనుకకులాగి, యీ కళేబరమున ప్రవేశింపజేసినట్లయి నచో, ఆ క్రొత్తది నశించవలసియుండును. నీ కోర్కె ప్రకారము యిది నేను చేయగలనుగాని; దీని పరిణామ ఫలితాలనుగూర్చి యోచించినావా? దీని గురుతర బాధ్యత ఎట్టిదో ఊహించినావా? ఆ భారమును నీవు వహించ సిద్ధముగా నున్నావా?' అని

ఒక శరీరమునకు మరణమనిన ఇంకొక దానికి జననమగు చున్నది. కాని జ్ఞాని విషయములో మాత్రము యిది కేవలము భిన్నము. ఆత్మ సాక్షాత్కారమును పొందిన సంపూర్ణ జ్ఞాని, భౌతికరూపమును త్యజించి నిరాకారమైన అనంతత్వమున లీన మగుచున్నాడు. దీనినే మోక్షమని నిర్వాణమని బుధులు చెప్పు దురు.

ఎస్. బి. మోహిలె అను భక్తునికి గ్రహణశూలలతో ఒక కూతురు పుట్టినది. బాబా దీనిని సరిచేయగలడన్న విశ్వాసముతో ఆయన ఆమెను బాబా సన్నిధికి గొనిపోయినాడు. ఆయన వచ్చి రాకముందే సాయిబాబా అన్నారు:- 'నీ వెందుకు వచ్చినావో నాకు తెలియును గాని, ప్రయోజనంలేదే! ఈ బాలిక దైవాంశ సంభూత; యీ భూలోకయాత్ర ఆమెది చాల హ్రస్వము. ఆగామి నాగశుద్ధచవితి నాడు ఆమె చనిపోవును. ఆనాడు నీవు యింట నుండక, నీ ఆఫీసుకు పోతివా, ఆమెను మరల చూచు తృప్తి నీకు దక్కదు.' అట్లే జరిగినది! నాగులచవితినాడు ఆమె మరణించినది.

బాబా ఎచ్చరికను లెక్కబెట్టని తండ్రి ఉద్యోగమునకు బోయి, తన బిడ్డ కడపటిచూపులు లేకుండా జేసుకొనినాడు.

బాబా ప్రాణదానము చేయదలచుకొని ఎంతో శ్రమపడి నను విఫలయత్నుడైన ఉదంతము గూడ ఒకటి కలదు. నిగోజ్ గ్రామంలో బొబ్బల జాడ్యం (ప్లేగ్) చెలరేగినది; ఆ గ్రామ పటేలు భార్యకు ఆ వ్యాధి సోకినది. ఆ రాత్రి బాబా చావడిలో పండు కొని యుండినారు. మహాల్సపతి పరిచర్యలకుగా ప్రక్కనే ఉండి నాడు. 'ఈ రాత్రి నీవు నిద్రపోవద్దు. నిలుచుండి నన్ను జాగ్రత్తగా కాపలాగాయుచుండుము. ఆ దుర్మార్గుడు (ప్లేగు) ఆమెను తుద ముట్టించవలెనని ఉన్నాడు. నేను అల్లాను ప్రార్థించవలెను' అని బాబా అతనిని ఆజ్ఞాపించిరి. అట్లే ఆ రాత్రి అంతా ఆయన గురు దేవుని కనిపెట్టుకొనియుండి, చుట్టుపట్ల ఎట్టి శబ్దముగాని కలుగ కుండా చూచుచుండినాడు. వేకువజామున ఒక ఉద్యోగి కొందరు సేవకులను వెంటబెట్టుకొని గబగబవచ్చినాడు. వారు బాబాను దర్శనము చేసుకొనవలెనని ఆర్భాటముగ గలబా చేసినారు. మహాల్సపతి విభూతియిచ్చి మాటలతో వారిని శాంతి పరచి సర్దను ప్రయత్నించినాడు కాని, ప్రయోజనము లేకపోయినది. విశ్రాంతి మందిరమునుండి, బాబా అగ్నిపర్వతమువలె కోపాగ్ని కణముల గ్రక్కుచు బయటకు పెద్దగా అరచుచు, తిట్టుచూవచ్చి నారు. మహాల్సపతితో 'నీవుగూడా బిడ్డా పాపలు గలిగిన తండ్రివే గదా! నిగోజిలో ఏమి జరుగుచున్నదో అంతమాత్రం తెలుసుకో

లేక పోయినావా? ఇట్టి విపరీత వేళలలో యితరులను ఎందుకు రానిచ్చినావు?' అని కేకలువేసి, తటాలున 'అయినదేదో అయినది, జరిగినది సక్రమంగానే జరిగిపోయినది' అన్నారు బాబా, ఆ ఉద యాననే ఆ పటేలుభార్య చనిపోయినది.

శిష్యుల పరీక్ష - గుణపాఠము

సాయిబాబా ఉదారముగ ఎన్నోవరముల ప్రసాదించు చుండినను, గురువుగా వేధించేవారు. వేగుటకు సాధ్యముగానివ్యక్తి, ఆయన తన్నులు తిట్లు తప్పించుకొనినవారు చాలా తక్కువ. ఒక దుశ్చింత, ఒక దుశ్చేష్ట ఫలప్రదము కావలసిన అవసరమేలేదు; అట్టి మలినోద్దేశము అంతఃకరణమున పొడకట్టుటమాత్రమే చాలును బాబా కోపమునకు గురియగుటకు; ఆవల దాని ఫలితము తప్పించుకొనుట సకృతు.

ఒక భక్తుడు చెప్పిన కత:- అతడు మస్జిద్ లో కూర్చుండి యుండగా, ఎవరో ఒకరు వచ్చి, ఆ ప్రాంతాలలో అపరూపమైన ఎర్ర అరటిపండ్లను నైవేద్యముంచినాడు. బాబా వాటిని ఒక్కొ క్కటిగా తీసికొని, ఒలిచి ఉన్నవారికి పంచిపెట్టుచుండినారు. ఈ వ్యక్తికి తనవంతు వచ్చేవరకు పండ్లు మిగులవేమో అన్న ఒక భీతి అప్రయత్నముగానే పుట్టినది. దీనితో గూడ, సాయిబాబా గబ గబ ఒక పండు తీసికొని తోలుతీసి ఒకనికియిచ్చి, తోలు ఇతనికి యిచ్చి దానినే తినమని ఆజ్ఞాపించిరి. అతడు ఆ తోపకను మ్రిం గక తప్పినదిగాదు; అతని పేరాసకు యీా విధమైన శాస్తిని

అనుభవించక తప్పినదికాదు. అతడు తినగానే, బాబా చాలా పరి తృప్తిని పొంది, ఇంకొక పండు ఎత్తుకొని, శుభ్రముగా ఒలిచి అతనికి సగమిచ్చి మిగత ఆయనే ఆరగించినారు.

ఒక ముస్లిము వనిత, ఘోషాలోవచ్చి, ముఖముపై ముసుగుదీసి సాయిబాబాకు వంగి నమస్కరించినది. ప్రక్కన ఉండిన ఒక వ్యక్తి ఆమె మనోజ్ఞ ముఖారవిందముచే ఆకృష్టుడై, ఆమె మరల బాబాకు నమస్కరించి ముఖమునుచూపిన బాగుండును అని ఆశపడినాడు. బాబా ఒక దుడ్డుకర్ర తీసుకొని అతనిని ఒక చావుదెబ్బ యీడ్చి కొట్టిరి.

ఒకనాడు ఒక కుష్ఠరోగి, కష్టంమీద మస్జిద్ మెట్లను ఎక్కి పైకిపోయినాడు. అతడు చాలా వికారంగా నికృష్టంగా నుండినాడు. కౌపీనము దప్ప ఆచ్ఛాదనమేలేదు. దేహమంతా అసహ్యగ్రంధులతో, కుళ్లు కంపు కొట్టుచుండినాడు. కాళ్లంతా తెగ తినిపోయి ఉండినవి. అతడు బాబా సాన్నిధ్యానికి రాను ఎంతో కాలము పట్టి, ఎంతో దుర్భర క్లేశము అనుభవించినట్లున్నది. వచ్చి, నేరుగా బాబా ముందు సాష్టాంగపడి పోయినాడు. ఇట్లా ఆచరించి, ఆ రోగి లేచి, మాటా పలుకు లేకుండా మరలి, వచ్చిన దారిన మెట్లు క్రిందకు దిగిపోయినాడు. అప్పుడు బాబా ప్రక్కన వుండిన నాజూకురాణి - మేనేజరు సతి పీడ వదలినదన్నట్లు తృప్తిని వెల్లడించినది. సాయిబాబా, ఒక భక్తుని పంపి ఆ రోగిని తిరిగి తీసుకొని రమ్మన్నారు. బాబా ఆజ్ఞపై మరల అతడు

బహు కష్టముమీద ఆ పవిత్రాలయ సోపానముల ఆరోహించుచు నిజదేహ దుర్గంధమును వాతావరణమున వ్యాపింపజేయుచు, హేయ రక్త పూయములతో మెట్లను కరల గట్టించుచు, తొట్రు పడుచు మెల్లిగావచ్చి బాబా ముందు బోర్లపడినాడు. బాబా అతడు మోసుకొనివచ్చిన, మాసి మరగడమై జలదరింపు పుట్టించుచున్న ఒక గుడ్డల మూటను తీసుకొని విప్పినారు. 'పాలమిఠాయి! చాలా సంతోషం!' అంటూ అందుండిన వాటిలో ఒకటి తాను తీసుకొని, ఇంకొక దానిని అచట నున్నవారందరిలో మేనేజరు సతినే ఏరి, ఆమె చేతికి యిచ్చినారు. నిజంగా ఆమె నిష్ఠ శంక భక్తురాలే! కాబట్టే ఆ మహా ప్రసాదమును తృప్తిగా ఆరగించినది.

భక్తులు, అనుకొనినదినము షిర్డీనుండి బయలుదేరనీయక నిలిపి, వారి విశ్వాసముల పరీక్షించేవారు బాబా. ఇతర స్వాములనువలెనే వీరిని అడిగి, అనుజ్ఞబొంది ఆగంతుకులు బయలుదేరేవారు. కాని, సర్వసాధారణంగా తక్షణమే యీ అనుజ్ఞ అనుగ్రహింప బడెడిదికాదు. ఆ భక్తునికి ఆనాడు ఏదో ముఖ్య కార్యమో, తప్పనిసరిగా ఉద్యోగమునకు పోవలసియో ఉన్నప్పుడు, యీ సమ్మతి నిరాకరణము చాల సంకటముగ నుండెడిది. అయినను దీనివల్ల ఎవరికిగాని ఎప్పుడుగాని కించిత్తు అపకారము గూడ జరిగియుండలేదు. కావచ్చును గాని, రానున్న ప్రమాదముల బాబా అపనయింపగలరన్న విశ్వాసము మనస్థిమితము

ముందుగనే పాదుకొన జేసుకొనుటకు ఎంతో ధీశక్తి భక్తి అవసరముగదా!

విచిత్ర నిరోధములు

దీనికి అప్పటముగా సరిపోవు ఉదంతమునొక దానిని హెచ్. వి. సాథె నుడువుచున్నాడు. స్థానిక రెవెన్యూ ఉద్యోగితో పాటు ఆయన ఒక ఉపసంఘ సభ్యుడుగా విచారణ సలుపుచుండినాడు. వారందఱు మన్మాదులో మొదట సమావేశమై కార్యసరణికి కడంగవలెనని నిర్ణయించుకొనియుండిరి. దీనికి ముందు దినము సాథె, తన మామతోగూడ బాబా దర్శనార్థం వెళ్లినాడు. మరుసటి దినము, అనగా కార్యక్రమనిర్దిష్ట దినమునకు మన్మాదు చేరుటకు బయలుదేరుచు, ఆ మామగారు బాబా అనుజ్ఞను కోరినాడు; బాబా మొగమాటం లేకుండా నిరాకరించిరి. సాథె తన ఉద్యోగ్యం పోవునని భయపడి, మామను మరల బాబాను ప్రార్థించమనినాడు. ఆయన ఎంత ప్రాధేయపడినను, ఉద్యోగభంగభయము నెంత కరుణామయంగా విశదీకరించినను సాయిబాబా తొణకనూలేదు, అనుమతించనూలేదు గదా, పై పెచ్చు సాథె తప్పించుకొని పోవుటకు ప్రయత్నించకుండా వుండను ఆయనను గదిలోబెట్టి తలుపులు బిగించి వేయమనిగూడ ఆజ్ఞాపించినారు బాబా. మూడు దినములు గడచినవి; అప్పుడు బయలుదేరమన్నారు; ఆ ఆజ్ఞానుసారముగ సాథె మన్మాదు చేరినాడు; ఇతర సభ్యులు మొదటి కార్యసరణినిమార్చి, ముందుకు పొడిగించినట్లు

తెలిసికొన్నాడు. తాను ముందుగా మన్మాడు చేర్చమనిన విడిది సామగ్రిగూడ, ఏదో ఆటంకముచేత చేరలేదు. 'సరే! షిర్డిలో బంధింపబడుటవల్ల మునిగిపోయినదేదీలేదు; కాని తెలుసుకోలేక వృథాగా మనోవ్యథకు పాలైతిని. దీనివల్లగూడ అనవసర వ్యయ క్లేశములు తప్పుటేగాక సకుటుంబముగ బాబా పవిత్ర శక్తి ఛ్ఛాయలో మూడు దినములు దైవగంధమును మూర్కొని ఆనందించితిని. అవును! బాబాకు యిదంతా తెలిసియే అట్లు చేసినారు; కాని నా అజ్ఞానంలో, అచట ఉన్నంతకాలము అశాంతి భయములతో మిణికిపోవుచుంటిని. ఇట్టి సంఘటనములే సాయిబాబా మహిమాతిశయమును వెల్లడించి, ఆయనపై ఆశ్రయబుద్ధి దృఢతరమై పోవుచుండును.'

ఇంతేగాదు, బాబాపై విశ్వాసము ఇంకకొంత గాఢముగ ఉండియుండినచో, మనశ్శాంతి కల్లోలితమైయుండదు. సాయిబాబా ఆజ్ఞాపించగానే షిర్డియందు ఉండిపోవుట సురక్షితతమము. ఆయనతో చెప్పకుండా బయలుదేరినచో వాశేముప్పును ఆహ్వానించి నెత్తిపై బెట్టుకొందురు. దీనికి అబ్దుల్ రహీం షంసుద్దీన్ రంగారి అను భక్తుని విషయం ప్రస్ఫుట తార్కాణము. అబ్దుల్ ఇట్లు నుడువు చున్నాడు:—

చెప్పకుండా బయలుదేరిన దానికి శాస్తి

'1913లో నేను ఠాణాలో నివసించుచుండగా ప్లేగు వచ్చినది; బహుశః షిర్డీకిగూడ ప్రాకినదనుకొందును, ఒక్క నెలగా

నా భార్య ఏదో ఒక వ్యాధి పీడితగా నుండినది. గొంతువాచి, దవడలు ఉబ్బి ఏ పదార్థమునుగాని గ్రుక్కెడు లోపలికి తీసుకో లేక యుండినది. మందు తినుచుండినా అది పట్టినట్లు లేదు; నయమూ కాలేదు. ప్రక్కయింటి పెద్దమనిషి - ఆర్. జి. గుప్త అను అధి వక్త, షిర్డీకి సాయిబాబా దగ్గరకు తీసుకొని పొమ్మని హిత వాక్యము పలికినాడు; ఆయన తప్పకా దీనిని కుదుర్చునని ఊరట బలికినాడు.

'మేము బయలుదేరేనాటికి ఆమెకు యేదీ మ్రింగుడు పడలేదు. ఇగట్పురి చేరేసరికి ఆపె టీ త్రాగగలిగినది, నాశిక్ రాగానే ఏదో కాస్త తినగలిగినది; ఇది ఒక శుభసూచన! అది మొదలు నివారణ మహావేగముతో సాగినది. షిర్డి చేరగానే మస్జిద్‌కు పోయి సాయిబాబా ముందుల వంగి నమస్కరించితిని. నేను వచ్చిన పని చెప్పగా విని, నా భార్యను తీసికొని రమ్మన్నారు.

'ఆమెను తీసుకొనిపోతిని. ఆపె ఆయన కెరగినది. బాబా తన కుడిచేయి ఆపె తలపై బెట్టి 'ఖుదా అచ్ఛాకరేగా' (దేవుడు బాగు చేస్తాడు) అన్నారు. ఆయన అడుగక పోయినను, రూపాయా పావలా ఆయనకు యిచ్చితిని; దానిని ఆయన తీసుకొని, విభూతి పెట్టిరి. అక్కడ నేను రెండు గంటలు మాత్రమే ఉంటిని. నా భార్య కంఠవాయువు మహావేగంగా నివారణమగుచుండినది; అందువల్ల మేము బాబాతో చెప్పకుండానే బయలుదేరినాము. ఆయన మాత్రం మమ్ము పోవద్దని చెప్పినారు. కాని, నయమగు

టచే బయలుదేర వలెనని బుద్ధి పుట్టినది; ఆ ప్రేరణతోనే బయలు దేరినాము; అపరిచిత నూత్న ప్రదేశములో, అనసరమైన దాని కంటె ఎక్కువకాలం ఉండటం నాకు యిష్టంలేదు; దీనికితోడు మా ఆవిడ రెండేండ్ల చంటి బిడ్డను చంకన బెట్టుకొని వచ్చినది.

'మేము వచ్చిన టాంగా యింకను ఆ గ్రామమునందే యుండినది. ఆ బండినే మాట్లాడుకొని, ఆరు మైళ్లలోనున్న కోపర్ గాం రైల్వేస్టేషనుకు బయలుదేరినాము. మార్గమధ్యము చేరేవరకు బండి యిరుసు విరిగినది; అటు ఇటు గాకుండా సగంలో యిరుక్కొనిపోయినాము. అప్పుడు రాత్రి పది గంట లైనది; రాకపోకలు లేక బాట మాటుమణిగి పోయినది. ఆ అప రాత్రి వేళ మేము ముందుకుగాని, వెనుకకుగాని నడువలేక పోయి నాము. మార్గమంతా గాఢాంధకార మలముకొని, నిర్జనత్వంవల్ల భయానకమైనది. చలిగాలి అంగకముల నమలివేయుచుండినది. వీటి అన్నిటికితోడుగా, ఆ ప్రదేశమంతా దారిదోపిడి గాండ్ర మయమన్న సంగతి జ్ఞప్తికివచ్చి మనస్సును బాధింప జొచ్చినది. సాయిబాబాను గౌరవించక చేసిన అవివేకమునకు పశ్చాత్తాప పడినాము.

'ఇట్లు ఆ భయంకర మార్గమధ్యమున రెండు గంటలు గడచిపోయినవి. దూరాన బండి కదలిన అలుకుడు వినిపించి, క్రమేణా ప్రస్ఫుటమైనది. ఒక బండి దగ్గరకు వచ్చుచుండినది. అం దుండి ఒక కంఠ ధ్వని 'శాణానుండి వచ్చినాతడెక్కడ?' అని అరచి

నది. నన్ను పిలిచినది ఆ బండివాడే! అంతట నేనే ఆ తాణావాసినని చెప్పి, మా దీనావస్థ నెట్లు తెలిసికొని, ఆ అసాధారణ అకాల క్షణములో అక్కడికి ఎట్లు రాగలిగినావని అతనిని అడిగినాను.

అతడు 'సాయిబాబా పంపినారు' - అన్నాడు

'ఎందుకు?'

'మిమ్ములను తీసుకొనిరాను' - అన్నాడు.

'ఆ తర్వాత, మేము ఆ వచ్చిన టాంగాలో ఎక్కి, తిరిగి షిర్డి చేరినాము. అప్పటికి రాత్రి రెండుగంటలు దాటిపోయినది; బాబా మస్‌జిద్‌లో మా కొరకు కనిపెట్టుకొని కూర్చుండియే ఉండినారు. మమ్ము చూడగనే 'అనుజ్ఞ లేకుండా పోయినందుకుగా యీ అవస్థలన్నీ పడినారు' అన్నారు.

'నేను అంగీకారసూచకముగా తలవంచి క్షమాపణ వేడుకొన్నాను. మమ్ముల ఆ మందిరములోనే విశ్రమించమని, బాబా పోయి ప్రార్థనామగ్నులైరి. ప్రొద్దుననే ఆయన ఊరిలోనికిపోయి, కవళమెత్తుకొనివచ్చి, తాము ఒక రొట్టెతిని, మిగత మాకిచ్చినారు. అప్పుడు నా భార్య బాబా యిచ్చిన ఆ ఘనపదార్థమును తినగలిగినది. ఆ తర్వాత మమ్ము పొమ్మని సాగనంపినారు. నాకుషిర్డి యాత్ర యిది ఒక్కటే! అయినా నాకు సాయిబాబాపట్ల గాఢతర భక్తి కుదిరినది.'

బాబా సర్వాంతర్యామి

ఇట్టి గురుతులు, మహిమలు, నివారణలు సామాన్య

ప్రజలను బాబా సన్నిధికి ఆకర్షించినవి. కాని, ఆయన సన్నిధాన మున స్థిరావాసమేర్పచుకొనిన భక్తులు మాత్రము ఆత్మోన్నతికి, విజ్ఞానమునకు, ఆధ్యాత్మికోన్నతికి మాత్రమే ఆ మహాత్ముని సేవించుచుండినారు. ఈ బోధకు, యీ మార్గోపదేశమునకు భక్తులు షిర్డీకి పోవ నవసరముగూడ లేకుండినది. 'నేను కేవలము షిర్డియందుగాని, యీ కాయమునకుగాని బద్ధుడనై యుండుట లేదు. నేను సర్వాంతర్యామిని. నన్ను ఎక్కడనుండి ధ్యానించినను వారి ఎదుట ఉందును' అని సాయిబాబా చెప్పుచుందురు.

బాబా భౌతిక కాయముతో ఎన్నడును షిర్డీని వదలి పెట్టిపోయి యుండలేదు. ఒక భక్తుడు తన కొడుకు వైవాహిక ముహూర్తానికి సాయిబాబాను రమ్మని ప్రార్థించినాడు. దానికి బాబా 'భయపడబోకు; నీవు నన్ను తలచినంత మాత్రాన నీవె క్కడ ఉండినను నేను నీ దగ్గరనే ఉందును' అన్నారు. అతడు దీనితో తృప్తిపడక, యింకా బలవంతం చేసినాడు; అప్పుడు బాబా 'దైవాజ్ఞ లేనిదే నేనేమీ చేయలేను' అని ప్రత్యుత్తరమిచ్చి తొలగ ద్రోచుకొనిరి.

బాబా ప్రసాదములలో ఆధ్యాత్మికోన్నతియే యథార్థ వరము. రావుసాహెబ్ వై. జె. గాల్వాంకర్ అంటారు:- 'బాబా నా తలపై చేయిపెట్టినచో నాకొక అపూర్వ అద్భుత అనుభూతి కలిగెడిది; దాని ప్రాబల్యము ప్రస్ఫుటము. ఆ దివ్య స్పర్శతో నేను గాఢవిస్మృతి లోబడి బాహ్యమునెల్ల మరచి అత్యంతానంద

తన్మయావస్థలో మునిగిపోవుదును. ఇట్టి ప్రహ్లాదస్థితి తర్వాత, నేను ఆత్మవిషయక వాంఛలతో జీవితమును గడుపసాగుదును. ఆవల నా మానసిక పరివర్తనమున ద్వితీయ ఘట్టము 1932 లో సంభవించినది. అప్పటికి సాయిబాబా నిర్యాణమొంది పదునాలు గేండ్లు గడచిపోయినవి. ఒక నిశీథమున గాఢ స్వప్నములో నాకు సాయిబాబా సాక్షాత్కరించి, ఏమి కావలెనని అడిగిరి. నాకు అన్యమువలదు - దైవిక ప్రేమభిక్ష బెట్టుమని కోరితిని. బాబా అడిగిన వరమునిచ్చి అంతర్హితులైనారు. అది మొదలు నేను ధ్యానమునందున్నను, చదువుకొనుచున్నను మరియే యితరపని చేయుచున్నను అప్పుడప్పుడు అలౌకిక పవిత్ర ప్రేమ రసము నా మానసమునుండి బుగ్గపడిపారును.'

నిరంతర సాన్నిధ్యము

బాహ్య మహిమలతో, విపరీత వర్తనముతో బాబా కలిగించిన భావపరంపరను సమానీకృత మొనర్చుటకు యీ ఉదంతము వివరించి యీ అధ్యాయమును ముగింతును. రావుబహదూర్ ఎస్. బి. ధూమల్ - ఒక బ్రాహ్మణ అధివక్త - వెల్లడించు అనుభవమిది:

'సాయిబాబా విషయక అనుభూతులనుగూర్చి నన్ను ప్రశ్నించినప్పుడెల్ల నాకొక పెద్ద సంకటము కలుగుచున్నది. ఎందుల కన - అహర్నిశలు అనుక్షణము ఆయన సన్నిధానమును ఆయన ప్రేమవిభూతిని నేను అనుభవించుచునే యుందును. ఎంతటి స్వల్ప

తమమైనను నా జీవితానుభవములలో ఏదిగాని ఆయనకు సంబంధము లేనిదేలేదు. నా జీవితాంశము ప్రతిది సాయి ఆయత్తమని నా ప్రగాఢ విశ్వాసము. ఇక ప్రత్యేకముగా బాబా ప్రాబల్యమునుగూర్చి నా అనుభవముల వివరింపవలెననుటే దుష్కర విషయము. కాని, దీనిని యితరులందరు విశ్వసించి, నా విశ్వాసముల మాన్యపరతురని నేనెన్నడు ఊహించను; అంత మాత్రాన దానికి నేను సరకుగొనను. ఇంతకును ప్రజల అవిశ్వాసమే యితరుల స్వానుభవముల వెల్లడించుటకు ఒక ప్రబల ప్రతిబంధక మగుచున్నది. ఈ అనుభవములెల్ల స్వకీయములని, ఇవి నిజ ఐహిక ఆధ్యాత్మికోపకృతికి ప్రసాదింపబడుచున్నవేగాని, బయటి ప్రపంచానికిచాటను, తన శక్తిని ప్రకటించుకొనుటకు ఉద్దేశింపబడలేదని ప్రతి భక్తుడు నమ్మి అనుభవించుచున్నాడు. బాబాను అర్థము చేసికొనుటకు శ్రేష్ఠతమ మార్గము - సాధకుడు ఆ విభూతిని, ఆతాదాత్మ్యమును స్వయముగ అనుభవించుట ఒక్కటే! బాబా ఎక్కడికి పోయినారు? ఆయన సజీవుడై నేటికిని కర్మోద్యుక్తుడై యున్నారు. నిజానికి, ఆ మహాపురుషుని మహాసమాధిని ముందటికంటె యిప్పుడే, ఆయన శక్తి కర్మలు సచేతనములై సాంద్రములై ప్రకాశితముచేయుచున్నవి. నిజముగా విశుద్ధ బుద్ధితో కామించిన ప్రతివ్యక్తి నేటికిని ఆయన శక్తిసంబంధమును, మాహాత్మ్య స్పర్శను వెంటనే పొందగలుగుచున్నాడు. కాని, అట్లు స్వానుభవము చేతగాక, ఎవరివల్లనో యీ అనుభవములపొంద యత్నించినవానికి లభించునది మాత్రము వెలతక్కువ సరకు.

---

## 3. హిందూ మతము - ఇస్లాము

మత సామరస్యబుద్ధి

శ్రీ సాయిబాబా ఒక్కొక్కప్పుడు, తాను భక్త కబీరు అవతారమని వెల్లడించేవారు. 15-16 శతాబ్దముల మధ్య వెలసిన ఈ కవికి - ఈ జ్ఞానికి హిందూ ముస్లిము భక్తులుండిరి; వారి వారికి, వారి వారి- మతోపదేశములనే యీ విజ్ఞాని బోధించు చుండినాడు. ఇదే సాయిబాబాగూడ గరపిన ఆధ్యాత్మికవిద్య. ఆయన స్వయముగా యీ రెండు మతములలో దేనికిగాని ప్రత్యే కముగ అంటబెట్టుకొనియుండలేదు. ఆయన ఆశ్రమమును షిర్డిలో ఒక ముస్లిం ప్రార్థనాలయములో నెలకొల్పుకొనినారు. ఆయన జపించిన మంత్రములు, ఆలపించిన స్తోత్రములన్నియూ ఇస్లాము నకు జెందిన పారసీకము - అరబ్బీ భాషా సూక్తులేగాని హిందూ మతమునకు సంబంధించినవిగావు. కాని, ఇస్లాం ఆదేశానుసారముగ నమాజు చాలా అరుదుగా చేసేవారు; కొందరు శిష్యులు ఆయన నమాజు చేయుటను ఎన్నడుగాని చూచి ఎరుగరు; మరికొందరు పర్వదినములలోను శనివారములలోను అప్పుడప్పుడు యీ ప్రార్థ నముచేసే వారందురు. శనివారమన్నదే ప్రశ్న; ఏలనన - మహ మ్మదీయులకు శుక్రవారము (జుమ్మా) సంఘీయ ప్రార్థనలకు పవి త్రము - ప్రధానము. తన హిందూ భక్తులలో అధిక సంఖ్యాకుల

వలెనే ఆయన శాఖాహారి. వారు ఆయనను ఒక హిందూయోగి వలె, ఒక హిందూ దేవతవలె పూజించి ఆరాధించినారు. ఇంతే గాదు, పదేపదే ఆయన తన హిందు గురువును స్మరించి, హిందూ శ్రుతి స్మృతి వాక్యముల వివరించి హిందూ దేవతలనే మహిమ పరచేవారు.

మతములమార్పు నిషేధించిరి

కాని, ఆయన తన భక్తులను యీ రెండు మార్గములను ఏకము చేయమని కోరలేదుగాని, ఆ రెండు వర్గములమధ్య సహనము సుహృద్భావములను మాత్రమే వాంఛించినారు. ఇంతే ఆయన కోరిన గురుదక్షిణ! తాను నమాజు చేయకపోయినను, తన ముస్లిం శిష్యులను చేయమని ఆదేశించేవారు. ఆయన మతము ప్రకారము ఆ రెండు మతములుగూడ సన్మార్గములగుటచే ఒక మతమునుండి ఇంకొకదానికి మారుటను ఆయన ఎన్నడూ అంగీకరించలేదు; జన్మాదిగా ఒక వ్యక్తి అలవాటుపడిన పద్ధతినే అవలంబించమనేవారు. ఒక హిందువు ఇస్లామును స్వీకరించి, బాబా మస్‌జిద్‌కు వచ్చినాడు. బాబా అతని ముఖమువీద బాగా నరచి 'ఓ! అయితే నీవొక కొత్త తండ్రిని సంపాదించుకొన్నా వన్నమాట' అని అరచినారు.

సౌజన్య చిహ్నముగా, బాబా తన హిందూ ముస్లిం శిష్యులను ఒకరి పండుగలలో ఇంకొకరిని పాల్గొనమని ప్రోత్సాహించేవారు. ఇది యీ దేశంలో సాధారణము. ఒక ముస్లిము

హిందూ దేవత నారాధించక పోయినను, వారి ఉత్సవములో పాల్గొనును; ఇట్లే హిందువుగూడ నడచుకొనును. శ్రీరామనవమి ఉత్సవమునాడు హిందువులు తమ పాటలు పాడుకొనుచు, మధ్య మధ్య ఖురాన్ షరీఫ్‌నుండి కొన్ని సూరాల పఠింపజేయుదురు. కొన్ని పర్వములలో ముస్లిములు సాయిబాబా పాదుకలను చప్ప రములోబెట్టి ఊరేగింపు చేయుచుండ హిందువులు ఆ ఉత్సవ ములో పాల్గొందురు.

ప్రత్యేకమైన ఉపదేశసూక్తులు లేకనే, శ్రీ సాయిబాబా ప్రత్యక్షసన్నిధి ప్రభావమే పరహితేచ్ఛను, సహనమును, సహృద యమును ప్రభవింప జేయగలిగియుండినది. దీనికి ఉదాహరణము - అబ్దుల్లా అను ఒక పఠాను ముసల్మానుని ఉదంతమే! ఆయన కథనమిది:—

ద్వేషించిన మనసు ప్రేమించినది

'నా చిన్నతనములోనే పెషావర్ ప్రాంతాన స్వగ్రామము- తార్‌బెల్లా వదలితిని. నన్ను చూచే దిక్కేలేదు. హాజ్ యాత్ర చేసి పవిత్ర తీర్థాలైన మక్కా - మదీనాపట్టణములను చూడవలె నని కుతూహలపడినాను. క్రమముగా దక్షిణాపథమున మన్మాదు చేరి తిని. అక్కడ ఒక అభిమాని సులభంగా బొంబాయి చేరుమార్గం చెప్పి, అక్కడనుండి మక్కా బయలుదేరవచ్చునన్నాడు. ఇంకొ కరు - షిర్డీలో ఒక మహానుభావుడు - సాయిబాబా అని ఉన్నా రని, ఆయన కరుణించినచో ఫకీరులకు కనకవర్షము కురియుచుండు

నని, నా అదృష్టముపండినచో ఆయన నన్ను ఆయాత్రకు పంపవచ్చు నని ఆశాజనక వృత్తాంతమును జెప్పినాడు. నేను తిన్నగా షిర్డి వెళ్లినాను.

'అచట మస్జిద్ ద్వారం చేరగానే, కడవలో సాయిబాబా నా కన్నెదుట ప్రత్యక్షమైనారు.! మా రెండు చూపులు కలుసుకొనినవి! వెంటనే ఆయనే నా గురువని హృదయమునకు స్ఫురించినది. అక్కడనే నిలిచిపోయితిని. నాకు యితర ఫకీరులకు వలెనే మృష్టాన్నము లభించినది; అచటనే స్థిరావాస మేర్పరచుకొని సుఖజీవనం గడపవలెననుకొంటిని. ఇది జరిగినది 1913లో! అప్పటికి నేను యింకను బాల్యావస్థలో నే ఉన్నాను; జీవిత గురుతరభార వహానమన్న యేమిటో నాకింకను తెలియలేదు. అయినప్పటికిని, బాబా సాన్నిధ్యము, ఆ మందిరావాసము నా మానసిక దృక్పథమున ప్రస్ఫుట భేదమును ఏర్పరచినవి. మొదట షిర్డీ చేరునప్పుడు, హిందువులు నా ఆగర్భశత్రువులన్న భావముండినది. మూడేండ్ల బాబా పరిచర్యానంతరము, ఈ యీర్ష్యానలము ఆరిపోయినది; వారు నా సోదరులన్న తలపు కుదురుకొన్నది!'

అచట అన్ని వర్గాలమధ్య సామరస్యము సదా వెలసి యుండకపోవుటగూడ సహజమే! హిందువులు సాయిబాబాను పూజించుట అనునదే ముస్లిములకు గిట్టలేదు; అందులో యీ కాఫిరులు తమ పవిత్ర ప్రార్థనాలయములో యీ అపచేష్ట చేయుట అనునది, వారి భావసారళ్యమునకు ప్రబల ప్రతిబంధ

క్షమై; జరుగుచున్న అపకారమునకు అపచారము కలిపినట్లయినది వారికి.

ఇస్లాం సిద్ధాంతము

ఇస్లాం విశ్వాసము ప్రకారము ఖుదా ఒక్కడే పూజ్యుడు; ఈ ప్రపంచ సర్వస్వమును ఆయన శూన్యమునుండి సృష్టించి నందున సర్వజీవులు ఆయనయందు శూన్యత్వము నొందియుందురు.

సృష్టిద్విముఖము

ఇక హిందూమతము ప్రకారము - ఈ బ్రహ్మాండము, యిందలి చరాచర భూతకోటి సర్వస్వమును ఆయన ధరించిన రూపాంతరమేనని, అణువు మొదలు అజాండము వరకు ఆయన ఆవిష్కృతియేననియు, ఇట్లయ్యు; ఆయన అనావిర్భూత సత్య స్థితికి ఎట్టి మార్పుగాని కలుగదనియు ప్రతిపాదితము. భగవానుడు శూన్యమునుండి ప్రపంచమును సృష్టించినాడన్నను, దైవయాథార్థ్యమును మరుగుపరచిన మాయావిష్కరణమే యీ సృష్టిగాని అన్యము కాదన్నను సమానములే అగుచున్నవి. ఈ రెండు సిద్ధాంతములు ఒకే సత్యముయొక్క రెండు ఆకృతులు; ఒకే విషయమును రెండు విధముల చెప్పుటే యగుచున్నది. భూతల ప్రాణికి దేవుడిచ్చిన యథార్థస్థితికంటె అన్యములేదు కాబట్టి, అతని జీవనసారము అతని వాస్తవికత ఆ పరమ సత్యరూపమే అయివుండవలెను; ఇదే భగవానుడు! ఈ సత్యముదప్ప అన్యమే లేదు. నిజవ్యష్టి అభావత్వమును నిరూపించుకో గలిగినందువల్లనే—

దీనినే మధ్యమయుగ క్రైస్తవము ఆత్మానవగణనమన్నది - భూతల జీవి అయిన మానవుడు నిజస్వరూపమైన దైవాంశసారముయొక్క విశ్వత్వ ఉపలబ్ధిని అనుభవించ గలుగుచున్నాడు. కాబట్టి పురుషుడు ఆత్మీయ పరమార్థమార్గమును కనుగొనినచో, దేవునితోడి నిజ అనన్యత్వమును నిరాకారస్థితిని పొందుచున్నాడు. ఈ స్థితికి మానస శాస్త్రముతో సంబంధములేదు. ఇది బుద్ధీంద్రియమును దాటి, పరమ అస్తిత్వ మూలము నంటును. దీనినే యవనులు - 'నిన్ను నీవు తెలుసుకో' - అని అన్నారు. ఏసుక్రీస్తు 'నేను నా తండ్రి ఒకటే' అన్నదాని అర్థముగూడ ఇదే. దీనిని మున్ముందుగనే గ్రహించిన హిందువులు, అట్టి స్థితప్రజ్ఞుడైన మానవుని దేవునిగా ఆరాధించుచున్నారు. కేవలము యీ సిద్ధాంత వాక్యమునకు వాచ్యార్థమును మాత్రమే గ్రహించిన ముస్లిములు దీనిని మూర్తిపూజ, లేక విగ్రహారాధన మంటున్నారు. కాని వాస్తవముగా ఇది అట్టిది కాదు; ఇది దైవేతరము నారాధించుట కానే కాదు; పై పెచ్చు - ఆరాధకుని ఇంకను కప్పియున్న దైవేతర బుద్ధి ఆవరణమును, మాయను యీ ఆరాధ్యమూర్తి నాశనము చేసినదని గుర్తించుటకుగూడ సహాయపడుచున్నది.

## సూఫీమతము

మహమ్మదీయులలో విలక్షణ ఆధ్యాత్మికజ్ఞానులైన సూఫీలకు యిదంతయు సులభముగ గ్రాహ్యమగుచున్నది. సూఫీలలో చాలమంది మహామహులు, సిద్ధపురుషులు గలరు. హిందువులు

బహిరంగముగ ప్రవచించు సత్యముల వీరు రహస్యముగ బోధింతురు. కాని, భౌతిక వాసనాంధులైన సామాన్య మహమ్మదీయులకు యీసత్యము అవగాహము కాదు. వారిప్రకారము యీరెండు దృక్పథములమధ్య అలంఘ్యమగు జలరాశియున్నది; అందువల్లనే హిందువులను వీరు బహుదైవారాధకులని, విగ్రహారాధకులని పేరుబెట్టుచున్నారు. సూఫి మహాకవి - అల్ హల్లాజ్, ఆనంద తన్మయావస్థలో 'అనల్ హక్' - నేనే సత్యము అని చాటేవాడు. (హక్ అనగా సత్యము, దేవుడు) సత్యమన్నది ఒక దివ్యనామము. ఇస్లాం ధర్మము ప్రకారము ఇది దైవదూషణమని ఆ మహాజ్ఞాని శిరచ్ఛేదము గావింపబడినాడు. కాని యిందలి అంతరార్థమును సూఫీలు గ్రహించి, ఆయనను నేటికిని పూజించుచునేయున్నారు. ఇంకొక సూఫి - అబుసయ్యద్ 'యీ అంగీ క్రింద అల్లా దప్ప అన్యములేదు' అన్న అభావరూపేణ ఇస్లాం ధర్మశాస్త్ర సీమల లోనే నిలువగలిగినాడు. నేటికిని పఠింపబడుచున్న సాధారణ సూఫీ ప్రార్థనావాక్యము - 'దేవేతరమైన సమస్తమును క్షమించమని నా యందున్న దేవుని ప్రార్థించుచున్నాను' అని యున్నది. ఇదే హిందువుల 'అహం బ్రహ్మాస్మి' 'మయి సర్వం ప్రతిష్ఠితమ్' అన్న అద్వైతభావము.

బాబా ఆరాధనము

సాయిబాబాయొక్క హిందూవిధాన సంపూజనము, 1908లో ఆడంబర రహితముగా, తెలిసీ తెలియని ఒక నాలుగేండ్ల బాలునిచే

ప్రారంభించబడినది. అతని సోదరి ఇట్లు ఆ ఉదంతమును వర్ణించు చున్నది:— 'నా తమ్ముడు - బాబురావు అను నాలుగేండ్ల పిల్ల వాడు, ప్రతి ఉదయము సాయిబాబా మందిరమునకుపోయి, ఒక పువ్వు ఆయన తలపై నుంచి, పాదములకు నమస్కరించి వచ్చు చుండేవాడు. ఇంతకుముందు ఎవరినిగాని అది చేయనీయలేదు బాబా. దీనితో శ్రీసాయి సద్గురు నిత్యారాధన ప్రారంభమైనది.

విగ్రహారాధనము

హిందూ ఆలయాలలో దేవతలను పూజించుటను చూచిన ఆ బాలుడు శిశుసహజానుకరణ ప్రవృత్తి ప్రేరకుడై యీ పూజా విధానమునకు మూలమైనాడు. అది మొదలు పూజలు ప్రబలి శాస్త్రోక్త విధానముగ నియమము దప్పక నిరంతరాయ ముగ ఒక విగ్రహమునకువలె బాబార్చన సాగివచ్చినది. విజ్ఞానియైన యే హిందువుగాని విగ్రహమే దేవుడనునంతటి మూఢుడుగాడు; ఇట్లే ఏ క్యాథలిక్కు క్రైస్తవుడుగాని, ప్రభువు దివ్య విగ్రహ మునుగాని, ఆయన ప్రవచన పుణ్య గ్రంథమునుగాని దేవుడని భావించడు. నిరాకార నిర్గుణ పరమాత్మను ఊహించి, హృదయ పీఠమున నిలిపికొని ఆరాధించగలిగిన ఆత్మశక్తి మానవులలో ఏకొద్దిమందికి మాత్రమేగలదు. విగ్రహారాధనమునుగర్హించేవిమర్శ కులకు మాత్రము ఇది సాధ్యమైయున్నదా? సామాన్య హిందువు, భగవద్విభూతి రూపాంతరమైన ఏదో ఒక ఆకృతిని, ఆయన గుణ మహిమ ద్యోతకమైన ఒక దశను, ఒక శక్తి రూపమును ప్రద

ర్శించు చిత్రమునో విగ్రహమునో ధ్యాన లక్ష్యముగా కుదుర్చు కొని అందు మనోవాక్కు ల లగ్నముచేసి ఉపాసనా సౌలభ్యమును, సాధనను పొందుచున్నాడు. అట్టి ధ్యాత క్రమేపి నిరాకార బ్రహ్మ మును సాక్షాత్కరించుకో గలుగుచున్నాడు. ఇది యీ జన్మమున సాధ్యము కాకపోయిన ఆగామి జన్మలో యీ యత్నము సఫలీ కృతము కాగలదని ప్రతి హిందువు విశ్వాసము.

భగవద్గీత: 'పురుషుడు ఏ రూపమును ఆరాధించినను అతడు నిజముగా నన్నే పూజించిన వాడగుచున్నాడు' అని ఉద్ఘోషించుచున్నది. * శాస్త్ర సాంప్రదాయిక పూజా విధాన ములో అభిషేకము అర్చన ఫలపుష్ప ధూపనైవేద్యాదులు విగ్రహములకు అర్పింపబడుచున్నవి. సిద్ధ పురుషునికంటె అతీతుడు, పరమాత్మతో ఐక్యము సాధించిన మహాసాధకుడు యిట్లు పూజింప బడుచున్నాడు. ఇట్టి యోగులు పరమేశ్వరుని ఆవిష్కృత సచేతన రూపములని మహిమపరుపబడుచున్నారు.

షిర్డిలో నివసించిన ముస్లిములలో అందరు దీనిని ఆమో దించి హర్షించలేక పోయినారు; అందులో ఇది ఒక మస్‌జిద్‌లో జరుగుటయున - మతాపచార మనుకొన్నారు. కాబట్టే క్రమేణా హిందూభక్తులే అత్యధిక సంఖ్యాకులైనారు. అప్పుడప్పుడు అడ్డం కులుగూడ జరిగేవి. ఒక రోహిల్ ఖండ ముస్లిము ఉదయాస్త

---

* యద్యద్విభూతి మత్సత్త్వం శ్రీ మదూర్జిత మే వవా.
తత్త దేవావగచ్ఛ త్వం మమ తేజోంశసంభవమ్. ౧౦. అ. 41.

మానములు సాయిబాబా దగ్గరనే వుండి ఆయన పాదసన్నిధిని, పునీత ఖురానును పారాయణము చేయుచుండేవాడు. మధ్యాహ్న సమయములందు మస్‌జిద్‌లో హిందూ మేళములతో పూజలు జరుగుట అతడు సహించలేక, నిరోధించమని సాయిబాబాను కోరినాడు. దీనికి బాబా ఒక చిరునవ్వు వెలయించి: 'అదంతా గూడ అల్లాయే' అన్నారు.

ఒక ఉద్రిక్తుని నిర్వీర్యుని చేయుట

ఇది అతనికి విడివడని చిక్కైనది. ఆ హతభాగ్యునికి, శ్రీ బాబా ఇస్లాము మతమునకు విద్రోహ మొనర్చుచున్నాడని ఆవేదన జనించినది; దీనికి ప్రతీకారము చేయవలెనని దృఢ సంకల్పము చేసుకొనినాడు. ఒకనాడు సాయిబాబా ఒంటరిగా బయటికి నడకకు పోయినప్పుడు, ఆ రోహిల్లా ఒక బడితను వెనుక దాచుకొని, ఆయన వెనువెంట నడచుచు సమయముజూచి బాబాను పడగొట్టివేయవలెనని అనుకొనినాడు. అతడు చేయి ఎత్తబోవు క్షణానికి సాయిబాబా వెనుదిరిగి, అతని ఎడమ మణికట్టును పట్టుకొని, అట్లే ఆతనిని చూచినారు. ఆయన దృష్టి తైక్ష్ణ్యశక్తికి ఆగలేక ఆ మొరటు మానిసి నేలకు కూలిపోయినాడు. ఏ అంగముగాని కదిలించలేనట్లు అతనికి నిస్సత్తువై పోయినది. లేవలేక పోయినాడు. ఎవరో ఒకరు వచ్చి అతనిని పైకి లేవదీసినారు. ఆవల కొన్ని దినాలకు మంచిగా బాబా దగ్గరకువచ్చి ఆయన అనుజ్ఞ పుచ్చుకొని వెడలిపోయినాడు. ఇది అతని మేలుకే!

ఇంకొక సమయమున, మీర్ జమ్మాలీ అను ఇంకొక ముస్లిము అర్ధరాత్రి సమయమున ఉన్నట్లుండి లేచి, తన కత్తిదూసి హిందువులు బాబాను పూజించి ఆయనను చెఱచివేయుచున్నారని, కాఫిరుల కుత్తుకలు కోసివేయను అనుజ్ఞ యివ్వమని అరచి, ఉద్రేకంతో గోలచేసినాడు. సాయిబాబా అతనిని శాంతింపజేసి: 'ఇందులో పిచ్చి నాది; వారు నన్ను అట్లు పూజించుటకు బాధ్యుడను నేనే; కాబట్టి దీనికిగా నీవు ఎవరిగొంతులైన కోయ వలసియున్నచో, మొదట నా గొంతుకోసి, ఆవల యీ కార్యమునకు ఉపక్రమించుము' అన్నారు.

హిందూమత పరిపక్వత

ఇక, హిందువులకు పరమత సహన మనునది సులభైక సాధ్యమైనపని. వారి మతము వివిధ సిద్ధాంతములను, వివిధ దైవ సాన్నిధ్య మార్గములను అంగీకరించుచున్నది. క్రైస్తవ ఇస్లాం సూత్రములలోవలె యిందు వారికి పరస్పర వైరుధ్యములేదు. ప్రతి ఉపాసన మార్గముగూడ వివిధ వ్యక్తుల మానసిక తత్త్వమునకు, బుద్ధి వికాసమునకు ఆనుగుణ్యముగ నుండునందురు హిందువులు. అందువల్లనే యితర మతములలో చూపబడిన మార్గముల నెల్ల అంగీకరించుటకు హిందూ హృదయము పరిపక్వమై సులభముగ గ్రహించ గలుగుచున్నది. హిందూభక్తులు సాయిబాబా యందు వెలసియుండిన దివ్యపురుషుని ఆరాధించినారు; ఇక ముస్లిములు అట్లుచేయలేకపోవుట వారిదురదృష్టముమాత్రమే! ముస్లిము

లలో వలెనే హిందువులలోగూడ మతోద్రిక్తులున్నారు గాని, హిందువుల మతోన్మాదము తీవ్ర రూపమును దాల్చలేదు. గురువు ముస్లిం అయినంతమాత్రాన పూజించనివారికి అపకారమేగాని ఉపకారము జరుగలేదు. ఇట్టి పూజా నిరాకరణములు చివరకు ఎట్లు అపనయింపబడినవో యింతకు ముందే వివరింపబడియున్నవి. క్రింది కథ బాబా నిగూఢ వాఙ్మయము ప్రాబల్యమునుగూర్చి చెప్పుచున్నది.

బాహ్య పారుష్యము

మేఘుడను బ్రాహ్మణుడు భక్తుడైనను అకుటిలాత్ముడైన అవివేకి అనవచ్చును. డెపుటీ కలెక్టర్ - హెచ్. వి. సాఠె యితనిపై ప్రీతిగొనినాడు. అతనికి కొన్ని మంత్రముల ఉపదేశించి, బరూచాకుపోయి, అచట నర్మదా తీరస్థ శివుని పూజించి రమ్మని నాడు. కొంతకాలమైన తర్వాత సాఠె మేఘునితో సాయిబాబా పరమశివుని అవతారమనిచెప్పి షిర్డీకిపోయి ఆయననుగూడ కొలిచి రమ్మనినాడు. మేఘుడు బయలుదేరినాడు. రైల్వేస్టేషనులో మాటమాటలో సాయిబాబా ముస్లిమని తెలిసికొని, అట్టి మ్లేచ్ఛునికి పాదాక్రాంతుడగుట యన్న భావముతోడనే విభ్రమ విహ్వలుడై తిరిగివచ్చి యీ దైవదూషణ కార్యమును తన తలపై రుద్దవద్దని సాఠేని ప్రాధేయపడినాడు. కాని సాఠే పట్టు వీడనందున, యిష్టంలేకున్నను కష్టంమీద అతడు షిర్డీకి బయలు దేరినాడు. అతనివెంట సాఠెగూడ కదలివెళ్ళినాడు.

మేఘుడు మస్జిద్ చేరకముందే బాబా కేకలు వేసి కోపపడను మొదలుపెట్టి, అతడు కనబడగానే: 'ఆ అధముని బయటకు విసరి పారవేయండి' అంటూ తానే తరిమివేసినారు. ఆవల ప్రక్కన నిలుచుండియుండిన సాథే వైపు తిరిగి, అట్టి అసంస్కార సంకుచిత బుద్ధిని తన ఎదుటకు తీసికొనివచ్చినందులకు మందలించినారు.

ఇదంతా బాహ్యానికే! లోపలనే ప్రభావం పనిచేయను ప్రారంభించినది. ఒక సంవత్సరము గడచిపోయినది. క్రమేపి మేఘుడు షిర్డీపట్ల ఆకృష్టమానసుడగు చుండినాడు. ఇది సహజ ప్రేరణమైనది. మరల షిర్డికివచ్చి బాబా మందిరము తనకు తానే ప్రవేశించినాడు. అది మొదలు మరణపర్యంతము అచటనే నిలిచి పోయినాడు. ఆ రోహిల్లుని విషయములో వలెనే యితనికిగూడ అంతర్గత పరివర్తనము సాయిబాబా బోధలేకయే జరిగినది. అతడు సాయిబాబా సంపూజన సపర్యలందే నిమగ్నుడై యుండి, మందిరమున అనుదిన అనుష్ఠానాదికముల అర్చనల చేయుచుండినాడు. చివరకు మేఘుడు నిజ భౌతిక కాయమును వీడినప్పుడు - 'ఇతడు నా యథార్థ భక్తుడు' అని సాయిబాబా చాటినారు.

ఆలయ పునర్నిర్మాణము

రానురాను బాబా మందిర భక్తకోటి హిందువుల మయమైపోయినది. మస్జిద్ పునర్నిర్మాణమునుగూడ వారే సాగించినారు. ఆదిలో బాబా అందు వెలసినప్పుడు, అది శిథి

లోన్ముఖమైన మట్టి కట్టడము; మూడు ప్రక్కల ఎనిమిది అడు
గులఎత్తు సమానముగ పదునాలుగు అడుగుల పొడవుతో తూర్పున
పూర్తిగా మహమ్మదీయుల పీర్ల చావడివలె తెరువబడియుండినది.
కప్పు చివికి, నవసి సగముకూలి మిగత కూలిపోవనుండినది.

ఆయన భక్తులు మహా ప్రసాదమని ఒక క్రొత్త భవన
మునో ఒక ఆలయమునో నిర్మింప గలిగియుండియు, బాబా ఆ
మస్‌జిద్‌ను వదలునట్లు చేయలేక పోయినారు; అందువల్లనే ఆ
పురాణ భవనమును పునర్నిర్మాణము గావింప నిశ్చయించుకొని
నారు. దీనికి ఎన్ని మారులు అడిగినా బాబా అంగీకరించలేదు.
చివరకు, ఒక రెవెన్యూ ఇన్‌స్పెక్టరు - సాయిబాబా దయవలన
ఒక పుత్రుని బడసి సేవించుచున్న భక్తుడు - జి. ఆర్. గుండా,
కొన్ని బండ్లరాళ్లను ఆ మందిరము ముందు దింపించి, వెంటనే
పని ప్రారంభించ బోవుచున్నానన్నాడు. బాబా ఆ రాతితో
ప్రక్కన వుండిన హిందూ దేవాలయమును బాగుచేయమని చెప్పి
నారు, కాని గుండా వినలేదు.; చివరకు బాబా లొంగిపోయి
నిర్మాణమునకు అనుజ్ఞ యిచ్చినారు. ఆవలగూడ పనికి అడ్డము
తగులుచు, కట్టినదానిని ఒకొక్కప్పుడు పెరికివేయుచుండినారు.
రాత్రులందు మాత్రమే బాగా పనిసాగినది. అదీ ప్రతిదినము వీలై
నదిగాదు. దినము మార్చి దినము అతిథి గృహములోను మందిర
ములోను బాబా నిదురించేవారు; సందు దొరికిన ఆ రాత్రియందే
నిర్మాణము సాగుచుండినది. భవనము ఇస్లాం ప్రార్థనాలయముగనే

నిర్మింపబడవలెనని బాబా పట్టుదల. దానిలో అఖండ అగ్ని కుండమే విశేషము. దాని ప్రక్కన ఒక పెద్ద అరుగును, ఒరిగి కూర్చుండుటకు చేపట్టు గలిగిన దానిని కట్టించి, బాబా దాని మీదనే కూర్చుండేవారు. ఆయన ఆ భవనాన్ని 'బ్రాహ్మణ మస్‌జిద్' అని పిలచేవారు. ఆయన ఉపయోగించిన బ్రాహ్మణ పదము, బ్రహ్మవిద్య దెలిసిన వాడన్న అర్థములోనే ఉపయోగించబడినది.

పిండి విసరుట

మందిరము ముందు, ఆవరణములోపల ఒక తులసికోటను కట్టించినారు. మందిరములోపల ఒక తిరుగలి ఉండినది. దినములో చాలాసేపు రొట్టెకు పిండి విసరుచు బాబా కాలము గడపేవారు. ఇది ఆయన సంకేత కార్యసరణిగా కాన్పించేది. తాను విసరిన పిండితో, తానే రొట్టె కాల్చి అందరికి చాలా ధారాళముగా పంచిపెట్టేవారు.

తోటి పనికత్తెకు ముందు నైవేద్యము

మందిరము లోపలనో, బయటనో కొన్ని కుండలనుపెట్టి, యింతకు ముందు వర్ణించినట్లు, వాటి నీరు ఒక దానినుండి ఇంకొక దానికి పోయుచుండేవారుబాబా. మస్‌జిద్ బయటబెట్టియుంచిన మరి కొన్ని కుండలలో, తాను గ్రామములో, తిరిపెమెత్తుకొని వచ్చిన అన్నమునుపెట్టి వుంచేవారు. తాను భుజించే దానికి ముందు, పాకీపని చేయుచుండిన ఒక ఛండాలస్త్రీ స్వయంగా తనకు కావలసిన మటుకు వాటినుండి అన్నమును ఎత్తుకొని పోయెడిది. ఇంతే

గాక, వచ్చిన కుక్కలు కాకులుగూడ ఆ కుండలలో మూతులు బెట్టి ఆరగించి పోవుచుండేవి. ఆవలనే బాబా ఆరగింపు!

* * *

# 4. సంకేతములు - శక్తులు

సాంకేతికముగా మహిమలు జూపుటగాని, ఉపదేశించుట గాని యే ఒక్క మతముగాని, యే ఒక్క గురువుగాని సృష్టించిన ప్రత్యేక లక్షణ విధానము కాదు. ఈ భౌతిక జగత్తుకు ఆధ్యాత్మిక సత్యమునకు మధ్య జరుగు ఉత్తర ప్రత్యుత్తరముల రూపమే యీ సాంకేతికోపదేశము. ఈ స్థూల ప్రపంచము, వాస్తవములో పరమ సత్యమునందు దర్పణ దృశ్యమాణ నగరీతుల్యమగుచున్నది. కాబట్టే యీ సాంకేతికోపదేశములను గుర్తించి అర్థము చేసుకోవలసినదేగాని సృష్టించ నవసరములేదు. ఐరోపా మాధ్యమిక యుగ రసవాదులు 'పైన ఎంతో క్రిందగూడ అంతే' అన్న దాని అర్థమిదే. ఏసుక్రీస్తు 'మానవుడు తిరిగి జన్మించుచున్నాడు' అన్నదిగూడ ఈసంకేతార్థమునే తెలుపుచున్నవి. ఖురానులోగూడ యిట్టి భావార్థ సూత్రములు గలవు.

అద్వైత మార్గమున యీ సంకేతముల కంతగా తావు లేదు. ఎందుకనిన, ఇది యీ దృశ్య ప్రపంచమును వివరించిన దాని కంటె ఎక్కువగ మిథ్యయనియే చాటుచున్నను యీ ప్రపంచ అస్తిత్వమును అంగీకరించుచునేయున్నది. ఇతర మార్గములందు యీ విధానము చాలా విపులముగా వృద్ధిచేయబడియున్నది.

బాబా విధానము చేతలేగాని, మాటలుగావు

ప్రవక్తలు చాలమంది యీ స్వరూప లక్షణ విధానమును అవలంబించియున్నను,సాయిబాబా మాత్రంవీటికి అమితముగ మరగి పోయినారు. ఆయన ఉపదేశ విధానములో అదేదో ఒక నిగూఢా ర్థము గర్భితమై యుండెడిది. ఆయన ప్రదర్శించిన మహిమాతిశయ చర్యలలో ఎన్నో భౌతిక లౌకిక ఉపకారములు బాహాటముగ వర్షింపబడెడివి; కాని ఆధ్యాత్మికోపదేశములు మాత్రము మరుగు పరచబడు చుండినవి. ఇతరులు మాటలతో చెప్పినవి బాబా చేతల తోను, ప్రత్యక్షమైనవి ప్రచ్ఛన్నముగను చేసేవారు. ఒక భక్తు రాలు, తన యింటికివచ్చి తనతో సంపక్తి భోజనముచేసి ప్రసా దించమని ప్రార్థించినది; బాబా అంగీకరించిరి. భక్తి సంభ్రమము లతో ఆమెయే స్వయముగా ప్రీతి కరమైన ఉపాహారముల చేసి నది. కాసేపటికే, ఒక వీధికుక్క ఆమెను కనుమరిగించి, యింట దూరి, బాబాకు నివేదన జరుగకముందే ఆ భక్ష్యభోజ్యాదలలో మూతిబెట్టి తిన బోయినది. ఇది చూచి ఆవిడ దానిని తరిమి వేసి, బాబాను ఆహ్వానించుటకు ద్వారకీమాయికి (బాబా నివ

సించే మస్‌జిద్ పేరు) పోయినది. ఆమెను చూడగానే బాబా 'నేనురాను; నేను కోరి తినబోయినప్పుడు నీవు తరిమివేసినావు; ఇక యిప్పుడు నా కవసరంలేదు' అన్నారు.

సంకేతార్థములు

చిన్నచిన్న విషయాలలోగూడ ఆయన లక్షణ పద్ధతితోనే మాట్లాడేవారు; ఒక స్త్రీ తన పదునెనిమిదవ యేట బాబాను సందర్శించినప్పటి సంగతి చెప్పుచున్నది: ఒక భక్తుడు అవనత మస్తకుడై బాబాకు నమస్కరించునప్పుడు, అతని సులోచనములు క్రిందపడిపోయినవి. బాబా పాదతలమున పడినవి కాబట్టి వాటిని ఆయన ఆయనకే యిచ్చివేయవలెనని సూచింపబడినది. 'నాకు యీ కంటి అద్దాలు అవసరంలేదు. నలభై రూపాయల విలువ గలిగిన జోడు నాకున్నది' అన్నారు సాయిబాబా. కాని ఆయన సులోచనములు వాడని సంగతి అందరికి తెలిసిన విషయమే. వినుచుండిన ఆమెకు యిది అగమ్యగోచరముగా నుండినది. కాని, ముముక్షుభిరతిని, కొంత సాధన సంపత్తిని పొందిన ఆమె తండ్రి, సులోచనములనగా దివ్యదృష్టి లేక - సాక్షాత్కారమనియు, నలువది రూప్యములన్నది నలువదేండ్లనాడే ఆయన ఆ సిద్ధిని బొంది నారనియు గూఢార్థమును వివరించి చెప్పినాడు.

ముఖ్యముగా రోగనివారణలందు ఆయన సంకేతార్థముల తోనే భాషించేవారు. భక్తుడు - దేశపాండేని ఒకనాడు పాము కరచినది; భయవిహ్వలుడై నేరుగా బాబా మందిరమునకు పరు

గెత్తినాడు. కాని, అతడు గడపలో అడుగుబెట్ట బోవునప్పుడు బాబా: 'బ్రాహ్మణుడా, పైకి ఎక్కరాకు. దిగి మరలిపో' అని పెద్దగా అరచినారు. మృత్యు దంష్ట్రిలలో చిక్కియుండిన ఆ కాతర క్షణములోగూడ, అతడు గురుదేవుని ఆజ్ఞల ఉల్లంఘించ లేక పోయినాడు; ఉన్నచోటనే స్థాణువువలె నీరవప్రార్థనాలగ్న మానసుడై నిలబడిపోయినాడు. కొన్ని క్షణముల తర్వాత బాబా, ప్రసన్నతా మృదుల సాంత్వన వచనములలో 'ఇక రా, ఫకీరు నీపట్ల ప్రసన్నుడై కరుణించినాడు. ఇక నీకు నయమగును' అన్నారు. ఆవల దేశపాండె, మొదట రావద్దని గద్దించినది తన్ను కాదనియు, తన నాడులందు ప్రాకుచుండిన విషమునే బాబా సంబోధించినారనియు ఊహించుకొనినాడు.

కథామయోక్తులు

బాబా, ఒకొక్కప్పుడు దృష్టాంత పూర్వక కథలతో చెప్పి, భావార్థములను భక్తులనే ఊహించుకోమనేవారు. 'కొందరు దొంగలుబడి నా ధనమునంతయు అపహరించుకొని పోయినారు.; నేనేమీ పలుకకుండా, నెమ్మతిగా వారిని వెంబడించి, వారినందరిని చంపివేసి, నా ధనమును మరల సంపాదించుకొనినాను.' అన్నారు బాబ. ఈ ధనమనునది పురుషుడు స్వచ్ఛసహజ సత్య స్థితిలో ఉన్నప్పుడు అంతర్గతమైయుండు శుద్ధ మనశ్శక్తులే! ఇవే ఆదిమ మానవునియందును పతనమునకు ముందు ఆదాము (బైబిలులోని ఆదిమ పురుషుడు) నందును వెలసియుండినవి.

చోరులే కామక్రోధలోభాదులు. వాటిని చంపుటయనగా యీ వాంఛా జాలమును పరిహరించి ఆత్మ సాక్షాత్కారమును పొందు నిర్లిప్తావస్థయే!

ఇంకొక మారు శ్రీబాబా యీ లక్షణార్థయుక్త కథను జెప్పిరి:—

'ఒకనికి ఒక ఉత్తమాశ్వ్రయుండినది. ఎంత మంచిదైతే మాత్రమేమి? అతడు ఎంత ప్రయత్నించినను అది కళ్లెమునకు లొంగి జీను తాకనీయలేదు. అశ్వహృదయము దెలిసిన ఒక అనుభవజ్ఞుడు ఆ గుర్రమును మొదట అది పట్టువడినచోటుకే తోలుకొని పొమ్మన్నాడు. అట్లు చేయగా ఆ తురగము మచ్చికపడి చెప్పినట్లు నడచుకొని ప్రయోజనకారి అయినది.' ఇక దీని గూఢార్థ వివరణము - గుర్రమే అహము. పురుషుని శారీరక మానసిక శక్తుల వ్యాపారముల నిర్దేశించి నడుపునంతవరకు అహము ప్రయోజనకారి. కాని అది స్వబుద్ధి ప్రేరకమగుటచే నిరంతరాయ క్లేశములనే కలిగించుచుండును. దాని జన్మస్థానమునకు గొనిపోవుట అనగా, - అది ఎందుండి ఉత్పన్నమొందినదో ఆ చైతన్యములో, లేక ఆత్మలో దానిని పునర్లీనము గావించుటే. దీనినే ఏసుక్రీస్తు - జీవి మాతృ గర్భమును మరలచేరి, పునర్జన్మ నెత్తవలయును - అన్నది. మార్గోపదేశము చేయమని కోరిన ఒక ముముక్షువుకు భగవాన్ రమణమహర్షి సూత్రప్రాయోపదేశముగ - నీవు వచ్చిన దారినే మరలిపొమ్ము - అన్నది గూడ యిదే భావమును కలిగి

యున్నది. పవిత్రీకరించి జ్ఞాన జ్యోతిని ప్రసాదించే మూలమునకు చేరుటనుకే యీ ప్రవచనార్థము. అచటినుండి అహము మరల బయటికి ప్రసారితమగుచున్నది. ఈ స్థితిలో దానికి అహంభావములేదు; లోకసంగ్రహార్థము పూర్ణ చైతన్య ప్రేరిత బుద్ధిపూర్వక కార్యనిర్వాహకుడు మాత్రమే అగుచున్నాడు.

ఆయన ఒక భక్తురాలితో అన్నారు: 'ఆకాశము మేఘావృతముగానున్నది, త్వరలో వర్షించును. అప్పుడు పైరులు బాగా ఎదిగి పుష్కలంగా ఫలించును. ఆవల మబ్బులు వీడిపోవును. ఈ మాత్రానికే ఏల భయపడెదవు?' అని.

మేఘాచ్ఛన్నాకాశమనగా - అప్పటి ఆమె అజ్ఞానాంధకారము - విషాదఛాయలు. వర్షమనగా - ఆమె అనుభవించవలసిన అసౌఖ్యములు యాతనలు, ఇక ఆమె హృదయాంతరాళమున ఆధ్యాత్మిక వాసనాబీజముల మోసులెత్తించునది దైవకృపామృత వృష్టియే. కాని ఆమె ఆత్మ ప్రవేశించియుండిన ఆ కాళరాత్రము నందు యీ విషయజ్ఞాన మామెకు బోధపడినదికాదు. జ్ఞాన బీజము అంకురించి, ననలు సాచిన వెంటనే కలుగు నిరవధికానందము, వెలుగొందిన జ్ఞాన జ్యోతియే మబ్బుకప్పు వీడుట.

సాయిబాబా తరచుగా గూఢార్థగర్భమైన ప్రత్యుత్తరములొసంగెడివారు. తెలియనివారికి అవి అర్థహీనములు. ఒకరు ఆయన ఫోటో తీసుకోదలచుకొనగా, బాబా: 'వద్దు. అతడు ఫోటో తీసుకోరాదు. అతడు పూరకే ఆ గోడను పడగొట్టు మాత్రమే

చాలును' - అన్నారు. అర్థహీనవాక్యజాలములేనా? ఫోటో అనగా బాబా ప్రతిరూపమేగదా! పురుషుడు - పరమాత్మ ఐక్యములమధ్య అడ్డునిలిచియున్న 'నేనే యీ దేహము' అన్న అజ్ఞానభావమే యీ కుడ్యము. ఈ భిత్తికను బ్రద్దలుచేసిన చాలును వెంటనే సాయిబాబా యథార్థ ప్రతి రూపము ప్రత్యక్షమగును. కాని, ఆ చిత్రము శారీరకముకాదు - జీవాత్మకు సంబంధించినది!

**అన్యులచే చెప్పించుట**

సాయిబాబా అలవాటులలో ఇంకొక విశేషమైనది గలదు. అడిగిన ప్రశ్నకు నేరుగా తానే ప్రత్యుత్తమొసగక, ఇతరులను ఎవరినో చూపును; లేదా పరోక్షముగా విశదీకరించును. దీనికి తార్కాణముగా మాధవబావ్ యీ అంశమును చెప్పుచున్నాడు: ఒకపరి సాయిబాబా సమక్షములో ఆయన కూర్చుండియుండి, మనసులో, బాబా తనకు వర్గ వర్ణ భేదాతీతుని గుణనిర్ణయమును, అనగా మానవుని సహజవిభాగములను గూర్చి వివరించిన బాగుండునని అనుకొనినాడు. ఉన్నట్లుండి బాబా అతనితట్టు తిరిగిచూచి వెంటనే వెళ్ళి దీక్షితులతోగలసి పురాణమును చదువుమని ఆజ్ఞాపించినారు. అట్లే ఆయన బయలుదేరి దీక్షితుల ఇల్లు చేరినాడు. అదేసమయానికి ఆయన ఆతని సంశయాలను నివారించే ఘట్టమునే చదువుచుండినాడు! ఆశ్చర్యచకితుడై సంశయనివారణమును పొంది తృప్తిపడినాడు. ఇట్టి కథలనే చాలామంది యితర భక్తులుగూడ చెప్పియున్నారు. వారు బాబా ఆజ్ఞానుసారముగా ఎవరిదగ్గరకో

వెడలగా, అంతకాలముగా తమ్ము వేధించుచుండిన క్లిష్టప్రశ్నల ప్రత్యుత్తరములనే వారు చదువుచుండుటో, లేక ఉపన్యసించు చుండుటో సంభవించేది.

ఇతర విధములగూడ బాబా ఉపదేశములు చాలా గూఢ ములుగా నుండెడివి. ఆచార్య నార్కె అంటారు: 'ఒక వ్యక్తి యితరుల మధ్యనున్నప్పుడుగూడ, అతనికి చెప్పదలచుకొనిన విషయమును అచటనున్న యితరుల కెవ్వరికిని తెలియకుండానే అతనికే సూటిగా చెప్పగలిగిన అద్భుత విధానము బాబా ఒక లలితకళగా ప్రయోగించేవారు. ఇంతేగాదు ఒకే సమయమున చాలామందికి, ఏవో కొన్ని మాటలతోనే, చేష్టలతోనే అపూర్వ ఉపకారముల చేయుచుండినారు.'

అన్య భువన సంచారము

ఇవి ఏవి గాని ఒక్క బాబాకు మాత్రమే ప్రత్యేకములు గావు. ఒక ఆధ్యాత్మిక గురుదేవుని విశ్వవ్యాప్త రూప సమక్షము నందు యీ భౌతిక జగత్తుయొక్క పూర్ణాధారము తనంత తానే పెరిగిపోవుచున్నది. అప్పుడు అతర్కితోపనతముగా సంఘటనలు పొడకట్టి తదానుగుణ్యమైన చిహ్నములు గాన్పించును. అయినను, యిట్టి సంఘటనలన్నియు యితర సిద్ధులలోకంటె సాయిబాబా యందు అత్యంత కౌతుకాత్మకముగను, ప్రస్ఫుటాడంబరముతోను జరుపబడుచున్నవి.

ఆచార్య నార్కె చెప్పినాడు: 'శ్రద్ధగా ఆయన సన్నిధాన

ములోనే ఉండి గమనించిన వానికి బాబా విషయమై విభ్రమ జనకములైన కొన్ని సత్యములు ప్రత్యక్షమై గురుతరములగుచు, అత్యంత ప్రాముఖ్యమును పొందుచుండును. బాబా యీ భౌతిక ప్రత్యక్ష ప్రపంచమున జీవించుచునే అదృశ్య సూక్ష్మ శరీరముతో యితర భువనములలో సంచరించుచుండుట గూడ గలదు. అప్పుడు ఆయననోట వెలువడిన సూక్తులను ఆయన సంగతి తెలియని వ్యక్తులు కేవలము అర్థహీన దూషణ వాక్యములుగా భావింతురు. ఆయన సామాన్య భాషగూడ అత్యంత గూఢార్థ గర్భితము — లక్ష్యార్థ సంభరితము - నీతి కథా రూపము - రూపకాలంకార మయము - ఔపచారికము.

బహూ భాషావేది

గూఢార్థ భాషణముల విషయమై మనకు చాల ఉదంతములు తెలిసియున్నవి. ఇక, బాబా దివ్యశక్తులను విశ్వసించు వారిలో నాకే ఒక్కడే కాదు. బాబా మృతులనే గాక గర్భవాసమందున్న జీవాత్మలనుగూడ ఆదేశించి నడుపు శక్తి కలిగియుండినారని విశ్వసించే భక్తులు చాలామంది గలరు. బాబా, ఒక ప్రచ్ఛన్న ఆధ్యాత్మిక దేవగణమునకు జెందిన మహానుభావుడని, సూక్ష్మ అదృశ్య శరీరముతో దూరప్రదేశములకు పయనించి వచ్చుచుందురని సోదాహరణముగ చెప్పుచున్నారు. వీదిబడి అయ్యవారు ఒకరు, ద్వారకామాయి వెనుక ఆనుకొనియేయున్న ఒక మట్టిగోడల పూరింట వాసము చేయుచుండినాడు. రాత్రులందు,

సాయిబాబా ఎవరితోనో వివిధ భాషలలో సంభాషించుటను పలుమారు తాను వినినట్లు, బాబాకు తెలియని ఇంగ్లీషులోగూడ మాట్లాడు చుండునట్లు చెప్పుచున్నాడు.

శారీరకంగా బాబా షిర్డీని వదలిపెట్టి బయటకుపోయి ఎరుగరు కాని, భక్తులెవరైనా తమతో రమ్మనినప్పుడు, తమ గ్రామములకు రమ్మని కోరినప్పుడు - 'సరే! మీతో గూడానే వచ్చెదను కాని, ప్రయాణానికి బండ్లుగాని రైలుగాని నాకు అవసరంలేదు' అనేవారు.

ఆచార్య నార్కె వచనం మరల ఉద్ధరిస్తాం: 'అదృశ్య శరీరంతో దూరము - కాలముల నధిగమించి ప్రయాణములు చేసి వచ్చిన వైనములను బాబా పలుమారు వర్ణించేవారు. మస్‌జిద్‌లో ఉదయవేళలందు అగ్నికుండము ముందు కూర్చుండి, భక్త బృందముతో గతరాత్రి తాను ఏవియో దూర ప్రదేశాలకు పోయి వచ్చినది, అచట జరిగిన విశేషములను కడు రామణీయకముగా అభివర్ణించుచుందురు. ఆరాత్రి ఆయన ప్రక్కననే నిదురించుచుండిన వారికి బాబా భౌతికశరీరము అందుండి ఎచటికిని కదలిపోలేదని గూడ బాగా తెలియును; కాని ఆయన చెప్పిన ఉదంతములన్నియు పూర్ణ సత్యములు; పలుమారు శోధించబడి, సరిచూడబడి నిజములని నిర్ణయించబడినవి.

'అదృశ్య శరీరముతో ప్రపంచ వివిధ దూరప్రదేశముల వీక్షించుట, భూతల జీవితాంతర వాసములైన యితర ప్రపంచ

ముల సందర్శించుట, అచట జరుగు సంఘటనల పాలించుట, భూత భవిష్యత్తుల ప్రస్ఫుటముగ చూడ గలుగుట మొదలగు మహత్తర శక్తులను ప్రదర్శించుట బాబా యోగసిద్ధులలో సర్వ సాధారణమైనవి. ఆయన మాటలే కొన్ని యీ విషయము వెల్ల డించుచున్నవి. ఆయన యిట్లు చెప్పగా వినియున్నాను: 'నేనెక్కడ నున్నాను? ఈ ప్రపంచ మెక్కడనున్నది? (నిజ శరీరాన్ని చూపుచు) ఇది నా యిల్లు. నేను యిక్కడలేను. నా గురువు నన్ను తీసుకొని పోయినాడు' అనేవారు. ఈ భౌతిక ప్రపంచములో యీ కారణ కాయముతో ఉండిగూడ ఆయన ఈనశ్వర శరీరమునే అంటబెట్టు కొనియుండలేదు. ఆయన ఆత్మ సర్వవ్యాప్తమై - నిత్య స్థితిలో నుండినది. ఆయన ఉండిన చోట నేటికిని ఉన్నాడు - ఉండగలడు. సాయిబాబా ఎన్నడును అనృతమునుగాని అర్థరహితమైన మాట లనుగాని పలికి ఎరుగరు; ఆయన సాంగత్య సన్నిధానముల ననుభ వించగలిగిన పుణ్యాత్ములకు మాత్రమే ఆయన ఉద్దేశించిన మాటలు ఆయన చేతలు అర్థమయ్యేవి.'

భక్తులపై వాత్సల్యము

బాబా దూరదేశ గమనోదంతముల రెంటిని వివరింతును; ఇవి రెండును సరిచూడబడి యథార్థములని తేలినవే. ఒక భక్తు రాలు యీ విషయముల జెప్పినది; చెప్పునప్పుడు భావోద్రేక మును అణచుకోలేక కన్నీళ్ళుబెట్టినది. 'బాబా నాపట్లచూపిన దయారసము అత్యంత సాంద్రము. నాభర్త ఆయన దర్శనమున

కెన్నడుగాని పోకపోయినను, ఆయనను గూడ బాబా ప్రేమించి కృపజూపినారు. మాయింటి ఆయన ఇంజనీరు; 1909 లో పండరి ప్రాంతాలలో ఒక సేతు నిర్మాణంలో పనిచేయుచుండినారు; మా వారు ఉద్యోగములో, దూరమున నుండిన సమయములో నేను షిర్డిలో బాబాను సేవించి అర్చించుచుంటిని. ఒకనాడు బాబా, నేను పండరిపురము పోవుట మంచిదని, వెంటనే బయలుదేరమని నాతోగూడ ఆయనగూడ వత్తునని, అందువల్ల ప్రయాణంలో భయపడనవసరముండదని గూడ సెలవిచ్చినారు! అందువల్ల నేను వెంటనే బయలుదేరితిని: అక్కడ నాభర్తకు ఏమి సంభవించినదో-నాకు తెలియదు. ఆయన కార్యాలయము చేరగానే, ఆయన అక్కడ లేరన్నారు. ఆయన తన ఉద్యోగమునకు రాజీనామాయిచ్చి, బొంబాయి వెళ్ళినారట. ఇది నాకు అనుకోనని దుర్వార్త; దీనితో నాకు పూర్తిగా తికమక బుట్టినది. నాతోగూడ యిద్దరిని తీసికొనిపోయియుంటిని; కాని చేతనుండిన ధనము అతి స్వల్పము; అది మమ్ములను కురుద్వాడికి మాత్రమే చేర్చగలిగియుండినది; తెగించి కురుద్వాడి చేరినాము. నేనత్యంతవ్యాకులముతో ఆ పరిస్థితుల విషయమై యోచనానిమగ్న మానసనై యుంటిని. హఠాత్తుగా ఒక ఫకీరు నా ఎదుట ప్రత్యక్షమై ఏమికావలెనని అడిగినాడు. కాని, నేను ఆయనకు ప్రత్యుత్తరమివ్వలేదు. అయినను ఆయన నాభర్త దోండ్ స్టేషనులో నున్నాడని, మా ముగ్గురిని అచటకు పొమ్మన్నాడు. అయితే అక్కడికి రైలు చార్జీలు నే నెక్కడదెచ్చేది?

అని అడుగగా, ఆయన వెంటనే మూడు దోండ్ టిక్కెట్లు నా చేతబెట్టి వెడలిపోయినాడు. అవల మేము ముగ్గురము రైలెక్కి దోండుకు బయలుదేరినాము.

'ఈ లోపల దోండు స్టేషనులో నా భర్త, అర్ధ నిద్రలో అర్ధ స్వప్నములో ఆ స్టేషనులో తేనీరు త్రాగుచు పరధ్యానములో కూర్చుండియుండగా, ఒక ఫకీరువచ్చి ఆయన ఎదుట నిలిచి: 'ఇదేమిటి? నా తల్లిని యిట్లా ఉపేక్షిస్తున్నావే? తరువాత రానున్న ట్రెయినులో యీ సంఖ్య గలిగిన యిన్నో పెట్టెలో యిక్కడికే వస్తున్నది' అన్నాడు.

'ఆయన ఉలికిపడి లేలుచుచు:— 'నీవెవరు నన్నిట్లు దండించను?' అని దిగ్భ్రమతో అరచినాడు. కాని ఆ ఫకీరు ఆ సమయానికే తిరోహితమైపోయినాడు. నేను స్టేషను ఫ్లాట్ మీదకు దిగగానే నా కొరకు ప్రతీక్షించుచుండిన నా భర్తవచ్చి, తన నూతనోద్యోగ స్థానమునకు బయలుదేరమన్నారు. ఆయన ఫకీరు దర్శనమునుగూర్చి చెప్పి, సాయిబాబా చిత్రపటమును చూపుమన్నారు. పెట్టెనుండి దీసి, బాబా పటము ఆయనకు చూపగానే, నా భర్త యీయనే ఆ ఫకీరని ఆశ్చర్య సంభ్రమములతో పలికినారు'

ఇట్టిదే ఇంకొక ఉదంతము: ఇది ఎస్. బి. నాచ్నె చెప్పినది: '1909లో కొన్ని సంఘటనలు సంభవించినవిగాని, అప్పుడు వాటికిని సాయిబాబాకును ఎట్టి సంబంధముగాని ఉన్నట్లు కాన్పించలేదు.

మా అన్న బొంబాయిలో బాజెకర్ వైద్యాలయములో శస్త్ర చికిత్స పొందుచుండినాడు; దాని విషయమై మా కందరకు ఆతురత ఎక్కువగా నుండినది. ఆ సమయములో నేను దహానులో నివసించుచుంటిని. ఆనాడు ఒక సాధువచ్చి, నన్ను ఒక రొట్టె నిమ్మని అడిగినాడు. మేము ఆయనను ఆహ్వానించి, మృష్టాన్నముతో సగౌరవాతిథ్యమిచ్చితిమి. మా వదిన వడ్డనచేస్తూ, చేసిన పదార్థములలో బెండకాయ కూరదప్ప అన్నీ వడ్డించినది; వచ్చిన సాధుబోటి సిద్ధుల ఆతిథ్యమునకు ఆ కూర అనర్హమని ఆమె అభిప్రాయము. కాని ఆ ఆతిథియే ఆ కూర నడిగిపెట్టించుకొని తృప్తిగా ఆరగించినాడు. భోజనానంతరం, ఆయన మమ్మందరిని ఆశీర్వదించి, బొంబాయిలో శస్త్ర చికిత్స ఫలప్రదంగా జరిగి పోయినదని చెప్పినాడు.

'ఆ దినమే, నా స్నేహితుడు హెచ్. ఎం. పాన్సె, మా అన్న ఆపరేషను సాయిబాబా కృపాకటాక్షంవల్ల జయప్రదంగా జరిగిపోవునన్న ఆశాభావంతో పలికినాడు. నేను శ్రీ సాయిబాబా పేరు వినుటకు అదే మొదలు!

'ఆవల, ఆ సాయంత్రము మా తండ్రిగారు బొంబాయి నుండివచ్చి, ఆపరేషన్ సునాయాసంగా సక్రమంగా జరిగిపోయినదని, చిక్కులేమీ ఏర్పడలేదని చెప్పినాడు. ఆపరేషన్ అయిన వెంటనే ఒక సాధు వచ్చి శస్త్రము చేయబడిన మా అన్న శరీర

భాగమును తాకి, ఆవల ఆయన శరీరమునంతా నిమిరి, అంతా సురక్షితంగా జరిగిపోవునని చెప్పినాడు.

'మా అన్న జబ్బు తిరుగబెట్టకుండా నెమ్మతించినది.

'1912 లో నేను ప్రప్రథమముగ షిర్డికి వెళ్ళితిని. అక్కడ నేనుండిన దినాలలో బాబా నా యందును మా కుటుంబము పట్లను విశేషశ్రద్ధావాత్సల్యముల జూపినారు. దీక్షితులు, జోగ్, దభోల్కర్ అను ముగ్గురి సమక్షములో బాబా నన్ను చూపుచు: 'ఈ పెద్దమనిషి యింటికి అన్నమునకుపోతే బెండకాయకూర నాకు పెట్టడుగదా' అన్నారు.

'వెంటనే నా స్మృతి, మా అన్న శస్త్రచికిత్సాసమయములో దహనులో మాయింట ఆతిథ్యము స్వీకరించిన ఆ సన్న్యాసి మీదకు ఎగిరి వ్రాలినది. 1909 నుండి బాబా మాపట్ల అనుగ్రహించి, మమ్ము రక్షించుచునేయున్నారని, కాని అది మాకు తెలియకుండానే వుండిపోయినదని తెలుసుకొన్నాను. ఆశ్రమ భక్తులందరికి ఆ బెండకాయకూర సంగతి సవిస్తరముగా జెప్పితిని. ఆ సాధుకు సాయిబాబాకు ఆకారములో చాలా భేదముండినది. శస్త్రచికిత్స అయినతర్వాత రెండు మూడు దినాలు ఆయనను నేను చూచుచునేయుండినందున ఆయనను బాగుగ గమనించగలిగితిని. ఆ తర్వాత ఆయన ఎక్కడికో వెడలిపోయినాడు. మాకు కాన్పించనేలేదు.'

వాంఛిత రూపదర్శనము

ఇట్టి సంఘటనలను మనమెట్లు అర్థముచేసుకొనుట? సాయిబాబా నిజంగా విచిత్ర అపరిచిత ఫకీరు - సాధుపుంగవుల రూపములలో సాక్షాత్కరించేవారా? లేక దూరమున నుండియే పరోక్షముగ తన సంకల్పముల నెరవేర్చుమని ఆదేశించేవారా? ఇందు గమనించదగిన ఒక విశేషము - తన్ను ఎగిరిన వారికి అపరిచిత అన్యరూపములలో దర్శనమిచ్చి, క్రొత్తవారికి నిజరూపములోనే కాన్పించేవారు; బహుశః అపరిచితులకు వేషధారణమున కాన్పించవలసిన శ్రమ అనవసరమని భావించేవారు కాబోలు! ఇంతేగాక పరిచిత భక్తులకు గూడ నిజయథార్థరూపములో కాన్పించిన సన్నివేశములు గూడ చాలగలవు.

వింత క్రొత్త రూపములదాల్చిన ఆయన, ఆహారము తిననీయకుండా తరిమివేయబడిన కుక్కరూపమునుగూడ దాల్చినారా? దీనిని రూపించవలసిన అవసరమేలేదు.; ఎందులకనిన దివ్యదృష్టితో దూరమున ఆ కుక్కకు జరిగినపాటు కనుకొని 'ఆ కుక్కను తరిమినట్లే నన్నుగూడ చేసియుందువు' అని తన సహజరామణీయక ఫణితిలో జెప్పియుందురు.

జంతువుకు సంబంధించిన ఇంకొక కథ:— ఒక బ్రాహ్మణ భక్తుడు అజీర్ణముతో బాధపడుచుండినాడు. బాబా అతనిని పులిసిన పెరుగు తినవలదన్నారు. కాని ఆ బ్రాహ్మణునికి అదంటే ప్రాణము; ఆయన పెరుగును వదలలేదు, ఆయనను అజీర్ణము

వదలలేదు. ఒకనాడు ఏదో ఒక పిల్లివచ్చి పెరుగు త్రాగిపోయి నది; మరుసటి దినముగూడ ఆ బిడాలమువచ్చి దధిపాత్రలో మూతిబెట్టగానే చూచి తరిమివేసినాడు గాని, మార్జాల స్పర్శచే అపరిశుద్ధమై పోయిన పెరుగును పారవేసినాడు. దీనితర్వాత ఉట్టిలో బెట్టి పెరుగును భద్రపరచుకొనినాడు; అయితేనేమి? ఆ పిల్లి మెల కువగా అట్టవమీాదనుంచి ఉట్టెనందుకొని పుల్ల పెరుగును ఆరగించి నది. మరుసటి సాయంత్రము ఆ బ్రాహ్మణుడు కర్రబట్టుకొని పెరుగు దొంగకొరకు కనిపెట్టుకొనియే యుండినాడు. అలవాటు ప్రకారం వచ్చినది ఆ పిల్లి! పాఱుడు కర్రవిసరి వేసినాడు; మోదు దాని వీపుమీాద బాగా తగిలినది; అది పరుగెత్తి పోయినది.

మరుసటి ఉదయం ఆ బ్రాహ్మణుడు బాబా మందిరము నకు పోయినాడు. అప్పుడు బాబా భక్తులమధ్య కూర్చుండి, తన వీపుకు లేపనము పూయించుకొంటూ, యిట్లు గొణుగుకొనుచుండి నారు: 'పెరుగుదిని జబ్బుతెచ్చి పెట్టుకొంటారు; తినవద్దంటే వినరు; వాటిని తీసి పారవేసినావా? ఇక దుడ్డుకర్రలతో మోదుతారు.'

నిజబాధతో నివారణ

సాయిబాబాయే ఆ పిల్లిని పంపి, దాని భారము తానే వహించి, దాని గాయమును మాన్పియుండవచ్చును. ఇట్టివి తరచు జరుగుచుండేవి. ఇవి యితర సిద్ధులకు గూడ గలవు గాని, బాబా విషయములో యోగవిభూతులు అద్భుత అసాధారణ రూపమున ప్రదర్శింపబడేవి. ఒకప్పుడు ఉన్నట్లుండి, బాబా కడుపునొప్పి అని,

గుడ్డను గట్టిగా నడుముచుట్టూ కట్టిబిగించమని భక్తులను ఆజ్ఞాపించినారు. బాబా బాధతో మూల్గుచు - భరించలేను యింకను గట్టిగా బిగించమనిరి. కాసేపటికి సుఖముగా విశ్రమించి, 'ఇక యిప్పుడు బాధ నివారణమైపోయినది', అన్నారు. ఇదే సమయానికి దూరప్రదేశమున ఒక భక్తురాలు దుర్భర ప్రసవవేదనను అనుభవించుచుండి, రక్షించమని బాబాను ప్రార్థించియుండినది.

అణిమాది విద్యలు

నిష్కర్ష అయిన ఒక విషయమేనగా - బాబాకు దూర ప్రదేశములందలి సంఘటనలు, పరిస్థితులు ప్రత్యక్షముగ అవగతమగుచుండెడివి. దూరమందున్న వ్యక్తులను ఆదేశించినా, లేక, దూరస్థ ప్రాణి శరీరములందు ఆయనే ప్రవేశించి నడపినా, యిచట ద్వారకామాయియందు బాబా యోగ సమాధి అవస్థను చెందకనే ఆ కార్యముల చేయగలిగియుండినారు. ఇది ప్రత్యక్ష సత్యము. తన దైనిక బాహ్యజీవితచర్యలకు ప్రతిబంధకము కాకుండానే ఆయన దూరయాన - దూరశ్రవణ - పరకాయప్రవేశాది అణిమాది విద్యలను భక్తుల శ్రేయముకొరకు ప్రదర్శించేవారు. ఈ భౌతిక కాయము తానే నన్న మాయావరణము, లేక, అధ్యాస ఆయనకు ఎన్నడుగాని లేనందున యిదే శరీరమునకు అంటబెట్టుకొనియుండవలసిన అవసరము ఆయనకు లేకపోయినది; ఇంతేగాక అన్యశరీరధారణముగాని అన్యశరీరప్రవేశముగాని ఆయనకు దుష్కరములు కాకపోయినవి. ఇది వేదాంతపండితులు భాష్యకారులు

తర్క-వాదులు విమర్శించుకోవలసిన అంశముగాని, ఆయన భక్తులకు మాత్రము ఆయన మహిమను సంశయించవలసిన అవసరము లేనేలేదు. కాబట్టే ఆయన భక్తుల పూర్ణ విశ్వాసముతో ఆయన వర్షించిన వాత్సల్య ప్రసాదములపొంది, అనుభవించి సుఖించినారు.

* * *

# 5. ధన విషయక సంకేతములు

ఏ మహాత్ముడుగాని సాధారణముగా శిష్య విత్తాపహారకుడుగాడు!

ఆధ్యాత్మికశక్తితో వ్యాధి నివారణము గావించిన పెద్ద లెందరోగలరు. వారి గురువులు, యీ మంత్రశక్తికి ప్రత్యుప కృతిగా ధనమును గ్రహించినచో, యీ మహిమాతిశయ శక్తులు తమ్ము విడనాడిపోవునని భయపెట్టి ఆనబెట్టియున్నారు. చాల మంది సాధులు నాణెములను తాకుటకే నిరాకరింతురు. శ్రీరామ కృష్ణపరమహంసగారికి ధనమంటుటకే ఒక భీతి; అదీగాక ఆయన ఒక చిన్న నాణెమును తాకినంతనే ఆయన చేతులు బగబగమండేవి. సామాన్యమైన ఫలపుష్పాదులుదప్ప ధన వస్తు కనకాదులను గ్రహించే గురువులను శిష్యకోటి చాలవరకు సంశయించును. ఇంకను అనేక విషయములలోవలెనే యీ విషయములోగూడ సాయిబాబా ఒక ప్రత్యేకతను ప్రదర్శించేవారు. ఆయన ధనమును స్వీకరించుటేగాక, యివ్వమని ఆజ్ఞాపించేవారుకూడాను. ఒక్కొ క్కప్పుడు వచ్చినవారిని ఎత్తుకోనగానే దక్షిణ సమర్పించమని అధియోగించేవారు. పలుమారు యింత యివ్వమనిగూడ నిర్దే శించి పలికేవారు.

దీనివల్ల కొందరికి ఆయనపట్ల విరాగము కలిగినది. చాలా మందికి యిది అనుచితమనిపించినది. ఇక దీనిని విశదీకరించుట

ఎట్లు? ఆయన యీ ధనము స్వప్రయోజనమునకు కోరినారనునది లేదు; ఎందులకనగా - దండిన దానిని చిల్లిగవ్వతోగూడ పంచి పెట్టి వేసేవారు. ఫకీరులు మొదలగు అభ్యాగతులను, బీదలను పోషించేవారు. ఎట్లు గుంజునో అట్లనే ఉదారముగా దరిద్ర భక్త కోటి పోషణకు వ్యయము చేసేవారు. ఏ వస్తువును కొనినను, పిసినారివలె బేరమాడి తగ్గించికొని, చివరకు అమ్మవచ్చినవానికి బహుమతిగా బాగా యిచ్చి పంపేవారు.

గ్రహించుట దానము చేయుటకే

ఇట్లయ్యు, సొంతమునకుగా దినదినము అన్నమును బిచ్చమెత్తియే తినుచుండినారు. ఆయన దగ్గర విలువైన ఏ వస్తువులు గానిలేవు; ధనమార్జించి ఆశ్రమ భవనముల కట్టించలేదు; ఏ విధమైనఆ స్తినిగాని సంపాదించుకోలేదు; ఇట్లు ఆయన పరమపదమొందినప్పుడు ఉత్తరక్రియలకు అవసరమైన ఏ కొద్ది మాత్రమే నిలిచి యుండినది.

ఆయన, యితర విషయములవలెనే ధనమునుగూడ ఒక సాంకేతిక విషయముగనే భావించినారు. ఆయనకు ధనమిచ్చిన వారందరు తమ శ్రేష్ఠతరనిధులను పెంపొందించుకొనుచుండినారు. ఉన్నదానినంతా ఆయన ఎన్నడు అడుగలేదు. ఆయన ఒకప్పుడు: 'ఫకీరు చూపినవారినే నేనడుగుదును.; దానికి బదులుగా వారికి నేను పదింతలు యివ్వవలసియుందును' అనియుండిరి. అందరు

ఆయనవారే; అందుచేత భిక్షము గ్రహించి ఇచ్చిన వారి బాధ్యత ఆయనే భరించుచుండిరి:

కానుకలు యివ్వబోయినప్పుడు నిరాకరించిన సంఘటనలు కొన్ని ఉన్నవి. ఒక అవినీతి వర్తనుడు ఒకమారు బాబా దర్శనమునకువచ్చి, ఏన్నూరు రూపాయలు దక్షిణ సమర్పించబోగా: 'నీ ధనము నాకొక కాసైనవలదు; నీ యింట ఒక రంకుటాలిని పెట్టుకొని యున్నావుకదూ? నిజమేనా? ఇది ఆమెకు యిచ్చివేయుము' అని బొబ్బరించి తరిమికొట్టినారు.

ఇక కొన్ని సందర్భములలో అన్యాయార్జితవిత్తమని తెలిసి, వచ్చినవారిని బలవంతముగా ధనమడుగుట గూడ గలదు. ఒక అధివక్త - ఎస్. బి. ధూమల్, బాబా శిష్యకోటిలో ఒకరిదగ్గర ఒక అపీలు దాఖలు చేసినందులకుగా మున్నూరు రూపాయలు గుంజియుండినాడు. ఆ అపీలు అనుకూలమైనది గాని, యిందు న్యాయవాది ప్రయత్నములేకనే బాబా మాటతో పని పూర్తి అయినది. ధూమల్ షిర్డీకి పోయియుండునప్పుడు, గోజారిగోజారి ఆయన దగ్గర బాబా దక్షిణగా ఆ మూడువందలు లాగివేసినారు.

ధనమడుగుటలో సంకేతము

ఈ ధూమల్ ఇంకొక దక్షిణకథ చెప్పుచున్నాడు: 'ఒక నాడు, బాబా నాదగ్గరవుండిన ధనమంతా తీసుకొనిగూడ ఇంకొక యాభై రూపాయల నడిగినారు. 'నాదగ్గర లేదనగా, ఎక్కడకైనా పోయి ఎవరినైనా అడిగి తెమ్మనిరి. ఆవూరిలో ఒకనిని అడుగగా

అతడు యివ్వనన్నాడు. ఇది బాబాతో చెప్పినా. తర్వాత తన్ను రావుబహాదూర్ సాథె దగ్గరకు పొమ్మన్నారు; నా ప్రార్థనము విని సాథె సంతోషాతిశయముతో చకితుడై నాడు. ఆ సమయములో దీని అర్థముగాని గురుత్వముగాని నాకు బోధపడలేదు, కాని ఆవల తెలిసినవిషయమిది. ఆ సమయమున సాథె ఉద్యోగవిరామభృతి విషయమై కొంత మీమాంస జరుగుచుండినది. ఈ యాభై సంఖ్యయే ఆ వివాదపు మొత్తము. బాబా నాద్వారా ఆయనను యీ యాభై అడుగమనిననాడే యీ మొత్తము ప్రభుత్వముచే అంగీకరింపబడినది. సాథెకి యిది అర్థమైనందున బాబా కోర్కె నెరవేర్చుటకు అత్యంతప్రీతుడై ధన్యుడైనట్లు భావించినాడు.'

ఉన్నదంతా భక్తుని దగ్గరనుండి ఊడగొట్టి, యింకా అప్పుతీసుకొని రమ్మనుట బాబా చాలా తరచుగాజరిగే లీల. ఇది ఎప్పుడు చేయవలెనో ఆయనకు కచ్చితముగ తెలియును; ఇందు ఊహాలేదు. దీనికి తార్కాణము: ఒక ఆగంతుకుడు తన దగ్గర ఉండిన యిరవై రూపాయలలో పద్దెనిమిది ఒక మిత్రునిచేతికి యిచ్చిపెట్టి, బాబా తన్ను ధన మడిగిన రెంటికిపైన లేవని నిజము చెప్పినట్లే తప్పించుకొనుటకు పన్నాగము పన్నుకొనివచ్చినాడు. అతడు రాగానే సాయిబాబా రెండు రూపాయలు అడగి, వెంటనే ఇక పదునెనిమిది కోరినాడు. అతని ప్రత్యుత్తరమును ముందే ఊహించి బాబా, అతని వెంటవచ్చిన మిత్రునిచూపి, అతనిని అడుగ మనినారు.'

దేవుడు కోరినదే ఇది!

వచ్చిన ప్రథమ లాభ ఫలితమును అడుగుట బాబాకు సామాన్య విధానము. ఇది ఒక వ్యక్తి నూతన ఆయ వినియోగ మునకు సంకేతార్థము; ఈవిధానము భారతదేశమునందేగాక ఇతర దేశములందును యితర మతములందును గలదు. ఒకప్పుడు యిద్దరు బ్రాహ్మణ నూతన ఆగంతుకులలో ఒకనిని పదిహేను రూపాయలు అడుగమన్ని, దేశపాండేతో బాబా చెప్పినారు. ఇంకొక వ్యక్తి అడుగకనే ముప్పదియైదు రూప్యముల నర్పింప బోగా బాబా నిరాకరించిరి. దేశపాండె దీనికి కారణ మడుగగా బాబా యిట్లనిరి: 'నేనేమీ చేయను నేనేమీ గ్రహించను. దేవుడే తనది తానే కోరును. ఈపదిహేను ఆయనకు ముట్టవలసియుండినది కాబట్టి వసూలు చేయబడినది, కాని ఆ 35 మాత్రం మనది కాదు కాబట్టి తిరిగి యిచ్చివేయబడినది?' ఈ 15 రూపాయల స్వీకారమునందలి అంతరార్థమిది: ఈ మొత్తమిచ్చిన ఆగంతుకుడు ప్రస్తుతం నెలకు 700 రూపాయల సంబళములో నున్న ఉద్యోగి. ఆయన యీ 15 తోనే తన ఉద్యోగమును ప్రారంభించినాడు. ఆదిలో వచ్చిన మొదటి నెల జీతమునంతా ఒక దేవాలయమునకు సమర్పింతునని మ్రొక్కుకొనియుండినాడు. కాని, ఆ మ్రొక్కు బడిని యీ నాటికిని చెల్లించినవాడుగాడు. కాబట్టే యిప్పుడు ఆయన దానిని అడిగించుకొని చెల్లించినాడు.

బాబా ధనము కోరిన సందర్భములలో సాధారణముగా యిట్టి తీర్చని మ్రొక్కులు, మాట ప్రకారం చెల్లించని ప్రథమ మాసవేతనలుగానే ఉంటుండినవి. ఈ ఉదంతమును పరికింపుడు - షిర్డీకి వచ్చుచుండిన ఒక భక్తునికి, మార్గమధ్యమున యింకొక భక్తుడు కాన్పించి, ఒక టెంకాయ - చక్కెర కొనమని రెండ అణాలు యిచ్చి యీ రెంటిని బాబాకు తన పేర నైవేద్య మర్పించమని కోరినాడు. అతడు షిర్డీకి వచ్చి బాబాకు ప్రణతులిడి మరలిపోవు నప్పుడు, స్నేహితుడంపిన నారికేళమునిచ్చి చక్కెరసంగతినే మరచి పోయినాడు: బాబా అతనిని వెనుకకు పిలిచి: 'సరే! నీవు పోదువు గాని, పాపం! ఆ బీద బ్రాహ్మణుని బేడను ఏల బిగబట్టుకొనియుం దువు?' అన్నారు. ఆ భక్తునికి తత్క్షణమే యీ రెండు అణాల సంగతి జ్ఞప్తికివచ్చి, క్షమాపణలతో దానిని బాబాకు యిచ్చినాడు. అప్పుడు బాబా నవ్వుచు: 'ఇక యిప్పుడు నీవు ధారాళముగ పో వచ్చును. అయితే, ఇకమీదట మాత్రం ఒకపనిచేయను అంగీక రించినచో దానిని సమగ్రముగా నెరవేర్పుము; లేదా వీలుకానిచో ఆదిలోనే ఆభారమును వహించబోకుము' అని సౌమ్య ఫణితిలో జ్ఞానోపదేశము జేసినారు.

**భక్తుని పరీక్ష**

పక్షాంతరమున, యీ ధనానుయోగము ఆ వ్యక్తి గుణ మును పరీక్షించుటకుగూడ అయివుండేది. ఒకప్పుడు బాబా వచ్చిన ఒక సాధును ఐదు రూపాయలు అడగినారు; అతడు కోపముతో

మండిపడి: 'బాబా, యీ దక్షిణను యితరులను అడుగరాదా? నన్నెందుకు అడుగుచున్నావు? నా దగ్గర డబ్బులేదని నీకు తెలుసునుగదా' అని ఆక్రోశించినాడు. బాబా మహాప్రశాంతముగా చిరునవ్వుతో - 'సరేనయ్యా, లేకుంటే యివ్వకు. అంతేగాని నీ కోపమును ఊరకే రేగగొట్టుకొనకుము' అన్నారు.

ఒక తృష్ణా పరుడైన శ్రీమంతుడు ఒకప్పుడు బాబా దగ్గరకువచ్చి దైవ దర్శనమును కలిగించమని బలవంతము చేసినాడు. 'దీనికిగా యింతదూరము తీవ్ర ప్రయాసలకోర్చి వచ్చితిని; షిర్డీ యోగి యిట్టి దైవసాక్షాత్కారములను అతిసులభముగా ప్రసాదింతురని దేశమంతటా వదంతి' అని తన అపూర్వవాంఛకు హేతువుల స్థాపించను ప్రయత్నించినాడు.

భక్తుల ఆధ్యాత్మికోన్నతి

హిందువులకు మహిమోన్నతమైన ఆధ్యాత్మికానుభవమనగా, యిష్టదైవమును - ఆరాధకుని ప్రియవాంఛాను గుణ్యముగ - రాముడుగనో, కృష్ణుడుగనో, దేవిగనో, ఏ యితర అవతార మూర్తిగనో వీక్షించుటే యగుచున్నది. గీతలో కృష్ణభగవానుడు పార్థునికి భయదభూరి విశ్వరూప సందర్శన భాగ్యమొసంగి కూడ, ఆవల ఆ రూపము పరమచరమ సత్యము కాదనియు, నిజముగా తాను నామరూపాతీతుడననియు ఎచ్చరించినాడు. అట్టి రూపదర్శనము ఆరాధకునికి అత్యంత ప్రోత్సాహకారి యగుటచే సద్గురువు పలుమారు భక్తులకు ప్రసాదించుచుందురు. ఒక విధముగా

ఈ దర్శనము ప్రతిబంధముగూడ కావచ్చును; ఏలనన - సమస్త దృశ్యమాన రూపములు చివరకు మాయాజనితములే యగుచున్నవి; ఇవి సాధకుని నిరాకార సత్యాన్వేషణ పథమునుండి మరలింపవచ్చును. కాబట్టియే, శుద్ధ ఆధ్యాత్మిక మార్గమును ప్రత్యక్షముగ చూపు గురువు ఇట్టి రూపదర్శన వాంఛల గర్హింతురు గాని హర్షింపరు. ఇదే సాయిబాబా పద్ధతి; భక్తులనేకులు ఇట్టి దివ్యావలోకనముల కాంక్షించి నిరాశోపహతులైనారు. ఆయన ఒకొక్కప్పుడు ఆడంబరమును అనియతవర్తనము ప్రదర్శించు చుండినను, ఆయన తన భక్తుల వర్తనములో విస్మయ సంరంభోదంతములు మాత్రము పనికిరావని సదా నిషేధించేవారు. ఆయన అభిమతము ఆధ్యాత్మికోన్నతియేగాని క్షణిక దర్శనములు క్షుద్ర మహిమలు గావు.

క్షుద్రవిద్యల గర్హణము

ఒక నూతన భక్తుడు, తన పూర్వ గురు సన్నిధానమున అలవరచుకొనిన కొన్ని యక్షిణీ శక్తులకు మురిసిపోవుచుండగా, ఆత్మ వికాస ప్రతిబంధకములైన ఆ క్షుద్ర విద్యలను పరిత్యజించమని పట్టుబట్టినారు సాయిబాబ. ఆయన తన శిష్యులకు యిట్టి శక్తుల నెన్నడుగాని ప్రసాదించి యెరుగరు. ఇట్టి క్షుద్ర విద్యల ఉపయోగించుటకు విశేష విజ్ఞానము, అహంభావ బంధమునుండి సంపూర్ణ స్వేచ్ఛ సాధకునికి అత్యంత అవసరములని సాయిబాబా ఆదేశము. కాబట్టియే సామాన్య సాధకునికి యివి నిషిద్ధములు.

ప్రస్తుత విషయమునకు వచ్చెదము. ఆ వచ్చిన వ్యక్తి షిర్డీకి జట్కా-బండిలోవచ్చి, మరల ఆ బండిలోనే, ఎక్కువసేపు కనిపెట్టుకొనియుండిన దానికిగా ఎక్కువ బాడుగ యివ్వను తప్పించుకొనుటకు, త్వరగా దైవదర్శనము చూపుమని తహతహపడుచుండినాడు. అతని దగ్గర రు 250/- ఉండినా, దానిని సురక్షితముగా యథారీతి కాపాడుకోదలచినాడు. సాయిబాబా అవహేళనోత్సాహముతో యీ కృపణునికి స్వాగత మిచ్చుచు - 'ఓం ఈ మాత్రపు భాగ్యమేనా? విచారపడకుము. నీకు దేవుని త్వరగా స్పష్టంగా చూపింతును; ఇటువంటి విషయములకు కాలయాపనము పనికేరాదు. నీవలె ప్రకాశమును అభిలషించేవారు చాలా అరుదు. ఇక్కడకు వచ్చేవారంతా ఐశ్వర్యాభివృద్ధినో ఆరోగ్యమునో యేదియో ఆర్తి నివారణమునో మంచి ఉద్యోగమునో ఐహిక సుఖభోగములనో అభిలషించి వచ్చుచుందురు. ఇంతవరకు ఎవరుగాని దేవుని చూపుమనికోరలేదు. దేవదర్శన కుతూహాలులైన వారిని వీక్షింపను నేనెంత ఔత్సుక్య పడుచుందునో తెలియునా? మరణములోపల బ్రహ్మమును ప్రత్యక్ష పరచుకొనలేక పోయినచో, ఆ జీవి ప్రత్యావృతమైన జనన మరణ వలయములో బడి బయటపడలేడు; గురువుమాత్రమే విమోచన మార్గమును చూపింపగలడు' అని చెప్పి,

బ్రహ్మజ్ఞానార్హత

హఠాత్తుగా భాషణమును ఆపి, ఒక పిల్లవానిని పిలిచి,

తనకు అత్యంత అవసరముగా ఐదు రూపాయలు కావలసియున్న దని, ఆవూరిలో ఒక అంగడివాని దగ్గరకుపోయి అడగి వెంటనే తీసుకొని రమ్మనినారు. పోయిన ఆ బాలుడు తిరిగివచ్చునంత వరకు బాబా యే ఇతర విషయమును తాకించుకొనుటకుగాని, వచ్చిన పెద్దమనిషితో మాట్లాడుటకుగాని ఉత్సహించలేదు - యిష్టపడనూలేదు. కాసేపటికి ఆ పిల్లవాడువచ్చి అంగడివాడు లేడని చెప్పినాడు. బాబా మరల వానిని ఇంకొకని దగ్గరకు పంపిరి; అక్కడా యీ కోర్కె నెరవేరలేదు. ఇట్లు మరికొందరి దగ్గరకు పంపినను ఫలప్రదముకాలేదు. ఈ మధ్య కాలములో దైవసాక్షా త్కారమునకై వచ్చిన వ్యక్తి అనుక్షణము ఎదిగే అశాంతితో అల్లలలాడుచుండినాడు. బండివాని బాధగే అతని మనసును వేధించుచుండినది. ఈ విలంబమునంతా, ఆ ఆగంతుకుడే, ఆయన కోరిన ఐదు రూపాయలిచ్చి తప్పించియుండవచ్చును కాని, ఆపిసి నారి ఆ పనిమాత్రం చేయదలచుకోలేదు.

బాబా పరాయత్త చిత్తుడై యుండిన మధ్యకాలములో, అతడు మరల 'బ్రహ్మను గ్రహించుటకు నాకు సహాయపడరా?' అని ప్రాధేయపడినాడు. అప్పుడు బాబా యిప్పుడు జరుగుచుండిన దాని సంకేతార్థమునిట్లు వివరించినాడు. 'నీకు తెలియలేదా? ఇంత సేపు ఆ పనినే చేయుచుంటినే! నేను ఐదు కావలెనన్నది నీకు అర్థము కాలేదా? బ్రహ్మ సాయుజ్యమును పొందగోరువారు ముందు ఐదింటిని పరిత్యజించవలెను. పంచేంద్రియ వ్యాపారమును

మొట్టమొదట విడనాడి, పంచప్రాణముల వదలవలెను. దీనికి అనాసక్తత, ఔదాసీన్యము, విషయ పరాఙ్ముఖతయు అవసరము. బ్రహ్మజ్ఞాన మార్గము దుర్గమము. అందరు ఆ మార్గముబట్టి నడువలేరు. వేగుతో గూడ వెలుగు పుట్టును. భూతలము స్వర్గము - యీ విషయములు రెంటిపట్ల సమాన విరాగము గలిగినవాడే బ్రహ్మజ్ఞానమున కర్హుడు.

ఇది, ఆగంతుకుని ఐహికతృష్ణానిగ్రహణమేగాక, అతని స్వర్గ వాంఛయైన ద్వైతదర్శనాసక్తిని గూడ అధిక్షేపించుట అయినది.

దేవుని మహిమ తెలుపుమనిన ప్రార్థన దోషభూయిష్టమని తెలుపుటకు బాబా ద్రవ్యసంకేతమును ఉపయోగించిన మరియొక నిదర్శనముగలదు: ఈమారు వచ్చిన భక్తునితోడి సంభాషణమును మధ్యనిలిపి, ఆ వూరిలో ఒక వృద్ధి వ్యాపారిదగ్గరకు నూరు రూపాయలు కావలెనని పంపినారు. ఆ వడ్డి బేరగాడు, అడిగిన డబ్బు బదులు భక్తిపూర్ణప్రణామములనుపంపినాడు. ఇంకా చాలామంది దగ్గరకు పంపినా నిష్ప్రయోజనమే అయినది. చివరకు తన శిష్యుడైన ఒక భాగ్యవంతుని దగ్గరకు పంపినారు. కాని నిజంగా యీ భక్తుని దగ్గర ఆ సమయానికి డబ్బు లేకపోయినది. అతడు, బాబాకు యింతకుముందు లేదనిన వ్యాపారి దగ్గర అప్పుతీసుకొని వెంటనే బాబాకు చేర్చినాడు.

దివ్యజ్ఞానము - ధనము

దైవసాక్షాత్కారమునకు వచ్చిన వ్యక్తికి దిగ్భ్రమ, అమ

క్షము కలిగి, శ్రీ బాబా నిత్య అంతేవాసి - ఒకని దగ్గరకుపోయి, బాబా తానడగిన కోర్కెను దీర్చక ధనతృష్ణతో మనసునింపుకొని పామరునివలె ప్రాకులాడుటనుగూర్చి ఆశ్చర్యమును ప్రదర్శించి, బాబాను కటువుగా విమర్శించినాడు. అప్పుడాభక్తుడు యిట్లు అతనికి ప్రత్యుత్తరము పలకినాడు: 'నీ కోర్కెదీర్చనే ఆయన ప్రయత్నించినారు; ఆయన ప్రదర్శించిన సంకేత వర్ణనమును నీవు అర్థము చేసుకొని యుండవలసినది. బీద బాబా అడిగప్పుడు దొరుకని డబ్బు శ్రీమంతుడు నానాసాహెబ్ అడుగగానే లభించినది; మొదట లేదనిన వ్యక్తియే ఆవల యిచ్చినాడు. ఇట్లే సర్వమానవులు దివ్య జ్ఞానమును కోరలేరు, కోరినా అట్టివారికి లభించదు; అట్లే దివ్య దృశ్యముల నభిలషించెడివారు మొట్టమొదట ఆధ్యాత్మిక సాధన సంపత్తిని సముపార్జించుకొని యుండవలెను'

చాలవరకు, భక్తులు చాలమంది యిట్టి సంకేత బోధనల అర్థము చేసుకోగలిగి, సహజ జ్ఞానముచే అంతరార్థముల తెలుసుకోగలిగియుండిరి గాని, సర్వత్రా బాబా ధనవాంఛలు అవగాహమునకు వచ్చేవిగావు. ఎవరికి తోచిన అర్థం వారు చెప్పేవారు. క్రింది సంఘటను పరికించండి:—

చూడవచ్చిన ఒకరిని బాబా దక్షిణ దక్షిణ అని అంటూ కడపటిరూకవరకు దోచివేసినారు. బొత్తుగా లేక పోయినప్పుడు దేశపాండె దగ్గరకుపోయి అప్పుతీసుకొని రమ్మనిరి. దానికి దేశపాండె - 'బాబా కోరునది నీ డబ్బుకాదు; నీ హృదయ మాన

సికార్పణములను; నీ ఆత్మీయశ్రద్ధను సదా తనయందే నిలుపుమని ఆదేశించినారు' అని నిర్వచించినాడు.

భిన్నార్థములు

ఈ వివరణమును బాబావిని, ఆమోద సూచకముగా చిరునవ్వునవ్వి, మరల నూతన శిష్యుని యీమారు దీక్షితుల దగ్గరకు పంపినారు. దీక్షితులు యీ యాచనకు యిట్లు అర్థము చెప్పినాడు:- ఈ యాచన ఆత్మోత్కర్షపై సలిపిన దాడియే. కాబట్టి నిర్ధనుడుగా చేయబడినను, భిక్షమెత్త వలసిన అవసర మేర్పడినను అవమానితుడనైతినన్న భావముతో ఖిన్నుడు కారాదు.

బాబా యీ వివరణమును ఒప్పుకొనిరి కాని, అతనిని మరల నానాసాహెబ్ చందోర్కర్ దగ్గరకు పంపినారు. వారందరిలో బాగా ప్రపంచానుభవము ఇంగిత జ్ఞానము కలిగినవాడు యీ నానాసాహెబే. ఆయన యిట్లు చెప్పినాడు: ఆయన ఒక నూరు రూపాయలుమాత్రం షిర్డీకి వచ్చునప్పుడు చేతబట్టుకొని వచ్చి, ఇంకొక నూరు రూపాయాలు, కోపర్‌గాం రైల్వేస్టేషనులో ఒక మిత్రునిచేతికిచ్చి వచ్చేడువాడు. ఒక వేళ తీసుకొనిపోయిన ధనమంతా అయిపోయినచో, అవస్థల పాల్గాకుండా వుండుటకు చేకావలిగా యీ మొత్తమును అట్టిపెట్టియుంచేవాడు. తన మీదనే తాను సదా ఆధారపడి యుండవలెననెడి సిద్ధాంతము సాయిబాబాకు నచ్చునందున, ఆ భక్తునికి గుణపాఠము నేర్పదలచినాడు. అందువల్ల మొదట ఆయన దగ్గరకు నలువది రూపాయలు

కావలెనని పంపినారు. కోపర్‌గాం నుండి ఆ మొత్తమును ఆయన తెప్పించే లోపలనే మరికొంత దక్షిణకావలెనని, అతని దగ్గర ఇక ధనములేదని దీనముగా చెప్పించునట్లు చేయగలిగి, యాచనలో హైన్యములేదని బోధించినాడు.

సంకేతార్థములు

కాని, యితర సందర్భములలో చాలావాటిలో యీ సంకేతము సులభ గ్రాహ్యముగ నుండును. ఒక భక్తుని బాబా పలుమారు రెండు రూపాయలు అడిగేవాడు. చివరకు అతడు ఎందుకు అని అడుగగా - 'నేను కోరునది యీ రెండు లోహనాణెములను కాదు, నీ సహనమును నీ విశ్వాసమునే దక్షిణ పెట్టమనుచున్నాను' అని విడదీసిచెప్పిరి.

ఇంకొకప్పుడు, ఒకనిని నాలుగు రూపాయలడిగి తీసుకొని, ఒకటే ఉన్నదనినారు. 'నేను నాలుగు యిచ్చినానే' అన్నాడు ఆ భక్తుడు. 'అది కాదనను. నీవు యిచ్చినది నాలుగైనా నాకు ముట్టినది ఒకటే' అన్నారు బాబా. ఆ భక్తుడు యిది అర్థము కాలేదన్నాడు. అప్పుడు బాబా 'మున్ముందు నీకు యిది తెలియగలదు' అనిమాత్రమన్నారు. ఆవల కొంత కాలానికి, ఆ వ్యక్తి ఒకనాడు రైలు ప్రయాణం చేయుచుండినాడు. మార్గమధ్యమున ఒక ఫకీరు ఆ పెట్టెలోనికివచ్చి, ఆ భక్తుని ధర్మమడిగినాడు. ఆతడు ఆ సాధుకు ఒక పైసా యిచ్చినాడు. కాని అతడు నాలుగు కావలెనన్నాడు.; ఆ ప్రయాణీకుడు నాలుగణాలరూక యిచ్చినాడు.

అప్పుడుగూడ ఆ ఫకీరు తనకిచ్చినది ఒక్కటే నన్నాడు. మరికొంత సేపటికి ఇంకొక హిందూ సన్న్యాసివచ్చి యిట్లే అతనిని భిక్షమడగి నాడు. మరల ఒకటి యిచ్చుట, ఆతడు నాలుగడుగుట జరిగినది. చివరకు దాని సంకేతార్థము అతనికి అప్పుడు అవగాహామునకువచ్చి నది. మనో బుద్ధి చిత్త అహంకారము లనెడి చతుర్విధ మానసిక వికారములను పరిత్యాగ మొనర్పమని బాబా కోరగా, ఆయనకు తాను అర్పించినది - ఒక్క జీవమును మాత్రమే!

ఇంకొకప్పుడు, బాబా ఒక యువతిని ఆరు రూపాయలడి గిరి. పాపము! ఆమె దగ్గరలేదు. ప్రక్కనుండిన భర్తతో - యిట్లు అడుగబడినప్పుడు చేత చిల్లిగవ్వగూడ లేకుండుట ఎంతటి వ్యథా పూర్ణమో ఊహించండి - అనినది. ఆయన 'బాధపడవద్దు. బాబా అర్థించినది ధనముకాదు; ఆయన తన పాదసన్నిధిని విడిచిపెట్టమని ఆదేశించినది అరిషడ్వర్గములను' అని శాంతింపజేసినాడు.

ఈ వివరణమునకు బాబా చిరునవ్వు వెలయించి ఆమెను మరల 'నా ఆరు రూపాయలు నాకు యివ్వవా?' అని అడిగినారు. దానికి ఆమె 'వాటిని ఎప్పుడో మీకు యిచ్చివేసినా' అన్నది. 'అట్లయిన యిక సన్మార్గమును తప్పకుండా వుండుటకు జాగ్రత్త వహింపుము' అని ఎచ్చరించినారు.

ఇట్టి సంకేతములు, ప్రథమ ఫలిత సమర్పణము, మరచి పోయిన మొక్కుల చెల్లించుట, - యీ త్రివిధ ఋణ పరిష్కార మునకే తరచుగా బాబా ధన రూపమున కోరుచుండినది. ఆయన

కోరునది ధనము కాదన్నది మాత్రము ప్రత్యక్షసత్యము. ధన మనిన బాబా కంటె అనాస్థ గలిగినవారు మరెవ్వరును లేరు. అయినను ఆయన చరమావస్థలో ధన ప్రవాహము, ఆయన ఆవాసము ద్వారకామాయిని ముంచివేసినది. ఒక రాష్ట్రగవర్నరు జీతమంతైన ఆ మొత్తముపై ప్రభుత్వము ఆయ సుంకము విధించను ప్రయత్నపడినది; కాని ఎంత వచ్చినా ఆ సాయంత్రమునకు బాబా దగ్గర ఒక్కపైసాగూడ మిగిలేదికాదు కాబట్టి శుల్కవిధికి వీలైనదిగాదు.

* * *

# 6. ఉపదేశము

ఒక ఆధ్యాత్మిక గురుదేవుని జీవిత విశేషము ఆయన ఒసంగు ధర్మోపదేశమే అయియున్నది. ఇది కేవలము ఔపపత్తిక లేక, సిద్ధాంత ప్రవచన బోధముకాదు. ఉపదేశము ఆధ్యాత్మిక నియమ సాధనము ప్రతినియమ పాలనముతో నైయుండి, శిష్యునిపై నిగూఢ ప్రాబల్యమును ప్రసరింపజేసి, అతని ఆత్మోన్నతికి దోహద మొసగవలెను. దీని మూలసిద్ధాంతము యిట్టిదని ఒక సిద్ధుని జీవిత చరిత్ర వ్రాయువానికి సుబోధము కాకపోవచ్చును. ఇంతే గాక యిది మనసిచ్చిన శిష్యుని కొరకే ప్రత్యేకించబడియుండుటచే అన్యులకు దాచిపెట్టబడుటగూడ సహజము. ఈ ఉపదేశము శిష్యునికి ప్రత్యక్షముగ స్వయముగ అంతశ్శుద్ధినిబట్టి గురు వొసంగుచుండును; లేనియెడల దీనిని దుర్వినియోగము గావించిన, పెడదిరిగి భక్తుని నెత్తిపై అది అరిష్టమును పులిమి పెట్టును. కాని, సాయి బాబా విషయమున యీ బెడద లేదు; ఎందుకనిన ఆయన ఏ తత్త్వ మునుగాని సిద్ధాంతమునుగాని ప్రత్యేకముగ గ్రంథస్థము చేసిపెట్ట లేదు. ఇంతేకాదు, వాచాగూడ ఆయన ఏ సిద్ధాంతమునుగాని ప్రవచించి స్థాపించలేదు.

అణిమాది సిద్ధులకు ప్రాతికూల్యము

జీవి అనుసరించవలసిన ఆధ్యాత్మిక పథములెన్ని యోగలవు;

ఇక బాబా దేనిని ఆదేశించినాడన్నదే ప్రశ్న. ఎత్తుకొనుచుండ గనే ఆయన యోగతంత్రములను చెప్పలేదని కచ్చితముగ వాటిని తీసివేయవచ్చును. ఇది కొంత ఆశ్చర్యకముగనే యుండవచ్చును; ఎందులకన - అతీతశక్తులను పెంపొందజేయునది యిట్టి అప్ర యత్నోపలబ్ధి అసాధారణ మార్గములేనని తెలిసిన విషయమే. బాబా యీ శక్తులను ధారాళముగను విరివిగను ఉపయోగించి నను, వాటిని ఆయన భక్తులకు ప్రసాదించకపోవుటేగాక, వాటిని వారు అలవరచుకొనుటనుగూడ ప్రోత్సహించలేదు. అణిమాది విద్యలను సముపార్జించుటకు ఆయన శిష్యకోటి ప్రయత్నించక పోవుటలోనే వారి యథార్థ ఆధ్యాత్మిక చింత, జ్ఞాన తృష్ణ ప్రద ర్శితములగుచున్నవి. ఎక్కడనైనను సాధకులు యిట్టి యక్షిణీ విద్యలకు ప్రాకులాడుచు, వీటిని సత్యాధ్యాత్మిక పురోగతితో సరిపెట్టజూచినచో ఆ శిష్యకోటి అట్టి గురువు విషయమై కడుంగడు జాగరూకత వహించియుండవలెను.

యోగసాధనలో ప్రధానమైన ప్రాణాయామమును గూడ సాయిబాబా కొన్ని సందర్భములలో గర్హించినారు. 'ప్రాణా యామ మార్గమున ఎంత ముందుకు నడచినను అతడు చివరకు, దానిపై పురోభివృద్ధికి నన్ను ఆశ్రయించకతప్పదు' అని బాబా మాట. ఇది, ఆ పరమ అద్వైతి భగవాన్ రమణమహర్షుల వారిని జ్ఞప్తికి దెచ్చుచున్నది. ఊహామయ బుద్ధిని స్వాధీనము చేసుకొన ప్రయత్నించువారికి ప్రాణాయామము ప్రథమ సోపాన

మని ఆయన బోధించిరి. ఆయనగూడ 'చివరకు అందరుగూడ అరుణాచలమునకే రావలెను' అనేవారు. ఆ అరుణగిర్యాశ్రమమే జ్ఞానమునకు అకుటిల అవిషమ మార్గము.

సన్న్యాసము మోక్షమునకు ప్రధానముకాదు

సాయిబాబా ఉపదేశములలో ఇంకొక విశేషము:- ఆయన అపక్వచిత్తులగు శిష్యులను మోక్షలబ్ధికి యీ ప్రపంచమును పరిత్యజించి సన్న్యాసులు కమ్మనలేదు; కొన్ని సందర్భములలో సన్న్యాసమును అధికారములేనివారికి నిషేధించి యున్నారు. ఇంతేగాక, ఆయన సాధారణముగా గృహస్థుల విషయములో చూపినశ్రద్ధ, సంసారుల జీవయాత్ర సమస్యల ఆయన పరిష్కరించిన తీరు, భక్తుల ఉద్యోగ వివాహ శిశువుల విషయమై ఆయన ప్రదర్శించిన ఆసక్తి, చూపిన మార్గములు, ప్రసాదించిన వరములు మొదలగువాటిని గుర్తించినచో, ఆయన తన భక్తులను గృహస్థాశ్రమము ద్వారానే అంతశ్శక్తిని పెంపొంద జేసుకొనవలెనని అభిలషించినట్లు స్పష్టముగ తెలుసుకొనవచ్చును.

గురుసంపూజనము

ఆయన ఉపదేశించిన భక్తి జ్ఞాన మార్గముల వివరము తెలిసుకొనుటకు మనకేమీ ఆధారములు మిగులలేదు. ఇంతేగాదు, అందరు గురువులకు పరిపాటి అయిన ఉపదేశ ప్రదానముగాని, దీక్షాప్రసాదముగాని, నామ జపోపదేశముగాని, ఆయన చేయనేలేదు. చాలామంది భక్తులు దీనిని గట్టిగా ధృవపరచు

చున్నారు. ఆచార్య నార్కే అంటారు: 'బాబా నాకెన్నడుగాని తంత్రమునుగాని మంత్రమునుగాని ఉపదేశమునుగాని ఒసంగి ఎరుగరు; నాకు తెలిసినంతవరకు యింకెవరికిగాని యిది ప్రసాదించినట్లులేదు.' దేశపాండె చెప్పినట్లు యీ ఉదంతమునుగూడ ఆయన ఇట్లు చెప్పుచున్నాడు:—

రత్నాబాయి దేశముఖ అను ఒకస్త్రీ ఆశ్రమములో చాలకాలము సాయిబాబాకు పరిచర్య చేయుచుండి తనకేదైనా ఉపదేశించమని ప్రాధేయపడినది. కాని బాబా ఏమీ చేయనందున ఆమె సత్యాగ్రహామునకు తార్కొని, ఉపదేశమిచ్చునంతవరకు ప్రాయోపవేశము చేయుదుననినది. అట్లే నాలుగు దినముల ఉపవాసానంతరము, దేశపాండె ఆమెపై అనునయముతో బాబా దగ్గరకుపోయి, ఆమె కొక జపనామ మంత్రోపదేశము నొసంగ ప్రార్థించినాడు. దీనితో సాయిబాబా ఆమెను పిలిచి మంత్రోపదేశముల నొసంగుట తన మార్గముకాదనియు, మహాశక్తివంతుడైన తన గురుదేవుని ఊరకే అనుసరింతుననియు, ఆయన మార్గములకు యితర గురువుల మార్గములకు చాల వ్యత్యాసమున్నదనియు వాక్యోపదేశములు వారి పద్ధతి కాదనియు చెప్పిరి.

మేనేజరుగారుగూడ యిట్టి కథనే మరియొక దానిని చెప్పినాడు: 'సాయిబాబా ఒసంగు ఆధ్యాత్మిక సాహాయ్యము సాధారణమైనదిగాదు. ఆయన ఎట్టి మంత్రమునుగాని ఉపదేశింపరు. ఆయన ఎన్నడును యోగము - ప్రాణాయామము - కుండలిని

మొదలగువాటినిగూర్చి మాట్లాడి ఎరుగరు. ఆ మార్గానువర్తు లెవరికైన వైపుదప్పి ప్రమాదము సంభవించినచో వారు బాబాను ఆశ్రయించి ఆయన కరుణాతిరేకముచే ఉద్ధరింపబడుచుండిరి.'

అయినప్పటికిని, ఉపదేశములకొరకు మరియితరత్రా ఆశ్రయించవలసిన అవసరమేలేదని ఆయన శిష్యులకు గట్టిగా చెప్పుచుండినారు. ఈ విషయమును గురించి ఆలోచించినవారే చాలా తక్కువ. అయినను బాబా యిచ్చిన ఆధ్యాత్మిక ఆశ్రయము సహాయము ప్రత్యక్షములు - శక్తివంతములు. హెచ్. వి. సాథె ఇట్లు చెప్పినాడు: 'బాబా ఎవరినిగాని, ఎన్నడుగాని ఉపదేశమును-తత్త్వోపదేశ ప్రాథమిక పాఠములను ఒసంగి ఎరుగరు; కాబట్టే ఆయనను నేను యిది అడుగలేదు. చాలమారులు, ఇతరులు ఉపదేశ మొసంగుదుమని నన్ను పిలిచినారు. నన్ను పిలిచినప్పుడెల్ల యీ సంగతి సాయిబాబాకు చెప్పుచుంటిని; ఆయన పోవద్దని నివారించుచుండిరి.' ఇదే పద్ధతి రమణమహర్షి గూడ అనుసరించినారు.

శిష్యుల రక్షణ భారము గురువుదే

ఈ ఉపదేశ విధానము హిందూమతమందును, ఇస్లాము నందును తదితర మతములందును అత్యంత ప్రధానమని తెలుసుకొనినప్పుడు యీ ప్రశ్న ప్రాధాన్యము మనకు ప్రత్యక్షముకాగలదు. ఈ భౌతిక జీవితములో ఆధ్యాత్మిక పరమగమ్యాలబ్ధి, సిద్ధుడైన గురుపాదులవారి ఉపదేశ ఆదేశములవల్లనే సాధ్యమగునని యెల్ల

మతములు చాటుచున్నవి. అది గురువునుండి శిష్యునికి ప్రాకు విద్యుచ్ఛక్తి ప్రసారమువంటిదిగ (శక్తిపాత విద్యగ) ఊహించబడు చున్నది. ఈ జీవిత లక్ష్యము ఆధ్యాత్మికోన్నతియేనని దృఢ విశ్వాసము కలిగిన వ్యక్తికి అన్యగమ్యము లెన్నటికి ఆకర్షణీయ ములు కాజాలవు. సర్వమానవస్థితికంటె పైన మానవునకు కోరదగిన దేమున్నది. కాబట్టియే యథార్థ గురుదేవునియొక్క పరమావశ్య కతను సాధకుడు గుర్తించియున్నాడు. ఆధ్యాత్మిక విద్యావంతు డైన ప్రతి వ్యక్తియు ఉపదేష్టయగుటకు అర్హుడు కానేరడు. కారణ జన్ము డైన యే మహర్షికో - లేక ఒక నూతన మతప్రవక్తకో దప్ప తదితరులకు, ఉపదేశము అవిచ్ఛిన్న గురుపరంపరానుగతమై ఒసంగ బడుచుండవలెను. గురువుకానటువంటి సిద్ధ పురుషుడు తన జీవిత ముచేతను, నిజప్రభావ కిరణ ప్రసారము చేతను మానవాభ్యుదయ మును శ్రేయమును గూర్చవచ్చును. ఇదిగాక ఇతర అవకాశములు గూడగలవు. కాని, గురువులు శిష్యకోటికి మార్గోపదేశ బాధ్యత లన్నియు తమవేనని మాత్రము అంగీకరింప నందున అన్య బోధకుల నుండి భక్తులను బెడగొట్టరు. ఇక సాయిబాబా - రమణమహర్షి తన అంతేవాసుల ఆధ్యాత్మిక శ్రేయమును తమపై బెట్టుకొనినా రనిన, తమ శిష్యులకు తెలియక పోయినను, వారు గుర్తించలేక పోయినను, యీ మహాత్ములు ఒక అగోచర ఉపదేశ విధాన మును అవలంబించి యుండినారనవలసియుండును. సాయిబాబా పలుమారు, ప్రత్యక్షముగ తన శిష్యుల రక్షణభారము తనదేనని

చాటియున్నారు. తాను వారిని సదా వేయి కండ్లకాచియే యుండునని, అట్టి విశ్వాసముతో భారము తనపై మోపి నిశ్చింతగా శాంతిని బొందమని చెప్పియున్నారు.

బాబా అన్నారు: 'నా వారిలో ఎవరుగాని నాపట్టునుండి జారి విడివడి పోవుటను నేను సహించను.' రమణ భగవాను డన్నాడు: 'పులినోట బడిన ఎర ఎట్లు తప్పించుకొని బయటపడ లేదో, అట్లే ఒక సద్గురు కరుణానుభూతి ననుభవించే శిష్యుడు ఎన్నడును గురుదేవుని పట్టునుండి బయటపడజాలడు. సాయిబాబా- 'నీవు మిన్నక ఊరకుండుము; కావలసినదంతా నేనే చేసుకొందును' అన్నారు. రమణమహర్షి గూడ ఇదే అనిరి. 'నీవెక్కడైన ఉందువుగాక, నన్ను తలంచుకొనుము; నీ అండన చేరియుందును' అని ధైర్యము చెప్పినారు బాబా. దీనినే అరుణగిరిఋషి, మాటల భేదముతో చాటినారు. దీనిని అచ్యుతపద్రనమంద్రు.

శక్తిపూర్ణ హస్తస్పర్శ

సాయిబాబా, తన శిష్యకోటిపై అపూర్వ దృఢ తమ ప్రాబల్యమును ప్రసరింపజేయుచుండి నారనుటలో ఎట్టి సందేహము గానిలేదు. తమయందు ఆధ్యాత్మిక జాగృతిని లేవగొట్టినట్లును, ఆధ్యాత్మిక మార్గావలంబనమును సాయిబాబా తమకు గరపినట్లును ఎందరో నుడువుచున్నారు; నిజముగా ఆయన నిజశిష్యకోటి శ్రేయమునకెంతయో పాటుబడిరి. ఆయన వచ్చినవారి తలపై తన చేయి బెట్టుటను ఒక ప్రత్యేకమైన అలవాటుగా అలవరచు

కొనినారు. దీనినే హస్తమస్తక సంయోగమందురు. ఒక భక్తుడన్నాడు: 'తన్నాశ్రయించిన భక్తుల తలను తాకుటను బాబా ఒక ప్రత్యేక శక్తిపూర్ణ విన్యాసముగా కలిగియుండినారు. ఆయన స్పర్శ ఏవో కొన్ని శక్తులను, కొన్ని వూహలను, కొన్ని నూత్న ప్రేరణలను ప్రభవింపజేసేది. ఒకొక్కప్పుడు, బాబా భక్తుని శిరముపై నిజహస్తమును చాలా గట్టిగా అదిమి, అతని అవిద్యా జడశక్తులను అణచివేయుచుండినట్లు తోపింపజేయును. ఒకొక్కప్పుడు తల మీద మెల్లిగా తాటింతురు; ఇంకొక్కప్పుడు నిమురుచుందురు. ఇట్టి ప్రతిచేష్టకు ఒకొక్క ప్రత్యేక ప్రభావముగలదు. దీనితో శిష్యుని హృదయ ఫలకమున ఒక అపూర్వశక్తి కలుగుటో, లేక ఒక వినూత్న చిత్ర భిన్నభావము పుట్టుటో జరుగుచుండును.'

గురుపూజయే మోక్ష సాధకము

ఇట్లయ్యు, సాయిబాబా గురుధ్యానము, శుశ్రూషల మూలముగ భక్తులు దైవసాక్షాత్కారమును పొందుటకు శిక్షణము నొసంగుచుండిరి. తాను యీ మార్గమునే చేపట్టి, తన శిష్యులనుగూడ దీనినే అవలంబించమనిరి. ఇదే ఆయన ఉపదేశ పద్ధతి. భగద్గీతలో - శరీరమును మానసాది యింద్రియములను సర్వభోగములను పరిత్యజించుటే మోక్షసిద్ధికి ముఖ్యాంగములని చెప్పిన దాని భావముగూడ యిదియే. ఆచార్య నారద సూత్ర ప్రాయముగా దీనినే యిట్లనిరి: 'ఆజ్ఞల శిరసావహించుట, దేవుని ప్రేమించుట ఈ రెండే భక్తిమార్గమునకు ప్రధాన లక్షణములు. నిజ

గురువుపట్ల శ్రద్ధా భక్తులను పెంపొంద జేసుకొనుటవల్లనే దైవ భక్తిని అలవరచు కొనవచ్చుననునదే బాబా, తన మాటలతో చేతలతో నొక్కి చెప్పుచుండిన ముఖ్య విషయము. గురువునే దైవముగా సాక్షాత్కరించుకొని, ఆయన ద్వారా దేవుని కను కొనుటే యీ విధాన పరమార్థము.'

దైవము - ఆత్మ - గురువు ఒక్కటే!

ఇది సర్వత్రా పరంపరానుగతముగా దిగివచ్చుచున్న ఆచా రము - ఉచితరీతి. రమణమహర్షి - 'దైవము గురువు ఆత్మ నిజంగా భిన్నములుగావు. అవి అన్నియు ఒక్కటే' అన్నారు. ఇంకను, 'బాహ్యగురువు భక్తుని హృదయాంతరాళములో అంతః గురువును మేల్కొలుపుటకు సహాయపడునన్నాడు. ఈ ఆంతరంగిక గురు వన్న భావము క్రైస్తవ ప్రవచనము - 'నీ యందున్న క్రీస్తు' అన్న దానితో సరిపోవుచున్నది. ఈ విషయమై సాయిబాబా అంత విపులముగా చెప్పియుండక పోయినను, ఆంతరంగిక గురువు ప్రాముఖ్యమునుగూర్చి నొక్కి చెప్పినట్లు సాక్షీభూత రచనలుగలవు. ఆయన బోధనలకు కేవలము వ్యతిరేకముగా పైకి కాన్పించినను 'గురువు తప్పని సరిగా ఉండవలసిన అగత్యములేదు. ప్రతిదీ నీ యందే ఇమిడియున్నది. నీవేది చల్లుదువో దాని ఫలితమునే కోసికొందువు. నీవు యిచ్చినదే తిరిగి నీకు ముట్టును.' అన్న వాక్య ములు లోపలి గురువును గూర్చియే చెప్పినట్లు మనము భావించ వలెను. లోపలి గురువును గుర్తించగలిగినచో యీ బయటి

గురువుతో పనియేలేదని దీని అంతరార్థము. ఇంకను బాబా యిట్లు విస్పష్టముగ వెల్లడించినారు: 'అంతయు నీయందే అంతర్గతమై యున్నది. నీ కర్ణేంద్రియములను లోపలికి మరలించి శ్రద్ధగా వినుము; అచట వినిపించిన ఆదేశముల పాలింపుము' అన్నది బాబా తరచు చెప్పుచుండిన సూక్తి. కాని ఈ ధర్మ సూక్ష్మమును భక్తులందరికి చెప్పేవారుకాదు. ఈ విషయమును బాగుగ గుర్తించ వలసియున్నది. సాధకుడు శుద్ధుడై ఆంతరంగిక గురూపదేశముల అనుసరించగలిగిన శక్తిని సముపార్జించుకొను నంతవరకు యీ సూత్రమును ఆచరణలో బెట్టజూచుట అత్యంత ఉపద్రవకరము; ఎందులకనగా: - నానావిధ స్వార్థ చింతామలిన ప్రోత్సాహములు ఆత్మజ్ఞాన ప్రవాహములోనికి జారిపడి, అవే అంతర్యామి ఆధ్యాత్మికోపదేశములుగా చెప్పుకొను ప్రమాదమునకు అవకాశముల గల్పించుచున్నవి. కాబట్టియే - సాధారణముగా బాహ్యగురువు సాధకునికి అత్యంత అవసరమగుచున్నాడు.

శరణాగతి

సామాన్యముగ, గురువుపట్ల భక్తి శ్రద్ధలను, మానసిక పరిమితులులేని శరణాగతినే బాబా తన శిష్యులనుండి కాంక్షించినారు. ఇది శక్తివంతమైన విధానమేకాని, అహంభావ రేఖలు సంపూర్ణముగ చెరపివేయబడిన సంపూర్ణ సద్గురుడు దప్ప యీ విధానమును భద్రముగ నుపయోగించజాలడు; లేకున్నచో యిది భయద అనర్థము కాగలదు. సాయిబాబా ఏ విషయమును

గాని ఉపపత్తులతో సిద్ధాంతీకరించి యుండలేదు కాబట్టి, దీనికి ప్రత్యేక ప్రాముఖ్యము నొసంగలేదు. క్రిందికథ ఆ విషయమును సమగ్రముగ విశదీకరించగలదు.

సాయినామ జపము

ఎప్పుడూ షిర్డిలోనే కాపురముంటుండిన ఆయి అను ఒక భక్తురాలి దగ్గరకు సాయిబాబా తరచుగా తన దగ్గరకు వచ్చిన వారిని పంపుచుండినారు. ఆమె యింట బస చేయుచుండిన ఒక భక్తుడు ఆమెతో 'మనకు అత్యంత శ్రేయోదాయకమైన మార్గము జపమేనని అంగీకరించితినిగాని, ఆ జపములో ఏ నామమును గ్రహించవలెననునదే ప్రశ్న.' అని అడిగినాడు. 'చాలమంది విఠల్ లేక రామనామములనే జపించుచుందురు. నాకు మాత్రము సాయి నామమే తారక మంత్రము. ఆయనే నాకు దేవుడు' అన్నది ఆమె. 'నీకు శుభప్రదమైనది నాకు మాత్రమేలకాదు? నేను కూడ సాయినామమే జపనామముగా గ్రహింతును' అని, వెంటనే వారిద్దరు ఎదురెదురుగా కూర్చుండి ఒక గంటసేపు సాయిబాబా నామమును జపించినారు. ఆవల కాసేపటికి సాయిబాబా ఆ భక్తుని పిలిపించి - 'యీ ఉదయము నీవేమి చేయుచుండినావు?' అని అడిగినారు.

'నామజపము చేయుచుంటిని' అన్నాడు అతడు.

'ఏ నామ జపము?'

'నా దైవ నామోచ్చారణ'

'నీ దైవ మెవరు?' అని అడిగిరి బాబా.

అతడు తొడుగులేకుండా 'మీకు తెలుసునుగదా!' అని మాత్రం అన్నాడు. దీనికి బాబానవ్వి 'అదే సరియైనది.' అన్నారు అనగా, నిజనామ జపమును సాయిబాబా అంగీకరించి హర్షించి నారని స్పష్టమగుచున్నది. ఇంతేగాక యీ తారక మంత్రోపదేశ మును, తాను ఊరకుండియే, ఆయిచేత యీ భక్తునికి ప్రసాదింప జేసినారు. కాని యీ అంగీకారమును ఆయన బహిరంగముగా ప్రకటించలేదు. ఇట్టి బాబా స్థితి హిందువులు సాగించిన పూజా విధానమువలన సుస్థాపితమైనది; దీనినే ముస్లిములు గర్హించినారు. ఇంతేగాదు, గురురూపమున తమ యిష్టదైవమును సాక్షాత్కా రించుకొని ఆధ్యాత్మిక పథగాములగుచుండిన హిందువులకు, ఒక సిద్ధ పురుషుని సందర్శన సాంగత్యములు ప్రసాదించిన భౌతిక ఆధ్యాత్మిక లాభములను మాత్రమనుభవించు అసంఖ్యాక యితర ఆరాధకులకును అంతగా భేదములేదు.

గురువుపై భారము

కేవలము గురునిపై సర్వభారములవైచి శరణాగతుడైన ఆధ్యాత్మికోపాసి, దైవిక మార్గ పథికుడు అవలంబించు సాధనను విస్పష్టముగ ఆకర్షనీయముగ ఆచార్య నార్కే యిట్లు వివరించి నాడు:—

'సాయిబాబా సంప్రదాయము ప్రకారము, ముక్తసంగులై సంపూర్ణముగ ఆత్మార్పణముగావించి, గురుపాద పంకజముల

శరణుజొచ్చిన భక్తుడుగాని సాధకుడుగాని తీవ్ర ధ్యానమునుగాని, నిరంతర నామ జపమునుగాని గావించుచుండ నవసరములేదు. అయినను, అట్టి శరణాగతుని వర్తనము అకళంకమై, మానసము విశుద్ధమై యుండవలెను. ఇంతేగాక అర్హతలేకుండా "ఇది నేను చేయుచున్నాను" అన్న భావముతో ప్రజ్ఞా ప్రకటనముగ చేయు సాధన ప్రతి బంధకమే అగుచున్నది. సాధకుని మానసక్షేత్రము నుండి అహంకారము సమూలముగ నిర్మూలించబడవలెను; జ్ఞప్తి పథమునుండి అది సంపూర్ణముగ తుడిచి వేయబడవలెను. లేకున్నచో గురుని బోధను యిది నిరోధించగలదు. గురువు సాధారణముగ బోధించడు; ఆయన నిజప్రాబల్యమును ఆధ్యాత్మిక శక్తిని ప్రసరణము గావించును. ఈ ప్రభావము ధారాపాతముగ వర్షింపబడుచున్నది; అహమును పరిత్యజించి సంపూర్ణముగ అర్పణము గావించుకొనిన ఆత్మ దీనిని గ్రహించి సమగ్ర ఫలితమును పొందుచున్నది. కాని, యీ ఫలానుభూతిని, అహం మమేతి వృత్తులు అవరోధించుచున్నవి.

"ఈ పరమ సత్యమును, బాబా భక్తులలో గుర్తించ గలిగిన వారందరు తెలిసికొనియే యుందురు. ఆయనే పలుమారు తన భక్తులతో 'నా సన్నిధిలోనేయుండి ప్రశాంత చిత్తులుగండు; మిగతదంత నేను చూచుకొందును' అని చెప్పియున్నారు. ఇది అంతర్ముఖధ్యానము.

గురువే శరణ్యము

'కాబట్టి ముముక్షుడైన సాధకుని ప్రథమ కర్తవ్యము - అతడు, నిరాడంబరుడై శుద్ధ మనస్కుడై విశుద్ధ సరళ వర్తనుడై యుండవలెను; అప్పుడు గురు ప్రసాదమును బడయ సర్హుడై యుండును. ఆవల, తన్ను క్రమానుగతముగ ఉన్నతానుభవము లకు నిజాప్త గురుదేవుడు కొనిపోగలడన్న విశ్వాసముండవలెను. ఇవి అన్నియు సమకూడియున్నచో భక్తుడు చరమ వాంఛిత గమ్యమును పొందగలడు. అంతవరకు సహనశీలుడై యుండవలెను. ఇదే అతనికి సక్రమమైన స్థితి. చరమ గమ్యమునుగూర్చి అతడు, సంకీర్ణ ఆధ్యాత్మిక దార్శనిక సమస్యల పరిష్కరించను ఆయాస పడనవసరము లేదు. గురువే తన భక్తుని ఉన్నతికి గొనిపోవును; ఉన్నత తరశక్తుల ప్రసాదించును, విస్తృత తమ విజ్ఞానమును అను గ్రహించును; చివరకు సత్యసిద్ధి అవకాశముల వృద్ధిచేయును. సాధకుని చరమస్థితి గురుదేవుని హస్తగతమై సురక్షితమై యుండును.

'ఇదంతయు ఒక్క గ్రుక్కలో సాయిబాబా నాకు చెప్ప లేదు; ఇతరులకు చెప్పుచుండగా విననూ లేదు. కాని ఆయన వివిధ భక్తకోటికి అందించిన సూచనలు, ఆయన ప్రవర్తనలు, ఆయన అప్పుడప్పుడు పలికిన సూక్తులు అన్నిటిని కలిపి సమన్వయించు కొనిన యీ విషయము తేలగలదు. శాస్త్రజ్ఞానము సామాన్య దృష్టిగూడ యిదే మార్గమును చూపుచున్నవి.'

ఇదే సాయిబాబా ఉపదేశములకు అద్భుత సారాంశము. ఇక, దీనికి సార్వజనీన రూపమునిచ్చి సర్వులకు అనువర్తింపఁజేయుదమని ఆయన భక్తు లనుకొనుట సహజమే!

సత్యనిష్ఠ

ఇట్టి ఉపదేశములకు అపరిచితులగువారికి ఔదాసీన్యము సహిష్ణుత్వాది గుణములు అలవడవు. ఇంకను, ఈ విధానము ఆధ్యాత్మిక క్లైబ్యమునకే దారితీయు అనర్థమని భయపడుచున్నారుగాని, యీ భీతికి తావులేదు. అధర్మమును అసత్యమును అహంకారమును సహించుట ఎట్లు అపాయకరమో, ఇంద్రియ వ్యాపారముల ఉద్రేకముల నిరోధించకుండుటచే శీలమును క్రమేణా ఎట్లు విశ్లేష మొనర్చునో, అట్లే సత్యము ఆధ్యాత్మిక ప్రాబల్యములపట్లచూపు సహిష్ణుత ఆర్జవము సత్యనిష్ఠ బుద్ధిబలమునకే దారితీయుచున్నది. కాబట్టే దైవేచ్ఛకు సంపూర్ణ వశంవదుడైన సిద్ధుడు, అహంకార లేశమేనిలేని యోగి, మానవులలోకెల్ల ప్రాభవ పూర్ణుడుగ పురుషోత్తముడుగ ఎన్నబడుచున్నాడు. అట్టి పురుషుడు అవిద్యాబంధమును సంపూర్ణముగా పరిత్యాగ మొనర్చిన వాడగుట చేతనే మహాత్ముడుగా పరిగణింపబడుచున్నాడు. భగవల్లీలపట్ల సహిష్ణుడైన పురుషుడు యీ భౌతిక ప్రపంచమున శక్తియుతుడై మార్గదర్శకుడగుటకు కర్మోద్యుక్తుడగుచున్నాడు. అహంకారమునకు లొంగిన వ్యక్తి దేవునిపై తిరుగబడుటకే ఉపక్రమించు

చున్నాడు; అందువల్లనే సాధనారంభ స్థితిలో సహానబుద్ధి దుష్కర మగుచున్నది.

అధునిక మహా పురుషత్రయము

ప్రస్తుత కాలమున, సుప్రసిద్ధులైన మహా పురుషులు ముగ్గురు - శ్రీ రామకృష్ణపరమహంస, సాయిబాబా, రమణ భగవానుడు. సాయిబాబా షిర్డిలో వెలయుటకు కొంత ముందు రామకృష్ణులవారు కలకత్తా సమీపమున బెలూరునందు ఆశ్రమము నెలకొల్పి బోధించ మొదలిడినారు. సాయిబాబా అవతారము చాలించగానే చాలామంది శిష్యులు దక్షిణాపథమున అరుణ గిర్యాశ్రమమున రమణమహర్షిని ఆశ్రయించసాగిరి. ఈ ముగ్గురు మహామతులు దైవీసంపన్నులగుటచేతనే అచింత్య శక్తి దీపితులై దృఢతర మహిమను ప్రసరింప జేసినారు. ఈ మహిమాత్ములు ముగ్గురికి పారమార్థికమున ఏకాభిప్రాయముండినను, స్వభావమునందును ఆసక్తియందును సామర్థ్య ప్రచారములందును భిన్న మార్గములు గోచరించుచున్నవి.

సాయిబాబా రమణమహర్షి, ఈ ఇరువురు నిర్దేశించిన మార్గముల సారూప్యమునుగూర్చి పలుమారులు వివరించియేయున్నాము. ఇవి శ్రీ రామకృష్ణపరమహంస బోధలకుగూడ సరిపోవుచున్నవి. వారి ప్రకృతులలో భేదమున్నను, జ్ఞానోపదేశ మార్గములందు సాదృశ్యము కలుగుటకు కారణము - దేశకాల పరిస్థితులకు అనుగుణముగ యోగీశ్వరులు తమ దివ్య సందేశముల అమర్చుచుందురని

అర్థము చెప్పవలసియుండును. కాబట్టి ఆ మార్గము లెట్టివో తెలిసి కొనుట అత్యంతము ముఖ్యము.

రామకృష్ణపరమహంస

మొదటిది: ఈ ముగ్గురు మహాపురుషులు సమస్త మతములు సమానములని, తుల్యప్రామాణ్యములని ఉద్ఘోషించినారు. పూర్వము - ఆయా మతము తమతమ సంకుచితాధికార సీమలను మాత్రమే అంటిపెట్టుకొని యుండిన దినములలో - యీ విషయమునకంత ప్రాముఖ్యము యేర్పడకుండినది; ఆచరణలో ప్రతిబంధకములుగూడ లేకుండినవి. సామాన్య క్రైస్తవుడు బౌద్ధమునుగూర్చి విని యుండడు, అట్లే సామాన్య బౌద్ధుడు క్రైస్తవమునుగూర్చి తెలిసికొని యుండడు. కాని, ప్రపంచము సన్నిహితమై ఏకజాతి భావము కలిగిన యీనాటి సార్వజనీన నాగరకతలో; భౌతికవాదులు హేతువాదులు వివిధ మతములందలి విభేదములను ఎత్తిచూపి, యివన్నియు లోపభూయిష్ఠములనియు, మానవ నిర్మితమైన కృత్రిమ నియమావళి యనియు చాటసాగినారు. సామాన్య మానవాళి వివిధ మత సూత్రములలో కొన్నిటిని మాత్రమే తెలుసుకోగలిగినందున యీ విరోధ భావము చాలా అపాయకర వాదమగుచున్నది. బూటకపు అర్థ పండితులైన మతోద్ధారకులు - అన్యమతముల తెగనాడి, ప్రతిమతము పరస్పర విరుద్ధమైన సత్యమును ప్రవచించుచున్నదని ఆర్భాటముచేసి, మత విధ్వంసకుల చేతులలో చిక్కిపోవుచున్నారు. ఇట్టి దుష్ట పరిస్థితు

లలో సత్యదృష్టి గలిగిన సత్పురుషులు 'సత్యము ఒక్కటే, కాని దాని నిర్వచన విధానములు మాత్రమే భిన్నములగుచున్నవి.' (ఏకంసత్ విప్రా బహుధావదంతి)అని చాటవలసియున్నది. హిందూ మతరీత్యా రామకృష్ణపరమహంస సత్యసిద్ధినిబొంది, ఆవల మరల ముస్లిం మార్గమున, ఆవల ఇంకొకమారు క్రైస్తవ మార్గమున ఉపాసించి చివరకు ఆ రెండుగూడ పూర్వము తాను పొందిన స్థితికే తన్ను గొనిపోయినవని, మూడును ఏక లక్ష్య బోధకములే అనియు వెల్లడించినారు. సాయిబాబాగూడ ఇస్లాం హిందూ పథానువర్తియై ఆ రెండు మార్గములలోను భక్తులకు జ్ఞానోప దేశము నొసంగి, అన్యోన్యముగ రెండును సత్యములేనని వారిచేత అంగీకరింపజేసినారు. ఈ ఉభయులు సామరస్య జీవనముల నడుప తమ శిష్యుల బలవంతముగూడ చేసినారు. రమణమహర్షి సర్వ మతాతీతుడు; అవి అన్నియు అధిరోహించు శిఖరాగ్రము ఒక్కటే నని, అవి ఒకే కేంద్రమునుండి ప్రసరించినవని ప్రవచించినారు. ఆయన శిష్యకోటిలో హిందువులతోపాటు క్రైస్తవులు ముస్లిములు యూదులు బౌద్ధులు పారసీకులు గూడ గలరు. తన శిష్యులు ఒక మతమును పరిత్యజించి ఇంకొక దానిని స్వీకరించవలెనని ఆయన ఎన్నడును కోరలేదు.

సర్వజన ఆచరణ యోగ్యమైన మతము

ఆధునిక కాలమునకు ఆనుగుణ్యమైన, అంగీకృతమైన మతము ప్రస్ఫుటమై, మూఢాచార అనుష్ఠానాదులచే భారవంతము

గాక, నేటి సర్వవిధ జీవిత విధానములకు - ఉద్యోగికి కార్మికునికి కర్షకునికి ఋష్యాశ్రమ వాసికి గూడ ఆచరణయోగ్యమై యుండ వలెననునదియే, బహుశః యీ పెద్దల ప్రధానోద్దేశమై యుండ నోపును. వ్యాపార సంస్థలలోనో ఉద్యోగ కార్యాలయములలోనో తమ విధుల నెరవేర్చుకొనుచు, అనుష్ఠానాదికములకు అవకాశము లేకయున్న అకళంక ముముక్షువులు ఎందరో గలరు. వారు అధు నాతన సాంఘికాచారములకు లోబడి, తోడి ఉద్యోగులకు వెగటు గాని విధమున గూఢముగ తమ మత విశ్వాసముల ఆచరించ వలసియుండును. ఇట్టి పరిస్థితులకు తగిన వసతులు నేడు కల్పింప బడియున్నవి. రామకృష్ణపరమహంస సజీవులుగనున్న కాలములో తన శిష్యులు సన్న్యసించుటకు అనుజ్ఞ నొసంగువారుగాదు. అట్లే సాయిబాబాగూడ గృహస్థాశ్రమమును ప్రోత్సాహపరచేవారు. ఆయన భక్తులలో సాధువులు ఫకీరులున్నప్పటికిని, గృహస్థులుగా ఆయన సన్నిధి చేరినవారు అదే ఆశ్రమమును సాగించుచుండిరి. రమణమహర్షి గూడ సన్న్యాసాశ్రమమునకు సుముఖత జూపలేదు. రమణమహర్షి ఉపదేశించిన ఆత్మ విచార పద్ధతికి బాహ్యాచార ములు అవసరములేదు; అంతర్ముఖముగ వీటిని అనుష్ఠించవచ్చును. ఇట్లే సాయిబాబాగూడ ఒక అనుష్ఠాన విధానమునుగాని, నామ జపమునుగాని నిర్దేశించి యుండలేదు; రామకృష్ణుడుగూడ ఇంతే. ఈ ముగ్గురి మతమునందును, మోక్ష సాధనము గురుభక్తి మూలకముగనే అలవరచుకొనవచ్చును. వారి భక్తులందరిలోను

యీ గుర్వారాధనమే సుస్పష్టమై యితర మార్గముల గ్రసిత మొనర్చివేసినది. 'నిశ్చలుడవై యుండుము; మిగత అంతా నేనే చేసికొందును' - ఇదే వారి మూలసూత్రము. గురుదేవుని మహత్తర శక్తి సదా పనిచేయుచునేయుండును; ఇక భక్తుడు చేయవలసినదెల్ల ఆ దివ్యశక్తి ప్రాబల్యమును అరికట్టకుండుట మాత్రమే!



# 7. దేహత్యాగము - పునరుత్థానము

1886లో సాయిబాబా మరణమునకు ఒక పూర్వ ప్రయోగాభ్యాసం జరిగినది.! నిరంతరము బాబా సన్నిధానములో ద్వారకామాయియందే నివసించుచుండిన మహాల్సపతితో బాబా 'నేను అల్లాను చేరబోవుచున్నాను. ఈ శరీరాన్ని మూడు దినములు అతిజాగరూకతతో కనిపెట్టి కాపాడుచుండుము. నేను తిరిగి వచ్చితినా, నా దేహము నేనే చూచుకొందును; లేకున్న ఆ బయలులో భూస్థాపితముచేసి గుర్తుగా రెండు స్తంభములు నాటుము' అని చెప్పినారు.

## మరణము - పునర్జన్మ

ఈ మాటతోగూడ ఆయన శ్వాస నిలిచిపోయినది; రక్త ప్రసారము ఆగిపోయినది. పురపాలక సంఘోద్యోగులువచ్చి, పరీక్షించి బాబా శవ సంస్కారము, తమ చట్ట ప్రకారము ఇరువది నాలుగు గంటలలోపల చేయమని మహాల్సపతితో చెప్పిరి. కాని, మహాల్సపతి నిరాకరించుటలో ఆశ్చర్యమేమున్నది? మూడవ దినమున బాబా శవసదృశ భౌతిక కాయమున మరల శ్వాసలు పొడకట్టినవి! ఉదరము చలించ సాగినది. సాయిబాబా కండ్లుదెరచి చూచిరి! పునర్జీవితులైనారు!

సంపూజనోత్సవములు

ఇది మొదలే బాబా ఖ్యాతి నలుదిక్కుల గాఢముగ వ్యాపించినది. ఆవల 1918లో ఆయన పరమపదించు నంతవరకు, బొంబాయి మొదలగు వివిధ నగరములనుండి దర్శనాపేక్షులు నిరంతర ప్రవాహ రూపమున షిర్డీ తీర్థ సంసేవనము గావించుకొనుచుండిరి. ఆయన వాంఛించని పటాటోపాదులను ఆగంతుకులు ఆయనపై మోపిరి. రజత రథోత్సవములు - గజోత్సవములు - పాద పూజలు - సువర్ణాభిషేకములు మొదలగు భక్తి ప్రపూర్ణ ఆరాధనలు ఎడతెరిపిలేకుండ సాగింపబడినవి. ఒక భూతలేశ్వరునిగా, సాక్షాత్ ఇష్టదైవ ప్రతిరూపముగ ఆయనను భక్తకోటి అర్చించినది. వీటినన్నిటిని ఆయన ఏవగించుకొనినను, భక్తులు వదలలేదు; వీటి నన్నిటిని చేయించుకొనక ఆయనకు తప్పినదిగాదు. ఇంతటి ఇంద్రభోగముల మధ్యగూడ సాయిబాబా ప్రతిదినము స్వయముగా యిల్లిల్లు తిరిగి కవళ మెత్తుకొనియే భుజించుచుండినారు.

ఆయన ఆరోగ్యము క్రమేణా క్రుంగిపోవ దొడగినది. ఉబ్బసము ఎక్కువైనది. ఆ స్థితిలోగూడ భక్తుల భార వహనము తప్పినదికాదు.

విముక్తి

1916 సంవత్సరమున విజయదశమినాడు, ఒక ఉన్మత్త విహారము బాబాకు కలిగినది; గుడ్డలు చించివేసి దిగంబరులై రెండు గంటలు తిరుగాడుచు 'నేడే నేను యీ పొలిమేరలు

దాటిపోవు దినము' అని అరచుచుండినారు. జీవన్ముక్తుల వర్తనమే యిట్టిది. ఆవల మరల శాంతించి, యథారీతి జీవనము గడపి, మరి రెండేండ్ల అనంతరము - సరిగా విజయదశమి దినమున - 1918 అక్టోబర్ 15-వ దినాంకమున శ్రీ బాబా మోక్ష మొందినారు.!

మహాప్రస్థాన యత్నములు

దేహత్యాగమునకు ముందు, ఉండదలచుకొనిన కొందరు భక్తులను బొంబాయికిపంపి, పోదలచుకొని వారిని కొందరిని ఆపి వేసినారు. పక్షమున కొకమారువచ్చి దర్శనము చేసికొని పోవు చుండిన ఒకనితో ఇక రావలదని తుది వీడ్కోలు నిచ్చినారు; ఈ చేష్టల అర్థము ఎవరికిని తెలిసినట్లులేదు. 'అల్లా వెలిగించిన దీప మును తిరిగి ఆయన యందు లయింప జేసికొన్నారు' అని ఒక ముస్లిం భక్తునికి సందేశమంపినారు; ఆ భక్తుడు సిద్ధుడయ్యు యీ వార్తకు కంట తడిబెట్టినాడు. ఇన్నూరు రూపాయలతో ఫకీరులకు మృష్టాన్న భోజనము పెట్టించినారు, వారు ఖురాను పారాయణ మును చేయుచుండిరి. అది విజయదశమీ పర్వదినమగుటచే రామాయణము (రామవిజయము) పఠించబడినది.

ఆనాటికి ముందు కొన్ని దినములుగా ఆయన అస్వస్థులై యుండినారుగాని, ఎవరుగాని అది చరమస్థితి యని గుర్తించరైరి. ఆనాటి ఉదయమునుండి బాగులేక పోయినను, మధ్యాహ్న వేళలో లేచికూర్చుండి, అనుదినము మస్జిద్‌లో వంట చేయుచుండిన బ్రాహ్మణునికి మొదట ఐదు రూపాయలు, ఆవల మరి నాల్గు

రూపాయలు యిచ్చినారు. దగ్గర వుండిన వారిని భోజనముచేసి రమ్మనిరి. ఆయన దగ్గర ఇద్దరు బ్రాహ్మణులు మాత్రముండిరి. అందు ఒకరు ఇట్లు నుడువుచున్నారు: 'బాబా, వారి చరమ జీవిత దినమున నాకు కొన్ని మాటలుచెప్పి, తన మాటవినక ఎవరితోనైనా వాటిని చెప్పినచో చనిపోదువని ఆనపెట్టినారు. దీక్షితులను ఎక్కడికో పంపివేసినారు. ఆవల కాసేపటికి ఆయన "నేను వెడలిపోవుచున్నాను. ఆ వాడకు నన్ను ఎత్తుకొనిపొమ్ము. నా దగ్గర బ్రాహ్మణులు మాత్రమే ఉండవలెను" అని అంటూనే ప్రాణముల విడచిరి. వెంటనే నానా నిమోణ్‌కర్ ఆయన నోటిలో నీరు పోయగా, అవి బయటకు వచ్చివేసినవి. ఆ నీటికి దోసిలి పట్టితిని. బాబా నాపై ఒరగి ఆనుకొని తనువును బాసినారు.'

బాబా యిచట బ్రాహ్మణుడు అనుపదం బ్రహ్మవిద్య తెలిసిన వాడన్న అర్థములోనే ప్రయోగించినారు. వాడ అనగా ఆయన సమాధికిగా బాబుసాహెబ్ బూటి ఇంతకుముందు కట్టించిన మందిర మునుసూచించిరి. దీనికిముందు కొన్ని సంవత్సరములనాడు బూటికి, దేశపాండే కి బాబా స్వప్నములో కానుపించి, ఆ మందిర నిర్మాణ మునకు ఆదేశించినారు. బూటి నిర్మాణమునకు కడంగినప్పుడు 'సరే! ఆ దివ్యాలయము పూర్తికాగానే మేముందు నివసింతుము' అన్నారు.

అపరక్రియల వివాదము

సాయిబాబా వివాద పడవలదని కచ్చితముగా చెప్పిపోయి

నను, ఆయన అంత్యక్రియల విషయములో వివాద మేర్పడినది. ముస్లిములు, ఆయన తమవాడు కాబట్టి వారి యిష్టానుసారము, దానికిగా నిర్మింపబడబోవు దర్గాలో ఆయన శవమును భూస్థాపితము చేయవలెనన్నారు. గ్రామాధికారులు షిర్డీవాసుల నందరిని కనుగొని, అధిక సంఖ్యాకులు యిష్టానుసారముగ, బాబా చరమ వాంఛ ప్రకారము ఆ వాడ యందే సమాధి చేసినారు. అదే సమయమున ఆ వాడకు, ఆ మస్‌జిద్‌కు వచ్చే సర్వమతముల యాత్రాపరులకు ప్రవేశించుటకు సదుపాయములుండ వలసినట్లు ఉభయ మతములవారును ఒప్పందము చేసుకొనిరి.

పూజా చిహ్నాలు

నేటికిని బాబా వెలిగించిన నెగడు నిరంతరాయముగ జ్వలించుచు, దివ్య విభూతిని ఒసగుచున్నది! ఇప్పుడు దానిచుట్టు కటకటాలు అమర్చబడియున్నవి. పూతమైన ఆ భస్మము భక్తులకు ప్రసాదింపబడుచునేయున్నది. బాబా పొగాకు మట్టిచిలుము గొట్టములలో బెట్టి పొగ పీల్చుచుండిరి. పగిలిపోయిన గొట్టాలు ఆ చుట్టు ప్రక్కలా పరచుకొని యుండినవి. అనేక భక్తులు వీటిని పవిత్ర స్మృతిచిహ్నాములుగా కొనిపోయిరి. మిగిలిన వాటినన్నిటిని సున్నములో కలిపి ఒక అరుగుగా చేసినారు. దానిమీద బాబా వాడుచుండిన నీటికుండ, టెంకాయచిప్ప ఉంచబడి పూజింపబడుచున్నవి.

బాబా రాత్రులందు నిదురించుచుండిన చావడి మట్టి గోడలు వానకు కరగి పడిపోగా 1916లో రాతితో మరల కట్ట

బడినవి. బాబా రూపపటము - పెద్దదొకటి ఆ మందిరమును అలంకరించి, పునీతము చేయుచున్నది.

బాబా దేహత్యాగ విషయమునను, ఆయనను భూస్థాపితము చేసిన విషయములోను కొంత భ్రమయున్నది; ఎందులకనగా- సర్వులకు బాబా పరమపదించలేదని బాగుగ దెలియును. తన సమాధి యత్నముల జేయుచుండిన అదే సమయమునందు తన ఉత్తర జీవితమునకుగూడ తగిన వసతులను సిద్ధము చేసికొనుచుండినారు. ఆయన మరణ ఛాయలు అస్ఫుటముగానైన అనుమానించబడని పక్షము దినములకుముందే - ఆర్. బి. పురందరెని, హెచ్. ఎస్. దీక్షితులను బొంబాయికి పొమ్మని చెప్పుచు, వారితో బాబా: 'నేను మీకు ముందే పోవుదును; నామృత్తిక మీకు ప్రత్యుత్తరముల నొసంగుచుండును' అన్నారు. ఇదియే తగిన ఎచ్చరిక; కాని బాబా శిష్యులు ఆయన చెప్పుచుండిన ఇట్టి విపరీత అపూర్వ విషయముల పదేపదే వినుచుండినారు కాబట్టి ఈ సంగతిని అంతగా పట్టించుకొనలేదు.

భక్తులకు ప్రత్యక్షము

ఒకపరి, ఒక భక్తురాలు తాను అత్యంతము బాబా మీద ఆధారపడి శరణాగతి నొందియున్నాననియు, ఆయనే మార్గదర్శకుడుగా నమ్మియున్నందున ఆయన వినా తాను తాలు తగులము లేకుండా కొట్టుకొని పోవుదునని చెప్పి, ఆయన దివంగతుడు అయిన తర్వాత ఏమి చేయవలెనో చెప్పమని ప్రార్థేయపడినది. ఆయన

నుస్పష్టంగా: 'నీ వెక్కడుండినా, ఎప్పుడైనా నన్ను తలంచినచో నీ పజ్జన చేరియుందును' అని చెప్పినారు.

భౌతికకాయ త్యాగానంతరము

ఆయన దేహత్యాగానంతరముగూడ, భక్తులకు ఉపదేశములలోను, ప్రసాదించిన వరములలోను, ఆర్తిత్రాణము నందును ఏట్టి లోపముగాని ఎట్టి మార్పుగాని ద్యోతకము కాలేదు. ఆయన అప్రాకృత మహిమ అవిచ్ఛిన్నముగ, నిరవధికముగ ప్రవహించుచునేయున్నది. ఆయన మరణానంతరము ఆయన భక్తులు అనుభవములలోను, ఆయన ఒసంగిన రక్షణమునందును ఎట్టి భేదమునుగాని గుర్తించి ఎరుగరు. ఆయన నిర్యాణానంతరము గూడ ఆయనచే వరప్రసాదమును అనుభవించుచునేవచ్చుచున్నారు. అప్పటివలెనే నేటికిని వారికి, మానసిక ఫలకములందును స్వప్నము లందును వారుపొడకట్టుచునేయున్నారు. ఆయన పాదపద్మముల ఆశ్రయించిన వారికి నేటికిని కోరినకోర్కులదీర్చి, ప్రశ్నలకు ఉత్తరముల నిచ్చి, కామిత రక్షణముల నొసగి సజీవ ప్రాబల్యమును ప్రదర్శించుచునేయున్నారు. చిక్కువీడని క్లిష్ట సమస్యా పరిష్కారమునకు కాగితపు ముక్కలపై సందేహములవ్రాసి, బాబా రూపపట సన్నిధిని కుదిలించి వెదజల్లి, ఏరుకోనకుండా ఎత్తుకొని, ఆ చీటి యందలి సమాధానమునే బాబా అనుగ్రహించిన హితముగా భక్తులు నేడు శిరసావహించి తృప్తిపడి సుఖించుచున్నారు. అగో చరముగాపుడై ఆయన నిజ భక్తకోటిని ప్రోద్బలపరచి నడుపు

చున్నారు.! ఆయన చెప్పినట్లే ఆయన భక్తులెవరుగాని, తినను తిండి లేక, తలదాచుకొనుటకు నీడ లేక బాధపడినదిలేదు. విశ్వాసవంతులు ఆర్తిలో బాబా నాశ్రయించి స్వాస్థ్యమును క్లేశప్రశమమును పొందుచున్నారు. ఈ భౌతిక వాంఛాలబ్ధియేగాక, జీవిత కల్లోలోపశమనమేగాక, ఆయన వాత్సల్యవర్షముచే ఉద్భవించిన అధ్యాత్మిక స్రవంతి అదృశ్యముగ ప్రవహించుచు భక్తకోటిని పరిణత మనస్కుల జేయుచు, నిగూఢార్థ గ్రహణమునకు వారి హృదయముల ఆయత్త పరచుచున్నది.

బాబా మహొన్నతుడు

ఒక భక్తుడు యీ విశ్వాస పూర్ణమైనఉదంతమును వెల్లడించుచున్నాడు: అతడు, 1927లో నారాయణమహారాజను ఒక ప్రఖ్యాత సిద్ధుని దర్శనమునకుపోయిరి. ఇంకను సాయిబాబా పాద పంకేరుహాలగ్న మానసుడైన అతడు, సాయిబాబాగానే ఆ తపస్విని భావించి, 'సజీవ మానవాకృతిలో నాదర్శన వాంఛనుదీర్చి ఆప్యాయత గూర్చు' మని ధ్యానించినాడు. అది అతడు బయటకు చెప్పక పోయినను ఆ మహానుభావుడుయిట్లనినాడు: 'నీగురు దేవుడు పరమోత్కృష్టుడు. ఆయన నా కంటె అత్యంత ఉన్నత స్థానమున నున్నవాడు. నీవు యిక్కడికేలవచ్చితివి? నీ గురునిర్ణయము అత్యంత ప్రాశస్త్యము. ఆయున దగ్గరకేపొమ్ము. నీ కోర్కెలు సిద్ధించును.'

కురుపుమాన్పుట

ఇంకొకరు చెప్పు విషయము: 1934లో తన బిడ్డకు తీవ్ర

శీతల జ్వరము వచ్చినది, ఇదిగాక రొమ్ముపై పెద్ద పుండు లేచినది. బిడ్డ చాలా నీరసించిపోయి యున్నందున శస్త్రముతో కురుపును ఎత్తివేయను వైద్యుడు వెనుకాడినాడు. ఇక తన సొంత వైద్యుడు సాయిబాబాయే అతనికి దిక్కైనాడు. తన దగ్గర నుండిన బాబా విభూతిని బిడ్డ కురుపై బెట్టినాడు. అదిచూచి,డెపుటీ కలెక్టరు వి. ఆర్. ఎం. జాదవ్ గారు - 'దీనివలన నెమ్మదించునన్న విశ్వాసమున్నదా? ఆ నోరు దెరచుకొనిన వ్రణమెంత కాలానికి మానును' అని అడిగినాడు. 'ఇరువదినాల్గు గంటలలో' అన్నాడు ఆ భక్తుడు. ఆ రాత్రి సాయిబాబా ఆతని కలలో కానుపించి 'వెంటనే మానునని ఏల చెప్పలేదు?' అని మందలించినారు. ఆ కలలోనే అతడు బాబా క్షమాపణను వేడుకొనినాడు. ప్రొద్దున లేచువరకే బిడ్డ కురుపు పూర్తిగా మానిపోయి యుండినది! జాదవుడు ఆశ్చర్యపరవశుడై, న్యూమోనియాతో మంచముపట్టి యుండిన తన నాలుగేండ్ల బిడ్డకు ఆ విభూతి పెట్టమని అడిగినాడు. అప్పటికే ఆ బిడ్డ జ్వరము ఆరుదినాల ముదురుది. ఆ భక్తుడిచ్చిన భస్మముతో జాదవుని కొడుకు జ్వరము నిమ్మళించి పోయినది. డాక్టరు మూడు దినములకుగాని తగ్గుమొగము పెట్టదని చెప్పి యుండినాడు.

ఆ వ్రణము మానిన బిడ్డనే, దీనికి రెండు సంవత్సరముల క్రితము బాబా రక్షించి యుండినాడు. మిద్దె మెట్లపై నుండి ఆ బిడ్డ క్రిందకు జారిపడినాడు. తండ్రి త్రాసోన్మాదుడై పరుగెత్తి బిడ్డ

నెత్తుకొనగా, కనుకందకుండా వాడు క్షేమముగానుండి ఆశ్చర్యము కలిగించినాడు. ఆ బాలుడు 'బాబా నన్ను క్రింద పడకుండా చేతులతో పట్టుకొనినాడు' అని చెప్పినాడు.

1918 సంవత్సరమునకు యీవల బుట్టినవారి విశ్వాస గాథలు చాలవున్నవి. అయినను, అవి శక్తియందును విస్పష్ట సహాయానుభవమునందును ఏమాత్రముగాని పూర్వ గాథలకు తీసిపోవుటలేదు. దీనికి కారణాలు సాయిబాబాకంటె యితరులు అంత సుస్పష్టముగ వివరించలేరు. ఆ ప్రవచన ముక్తావళి ఇది:_

ఉపదేశ సూక్తి ముక్తావళి

- ఈ భౌతిక కాయమును నేను వీడిన తదనంతరముగూడ నా శక్తి తరుగనిదై సచేతనమైయుండును.
- నా సమాధి నా భక్తుల దీవించి వారి కోర్కెల దీర్చును.
- నా శరీరావశిష్టములు సమాధినుండి మాట్లాడును.
- నేను నిత్యజీవినై నన్నాశ్రయించిన వారికి తోడ్పడి, పరిత్యాగ బుద్ధితో నన్ను శరణుజొచ్చిన వారికి అండగానుందును.
- మీ భారముల నాపై పడవేసినచో నేను భరింతును.
- మీరు నా హితమును మార్గోపదేశమును అర్థించినచో నేను తక్షణమే వాటిని అనుగ్రహింతును.
- బాబా: 'నా భక్తులనింట దేనికిగాని కొరత యుండదు.' అని చాటినారు. ఆయన రక్షణ ప్రసాదములు ఆయన

జీవించి యున్నప్పటివలెనే యిప్పటికిగూడ శక్తివంతములై అవిరళములై యున్నందుననే నేటికిని ఆయన భక్తకోటి సంఖ్య పెరిగి పోవుచున్నది. చివరకు ఆయన చెప్పిన యీ మహా వాక్యమునుగూడ జ్ఞప్తి పెట్టుకొనవలెను.

'నేను యివ్వదలచుకొనిన దానినే నా భక్తులు కోరుకొను శక్తిని పొందుదురను విశ్వాసముతోడనే యిప్పుడు వారు కోరినదెల్ల బసంగుచున్నాను.'

—: సమాప్తం :—



# నెల్లూరు శ్రీ సద్గురు సాయిబాబా మందిర చరిత

(అనుబంధము)



నెల్లూరు సద్గురు సాయి మందిరము

# నెల్లూరు శ్రీ సద్గురు సాయిబాబా

# మందిర చరిత

## ఆరాధనారంభము

నెల్లూరు మండలమున శ్రీ సద్గురు సాయిబాబా సంపూజన మహావృక్షమునకు డాక్టర్ శ్రీమాన్ ముకుందగిరి కందాడై రాజగోపాలాచారిగారి భక్తి విశ్వాసములే బీజము, వారి పూత కార్యదీక్షయే ఆ మహావృక్ష సుగంధ పుష్పరాజి - దివ్యఫలరాజి! వీరి ఉత్సాహాలతకు ఆయన ధర్మపత్ని దొరైఅమ్మాళ్ మారాకు హత్తించి, మందిరముయొక్క నేటి రూపమునకు కారణభూతయైనది!

వీరి భక్తి బీజమిట్లు ననయెత్తినది:— 1938లో డాక్టర్ రాజగోపాలాచారిగారి దగ్గర చికిత్స బొందుచుండిన ఒక మిత్రుడు బొంబాయి యాత్రలో షిర్డీనిచూచి, శ్రీ బాబా చిత్రపటము నొకదానిని కొనివచ్చి డాక్టరుకు యిచ్చి వారి మహిమపూర్ణ చరిత ముక్తసరిగా చెప్పినాడు. ఆచారిగారు ఆపటమును ఒకఅట్టపై అటించి గోడకు తగిలించిరేగాని పూజింపరైరి. కొంతకాలం గడచిపోయినది! ఒకనాటి వేకువన డాక్టరు నిదురించుచుండగా, ఒక

నెల్లూరు సాయి భక్తమండలి పుట్టువుకు తోడ్పడిన పుణ్యదంపతులు



డా. శ్రీమాన్ ముకుందగిరి కందాడై రాజగోపాలాచారి - వారి ధర్మపత్ని దొరై అమ్మాళ్

యోగి వారి స్వప్నములో ప్రత్యక్షమైనారు. ఆయన మోకాళ్ల క్రిందిభాగం కురుపులతో రసిక గారుచుండునట్లు పొడగట్టగా ఉలిక్కిపడి లేచిచూచిరి; అందెవ్వరును కాన్పించలేదు. వారు యథారీతి తమ చికిత్సాలయమునకు వెడలిరి. అందు పనిమధ్య తలవని తలంపుగా సాయిబాబా పటముపై ఆయన చూపులు వ్రాలినవి! అది దైవిక క్షణము! అందలి రూపము, తాము ఆనాడే స్వప్నములో గాంచిన వ్యక్తి రూపమువలెనే వుండినది! ఇందు ఇంకొక విశేషము - ఆ పటము క్రిందిభాగమును - అందలి మూర్తి మోకాళ్లవరకు చదులు తినివేసియుండినది! వెంటనే పూర్వజన్మ సంస్కారముచే దైవగంధము డాక్టరు మానసాంబుజమున పరిమళించినది. భక్తిచకితుడై ఆ పటమును శుభ్రముచేసి పూజింపసాగిరి.

మరికొంత కాలమునకు సౌభాగ్యవతి దొరై అమ్మకు మరియొక ఉజ్జ్వల సాక్షాత్కారము ప్రసాదింపబడినది. ఒక ఉదయం ఒక యోగి రాయజివీధిలోవారి ఇంటికివచ్చి అన్నము పెట్టమనిరి. ఆమె ఇంకను వంటకాలేదన్నను - ఆయన నిష్ఠురోక్తులతో 'నాకు అన్నము దొరుకకకాదు, నీ యందలి వాత్సల్యముచే వచ్చితిని' అనిరి. ఆమె ఉన్నసాదకములతో భక్తితో ఆతిథ్యమిచ్చినది. ఆగంతుడు మహాతృప్తితో భోజనముచేసి, గృహిణి వంటయింటికి పోయివచ్చు లోపల వెడలిపోయిరి. ఆమె వచ్చి చూడగా, ఆ యోగి కూర్చుండి భోజనము చేసిన పీటమీాద ఒక

ప్రక్క పిడికెడు వక్కలు, ఇంకొక ప్రక్కన పిడికెడు రూపాయలు పెట్టియుండినవి! ఆమె సంభ్రమాశ్చర్యములకు మేరలేక పోయినది. గబగబా బయటకువచ్చి ఒక పరిచితునికి యిది చెప్పి ఆయనను చూడమనగా, అతడు పరుగెత్తి వీదికొనన కాన్పించిన ఆ విచిత్ర వ్యక్తిని మరల తోడ్కొని వచ్చినాడు. ఆమె, స్వాములు మరచి ఆ పైకమును విడచి వెడలిరను శంకతో దానిని తీసికొని పొమ్మ నిరి. దానికి వారు నవ్వి 'నేను భిక్షుకుడనుగాను, నీపై అభిమాన ముతో ఆ ధన ముంచితిని. నా దగ్గర కొన్ని వందలున్నవి' అని ఒక పోస్టల్ సేవింగ్సుబ్యాంకు ప్యాస్‌బుక్కునుచూపి వెడలి పోయి నారు. ఆవల వారు మరల కనుపించనేలేదు. ఈ రోగి అంగ మచ్చలు సాయిభగవానునకు సరిపోయినవి. భర్త రాగానే యీ శుభోదంతమును చెప్పినది. జాయాపతులు భక్తిభావ చలితులై అంజలి ఘటించిరి.

## నరసింహస్వామివారు

దీనితో వీరికి సాయిదేవునిపై భక్తి కుదిరి ఎదుగ సాగి నది. స్వర్గవాసి పూజ్యపాదులు శ్రీ బి. వి. నరసింహస్వామివారిని (వీరు పూర్వాశ్రమమున సేలం వాస్తవ్యులు. ప్రఖ్యాత అధివక్త, దేశారాధకులు. ఆనీబెసెంటుతోబాటు జీబ్రాల్టర్‌లో అరెస్టు చేయబడి మనదేశమునకు కొనిరాబడిరి. ఆవల రమణమహర్షి శిష్యులై చాల మత గ్రంథముల వ్రాసిరి. తరువాత సాయి

# మందిర నిర్మాతలు



శ్రీ రేబాల లక్ష్మీనరసారెడ్డి - స్వర్గవాసిని సుమిత్రాదేవి

ఆరాధ్యమూర్తి ప్రతిష్ఠాత



శ్రీ మాకాని సుబ్రహ్మణ్యం

భక్తులై మదరాసునందు షిర్డీ గురుదేవుని సందేశముల ప్రచారము చేయుచుండిరి) డాక్టర్ నెల్లూరుకు పిలిపించి సాయి మహిమను గూర్చి ఉపన్యసింపజేసిరి. పలువురు శ్రోతలు ఆయన దివ్య సందేశమును విని సాయిభక్తులైరి.

1940, శరన్నవరాత్రములలో బాబాకు పెద్దపూజ, రూపపటోత్సవము గావింపబడినవి. ఆ తర్వాత డాక్టరు ఆచారిగారు షిర్డి తీర్థసేవకు వెడలిరి. అచట నరసింహస్వామివారిని, శ్రీ ఎస్.బి. కేశవయ్య (సబ్ రిజిస్ట్రారుగా రిటైర్ అయి ప్రస్తుతం మదరాసు షెనాయ్ నగరమున బాబాను పూజించుచు సాయిమతమును వ్యాపింపజేయు సజ్జన భక్తపుంగవులు) గారిని కలుసుకొని, వారి వలన సాయిభగవానుని దివ్యలీలల విని తారకమంత్రము దొరకినట్లు మురిసి, తిరిగివచ్చిరి.

## మందిర స్థాపన

1941 మే 1-వ దినాంకమున, రాజగోపాలచారిగారు రామజవీధిలో ఒక చిన్న బాడుగ యింట సద్గురు సాయిబాబా మందిరమును నెలకొల్పిరి. కందుకూరు వాస్తవ్యులు కాకుమాని వీరబ్రహ్మయ్య శెట్టిగారి విరాళముతో శ్రీవారి తైలచిత్రము ప్రతిష్ఠింపబడి, ఆరాధ్యదేవత అయినారు! ఇట్లు యీ మందిరము భక్తులను ఆకర్షించుచు దినదిన ప్రవర్ధమానమగుచు, మండలమున శ్రీ బాబా భక్తి పీయూషమును దైవపరులకు ప్రసాదించ ప్రారం

భించినది. భక్తుల విరాళములతో ఉభయములు అర్చనలు ఉత్సవములు సాగింపబడుచు వచ్చినవి.

## కార్యనిర్వాహక సంఘము

1944 వరకు రాజగోపాలాచారిగారు ఒక్కరే యీ కార్యభారమునంతయు వహించుచుండిరి. స్వామికి ఒక నూతన మందిరమును నెలకొల్పుట అవసరమని భావించబడినది. ఆ లక్ష్య సిద్ధికి ధన సేకరణకు ఒక పౌర సంఘము నెలకొల్పబడినది. దీనికై సమావేశమైన సభకు శ్రీ నరసింహాస్వాములవారే అధ్యక్షించిరి. అందు నెల్లూరు సాయిభక్తమండలి అవతరించినది! దీనికి ప్రథమ అధ్యక్షులుగా - పౌరావతంసులు - విఖ్యాత అధివక్తలు శ్రీ ముంగమూరు వేంకటసుబ్బరావుగారు ఎన్నుకోబడి, ఇంతవరకును అదే పదవియందుండి అత్యంత భక్తి శ్రద్ధలతో తమ బాధ్యతల నిర్వర్తించుచున్నారు. వీరికి సంబంధము కలిగిన సంస్థలన్నియు పెంపొందుట వీరి చేయివాసి.

1955లో శ్రీ యన్. లక్ష్మీనారాయణగారు (అసిస్టాంట్ ఎలెక్ట్రికల్ ఇంజనీర్) పరిశ్రమించి భక్తమండలికి ఎక్కువమంది సభ్యులను చేర్పించి మండలిని రిజిష్టరు చేయించిరి. వారి ఉత్సాహమే మందిర నిర్మాణనిధిని ప్రారంభించినది. ఇంతవరకు మందిరము బాడుగ యిండ్లలో మారుచువచ్చినది.

## మందిర నిర్మాణము

1956లో, వదాన్యతకు పేర్గాంచిన రేబాల వంశ కీర్తి సోముడు, వివిధ సంస్థలకు భూరి విరాళముల నొసంగుచున్న వితరణ దానశీలుడు, శ్రీ రేబాల లక్ష్మీనరసారెడ్డిగారు (ప్రస్తుతము లోకసభాసదస్యులు) తమంత తాము సతీసమేతముగ ఆచార్యుల వారి దగ్గరకుపోయి నూతన మందిర నిర్మాణమునకు రు 10000/- ఇత్తుమనిరి! డాక్టరుగారు ఆనందముతో ఎగిరి గంతువేసి, దీనికి కావలసిన స్థలమును సమకూర్చుటకు కడంగిరి. రెడ్డిగారికి వారి సతీమణి - స్వర్గవాసిని సుమిత్రాదేవిగారు ప్రోత్సాహమొసంగిరి. ఆమె మనోరథమును యీడేర్చుకొనినది. సాయిభక్తుడు డాక్టర్ ఎస్. విశ్వనాథం, శ్రీ మన్నెము శ్రీనివాసులురెడ్డిగారల తోడ్పాటుతో వివిధ ప్రముఖుల విరాళములతో రెండునెలలో రు 9274/ లు దండి, గాంధినగరమున, స్వతంత్ర ఉద్యానవనమునకు తూర్పున 80 అంకణముల స్థలము మండలిపేర కొనిరి.

1956, విజయ దశమినాడు, సాయిభక్తుడు శ్రీ విశ్వనాథం శెట్టిగారు (ప్రస్తుతము ఆంధ్రప్రభుత్వ సహకార శాఖకు రిజిస్ట్రార్) బాబా మందిరమునకు శంకుస్థాపనము గావించిరి.

వెంటనే శ్రీ లక్ష్మీనరసారెడ్డిగారు రు 14000/- లతో చక్కటి మందిరమును, యీ నగరమునకు భక్తి కేంద్రమేగాక అలంకారప్రాయమైన దానిని నిర్మించి మండలి కొసంగిరి. దీనికి 1958 విజయదశమినాడు ప్రారంభోత్సవము జరిగినది.

## విగ్రహ ప్రతిష్ఠ

మొదటి రూపపటముతోడనే పూజాదికములు ప్రారంభించబడినవి. ఒక అకళంక భక్తుడు, సామాన్య కుటుంబి, ఒక లారీ ఓనరుగా ఉండిన మాకాని సుబ్రహ్మణ్యము, నిజకాంతామణి వెంకటసుబ్బమ్మగారి ప్రోత్సాహముతో తన స్వల్ప నిధినుండి రు 1116/- చంద్రోపల విగ్రహమునకుగా ఒసంగి తమ నామమును సిరస్థాయిగా చేసికొనిరి. శ్రీ లక్ష్మీనరసారెడ్డిగారు స్వయంగా శ్రద్ధవహించి జయపూరులో జీవకళలు ఉట్టిపడే ఒక దివ్య మూర్తిని చలువరాత్రితో చేయించి తెప్పించిరి. ఆ విగ్రహము శాస్త్రోక్తముగా ప్రతిష్ఠింపబడి, (1959 విజయదశమి - విజయ దశమి శ్రీ బాబా యీ భూలోక అవతారముచాలించిన పుణ్య దినము) భక్తకోటిని ఆకర్షించుచు సేవింపబడుచున్నది.

డాక్టర్ రాజగోపాలచారి ధన్యుడు. ఆయన స్వప్నము ఫలించినది. నెల్లూరుకు చక్కటి సద్గురు సాయి మందిరము ఏర్పడినది. అనతి కాలములో విఖ్యాతినొంది, నిరంతరాయ భక్త ప్రవాహము గావించు ప్రార్థన గీతావళిచే ముఖరితమై దీపించు చున్నది. డాక్టరు యీ పుణ్య సంస్థకు కార్యదర్శిగా ఏకైక కార్యకర్తగా సర్వభారముల వహించి తన జీవితమునే బాబా సేవకు అంకితముచేసి మందిరమును పోషించుచున్నారు.

మధురతరమైన నవీన వచన రచన. దేశీయములచే రమ్యతరమై, గంభీరమైన నడకచే ఒప్పారుచున్నది.

— విద్వాన్ షేక్ దావూదు.

శ్రీ రెడ్డిగారి సారస్వత శిల్పమున కుదురుకొన్న కర్ణుడు నవీనధన్వంతముడు. 'ప్రతిగ్రహమనునది ఈ కర్ణుడెరుగనిమాట. దానమొక బేరముగాదు' - ఇట్టి మేలి పలుకులు యీ కబ్బమున మాటిమాటికి చదువగలము. కొత్త వాసాగసులు ఎన్నియో తెనుగువారిని సాగయించుచున్నవి.

— తెనుగులెంక తుమ్మల సీతారామమూర్తి

మిత్రులు కోదండరామరెడ్డిగారు కంఠతోబాటు గుండెగల వచనము వ్రాయుటలో గడితేరినవారు. వారి సాహిత్య వ్యవసాయానికి కర్ణచరిత మేలి పంట. నెల్లూరి నుడికారములు మల్లెలుగా గుప్పుమనుచున్నవి.

— సి. నారాయణరెడ్డి

శైలి, రచనావిధానము చక్కగ ఒకదాని కొకటి తగి పరిశోధన - సిద్ధాంతములు విమర్శనలు మెచ్చదగియున్నవి.

— విద్వాన్ గంటి జోగిసో:

కోదండరామరెడ్డిగారి వచన రచన, సమాసరచన రామణీయకములు. చిన్నయసూరి వేదం వెంకటరాయ తోపింపజేయును. ఇది పాఠ్య గ్రంథముగ ఆంధ్రులు చదు వచన కావ్యము.

— డాక్టర్ బెజవాడ గోపి

ఈ కర్ణచరిత భారతకథా పురంధరసతుందిలము - నవీన సౌరభోపేతమునై యువరసిక బంభర కిశోరములకు ఆ :శలు చున్నది. కర్ణుడు రణరంగమున ఎంత నిరంకుశుడో సార. యీ కవి అంత నిరంకుశుడు. ఇది కావ్యము. ప్రౌఢ దీర్ఘ అపూర్వ పదప్రయోగ చాతురి యిందు గాన్పించును. రెడ్డిగా యందేగాక ఆంధ్రమునందును అందెవేసినచేయి. ఉపమానమ భవములోనున్నవి. కవి భావనా పటిమ రసవంతము. కల్పనలు న

— విద్వాన్ దీపాల పిచ్చయ

మందాకినీ హంసమాల-1 — వెల రు. 3-50